

"రాజు వెడలె...

ఫొటో : ఎస్. గిరిధర్.]

సంవత్సర చందా

రు. 13-0-0

విడిపత్రిక 25న.పై

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 52

సంచిక 44

25-6-58

**Founder : K. NAGESWARA RAO**

విలంబి ఆషాఢ శుద్ధ నవమి బుధవారం


 విషయానుక్రమణిక 

# సోవియట్ శాస్త్రవేత్తల కృషి ★ భూమి పుట్టి ఎన్నేళ్లయింది?

మన భూమి పుట్టి 500 కోట్ల సంవత్సరాలకు పైగానే అయింది. భూమిమీద ప్రాణికోటి ఇప్పటి స్థితికి వచ్చిందంటే భూగోళం ఏర్పడి కనీసం 1000 కోట్ల సంవత్సరాలైనా అయివుంటుందని సోవియట్ శాస్త్ర విజ్ఞాన పరిషత్తు సభ్యుడు ప్రఖ్యాతి సోవియట్ సముద్ర విజ్ఞాన శాస్త్రజ్ఞుడు అయిన లెవ్ జెంకెవిచ్ అభిప్రాయపడుతున్నాడు. సముద్రపు అడుగునగల వృక్ష, తదితర జీవరాసుల పరిశీలనవల్ల ఈ విషయం రుజువైందని ఆయన విశ్వాసం.

వృక్ష జీవరాసులు నాశనమైనందున ఏర్పడినమడ్డి ప్రతివెయ్యేళ్ళకూ సముద్రం అడుగున 0.12అంగుళంవరకూ పేరుకుంటుందనిఅంచనా వేయబడింది. యురేనియమ్ గుణకారాన్ని బట్టి భూమివయస్సు 500 కోట్ల సంవత్సరాలని తెలుస్తూంది. అయితే యురేనియమ్ గుణకారంకంటే యీ "జీవశాస్త్ర గడియారం" కొన్ని విషయాలను చాలా సరిగ్గా తెలియజేస్తుంది వచ్చే కొద్ది సంవత్సరాలలో సముద్రపు అడుగుభాగాన్ని సవిస్తరంగా పరిశీలించడం జరుగుతుంది. ఈనాడు శాస్త్రజ్ఞులు 98 నుండి 114 అడుగుల లోతువరకూ వృక్ష జీవరాసులమడ్డిలోకి వెళ్ళి పరిశీలించడం ద్వారాకోట్ల సంవత్సరాల భూమి చరిత్రను తెలుసుకోగలుగుతున్నారు.

ఇప్పుడు శాస్త్రజ్ఞులు సముద్రపు అడుగుభాగంలో 325 అడుగుల లోతువరకూ చొచ్చుకుపోయే పరికరాన్ని తయారుచేస్తున్నారు. ఇది 300 నుండి 400 కోట్ల సంవత్సరాలవరకూ గడచిన భూగోళ పరిణామ చరిత్రను పరిశీలించడానికి తోడ్పడుతుంది. ముమ్ముందు సముద్రపు అడుగుభాగాన్ని ఎంత లోతుకైనా తొలుచుకుపోగల పరికరాన్ని సోవియట్ శాస్త్రజ్ఞులు నిర్మిస్తారని ప్రొఫెసర్ జెంకెవిచ్ అన్నారు.

### కుజగ్రహ యాత్ర

"అంగారక గ్రహానికి సంబంధించిన రహస్యాలను తెలుసుకునేందుకు అక్కడికి వెళ్ళడం వచ్చే 20 ఏళ్లలో సాధ్యం కావచ్చును" అని సోవియట్ అంతరిక్షయాన విజ్ఞానప్రవీణుడు లియొనిద్ సెదోవ్ వ్రాస్తున్నాడు. ప్రస్తుత కృత్రిమ ఉపగ్రహాల దశనుండి మానవుడు గ్రహాల మధ్య ఎగిరే రాకెట్లదశకు పురోగమించేందుకు ఇక ఆట్టే కాలం పట్టదని ఇతడు అభిప్రాయపడుతున్నాడు.

అంతరిక్షయానానికి సంబంధించిన అసంఖ్యాక సమస్యలను పరిష్కరించడానికి అంతర్జాతీయంగా శాస్త్రజ్ఞుల సహకారం ఎంతో ముఖ్యమని కూడా సెదోవ్ వ్రాస్తున్నాడు.

# సముద్రగర్భ పరిశోధనలు

త్వరలో రెండు నౌకలు హిందూ మహాసముద్రంలో అసాధారణమైన పనులు చేయబోతున్నవి. వీటిలో ఒకటి కెచ్ నౌక. దీనిపేరు (అట్లాంటిస్) ప్రస్తుతం ఎర్ర సముద్రంలో వున్నది. ఈ నౌ. కదలకుండా ఒక చోట నిల్చివుంటుంది. రెండవది మూ, వర్ నౌక. (దీని పేరు 'వీమా') ఇది తొలి నౌకకు మాటిగా (పేలుడు వస్తువులు పేల్చుకుంటూ దానికి అభిముఖంగా పయనిస్తున్నది. వీమా "అట్లాంటిస్" నౌకను సమీపిస్తుండగా వేడెక్కి నీటి అలలు బ్రహ్మాండంగా పైకి ఎగురుతుంటవి.

ఇదంతా చూస్తుంటే ఏదో యుద్ధమా అన్నట్లు భీతిగొల్పుతుంది. కాని ఇది యుద్ధమూ కాదు, ఇవి యుద్ధ నౌకలూ కావు. ఇది శాంతియుత విజ్ఞాన పరిశోధన కార్యక్రమం. శాస్త్రాభివృద్ధికి జరిగే అంతర్జాతీయ సహకార కృషికి మరొక నిదర్శనం.

అంతర్జాతీయ భూభౌతిక విజ్ఞాన సంవత్సరం తాలూకు అమెరికా జాతీయ సంఘంవారి నౌకలు రెండు ఈ వేసవిలో ఎర్ర సముద్రం, మధ్యధరా సముద్రం, హిందూ మహాసముద్రం అట్టడుగుభాగాలలో పరిశోధనలు జరుపబోతున్నవి. దీనితో అంతర్జాతీయ భూభౌతిక విజ్ఞాన సేకరణకు తలపెట్టిన కృషి అటు పైకి నభోంతరాళానికీ ఇటు క్రింద అగాధ సముద్ర గర్భాల అట్టడుగుభాగాల దాకా విస్తరించినట్లవుతుంది.

శాస్త్రవేత్తలు సముద్ర పరిశోధనలు జరపటానికి ఉపయోగించే ఈ రెండు నౌకలలో కెచ్ నౌక 'అట్లాంటిస్' మేసచూసెట్స్ రాష్ట్రంలో వుడ్సుహోలులో గల ఓషియానోగ్రాఫిక్ (సముద్రగర్భ శాస్త్ర) సంస్థకు చెందినది. స్కూనర్ నౌక "వీమా" న్యూయార్కులోని లా మండ్ భూగర్భశాస్త్ర వేధశాలకు చెందినది.

అట్లాంటిస్ నౌక ప్రస్తుతంమధ్యధరాసముద్రంలో అలెగ్జాండ్రియాదిశగా వెళ్ళుతున్నది. అక్కడినుంచి హిందూ మహాసముద్రంలోకి వెళ్లి అక్కడ వీమా నౌకతో పరిశోధన కృషి జరుపనున్నది. ఈ పరిశోధన హిందూమహాసముద్రంలో సెషెల్సు దీవుల సమీపాన జరుగుతుంది

ఈ పరిశోధనలవల్ల సముద్రాల అడుగుభాగాల ఆకారం ఎట్లా ఏర్పాటయింది

# సముద్రగర్భ పరిశోధనలు

అడుగుమట్టంమీద నీటి ప్రవాహాలు, అక్కడ ఉండే చేపలు, ఏకకణజీవాలు యుగయుగాలుగా నీటి అడుగున పేరుకొన్న మడ్డి (సెడిమెంట్)లో ఏర్పడ్డ పొరలుఇంటి వాటిని గురించి బోలెడంత సమాచారం లభిస్తుంది. ఈ మడ్డిపొరలనుబట్టి ఆయా కాలాలలో ఉన్న శీతోష్ణస్థితులు ఎట్లా ఉన్నదీ, ఇంకా అనేక రకాల సమాచారమూ లభిస్తుంది.

అట్లాంటిక్‌లోనూ, హిమాలోనూ కూడా భూకంపవేగం రికార్డు చేయటానికీ, నీటి అడుగున ఫొటోలు తీయటానికీ, నీటి అడుగున వున్న మట్టి నమూనాలు పైకి తీసుకురావటానికి కావలసిన పరికరాలు అమర్చారు. లోతున ఉండే నీటిశాంపిల్సు కూడా పైకి తెచ్చే సౌకర్యం వీటిల్లో ఉన్నది. లోతు నీటిలో జరిగే రసాయనిక ప్రక్రియ విషయం తెలుసుకోటానికి, రేడియో ధార్మిక పదార్థాలతో పరిశీలించటానికి ఈ శాంపిల్సు ఉపకరిస్తవి.

ఈ శాస్త్రవేత్తలు చేసే కృషిలో భూకంప ధ్వనుల సమాచారం అద్భుతమైనది కావచ్చు. ఒక నౌక కదలకుండా నిలిచి ఉంటుంది. రెండవ నౌక దాని ఎదురుగా వస్తూ నిర్దిష్ట సమయాలలో ప్రేలుడు పదార్థాలు జారవిడుస్తూ ఉంటుంది. ఈ ప్రేలుడు పదార్థాలను లోతుకు పంపుతారు. అవి నీటి అడుగు మడ్డిలోకి, లేదా, నీటి అడుగున ఉండే కొండలలోకి కంపనతరంగాలను పంపుతుంది. ఈ తరంగాలు లోతుకుపోయి గట్టి పదార్థానికి దేనికయినా ఢీకొనగానే, అవి తిరిగి వెనుకకు తన్నుకుంటవి. కదలకుండా ఉండే నౌకలోని సున్నిత పరికరాలు దీనిని రికార్డు చేసుంటవి. ఇందువల్ల కలిగే ఫలితాలనుబట్టి సముద్రపు అడుగు నేల ఆకారం, నిర్మాణాలు, దాని మందం తెలుసుకోవచ్చు.

లోతు నీటి ఫొటోగ్రాఫులవల్ల సముద్రపు అడుగు నేల రీతి, ఆకారం, అక్కడి నీటి ప్రవాహాలు మొదలైనవాటి సమాచారం తెలుస్తుంది ఒక పెద్ద కెమెరాను నీటి అడుగుకు పంపుతారు. ఇందులో ఆటోమాటిక్ లైటింగ్ ఏర్పాటు ఉంటుంది. నౌకలోనుంచి ఈ కెమెరా స్విచ్ నొక్కుతారు. ఈ కెమెరాలో ఫిల్ములు కడిగి తయారు చేసినప్పుడు వాటిమీద సముద్రపు అడుగు నేలపై గల అలల ప్రతిబింబాలనుబట్టి క్రింది మట్టాలలో నీటి ప్రవాహాలు ఏ దిక్కుగా ఎంతవరకు ప్రవహిస్తుంటేది తెలుసుకొనవచ్చు. సముద్రపు ఒడ్డున ఇసుక నేలమీద అలలు గాలివాలును చూపినట్టే ఇవి చూపుతవి.

[యు. ఎస్. ఐ. ఎస్.] ★

## భిన్న మార్గాలు

"మీరు ఇంతవయస్సువచ్చేవరకు ఎందుచేత వివాహం చేసుకోలేదు?" వయసు మీరిన పెద్దమనిషిని ఒక కుర్రవాడు ప్రశ్నించాడు.

"నేను యువకుడుగా వున్నంతకాలం 'మంచి' అమ్మాయిని చేసుకోవాలని అనుకున్నాను. ఆ అమ్మాయి చాలాసంవత్సరాలు గడిచిపోయిన తర్వాత కలసింది"

"మరి?"

"కాని ఆ 'మంచి' అమ్మాయి 'మంచి' అబ్బాయి కోసం వెదుకుతోంది." ★

—బోసుబాబు]



# లోకం తీరు



కొంతమందికి ఆఫీసులో స్నేహితులు, బంట్రోతులు మొదలైనవాళ్లు అడిగే అప్పులబాధ ఒక చిక్కు విడదీయలేనిసమస్య!

ఒకటో తారీఖుదగ్గరపడుతోందంటే నాకు భలేభయం! ఒకటో తారీఖుదగ్గరకు వస్తున్న దగ్గరనుంచీ మళ్లీ నెల పదో తారీఖుదాకా నాకు యమగండాలే! ఇంచుమించు నాకు నెలపొడుగునా యీ పరిస్థితి 'రికరింగ్' అన్నమాట! నా సంపాదనను చాలా జాగ్రత్తగా లెక్కలు వేసకొంటూ ఖర్చు పెడతాను. అందువల్ల మళ్ళీ జీతాలు వచ్చేవరకూ నాదగ్గర కొద్దో గొప్పో డబ్బు వుంటూనే వుంటుంది! (ఇదంతా వెనకటిరోజుల్లో లెండి!)

నా జేబులో ఎప్పుడూ డబ్బు వుండటం చూసిన నా ఆఫీసు స్నేహితులు మొదలైన వాళ్ళకి, నన్ను అప్పు అడగాలనిపిస్తుంది. వాళ్ళకి నన్ను చూడగానే అటువంటి బుద్ధి పుడుతుందన్నమాట! వాళ్లకి నిజంగా కావాలో లేదో మరి - నా జేబులో డబ్బు వున్నట్లు వాళ్లకి తెలిసే చాలు! వెంటనే 'అప్పు కావాలి' అంటూ ఎవడో ఒకడు తయారవుతూనే వుంటాడు! ఈ విషయంలో చెప్పుకోదగ్గవాళ్లలో ఒకడు నా బంట్రోతు రాఘవయ్య!

వాడు చేతులు నలుపుకొంటూ, నవ్వుతూ నాదగ్గరకు వచ్చాడంటే చాలు! నాకు అర్థమయిపోతుంది. వాడికి అప్పు కావాలన్నమాట!

ఒక నెలలో మొదటి తారీఖునాడు; -

'అప్పు. అప్పు అంటూ అస్తమానూ నన్నే ఎందుకు అడుగుతావు? నాకన్నా ఎక్కువ జీతం పుచ్చుకొంటున్నారే ఆ రామకృష్ణగారు! ఆయన్ని అడగరాదూ?' అని కొంచెం కోపంగా కసిరాను రాఘవయ్యను.

'ఆయన సంగతి ఎందుకులెండి! అర్జంటుగా యిరవైరూపాయలు కావాలిసార్! ఫస్టు తారీఖునాడు ఇచ్చేస్తాను' అంటూ చేతులు నలుపుకొంటూ బతిమాలాడు రాఘవయ్య.

'ఇవాళేకదా మొదటి తారీఖు! అంటే, సాయంత్రం జీతాలు ఇవ్వగానే ఇచ్చేస్తావా?' అన్నాను.

'అదికాదుసార్! ఈ నెల తలవని తలంపుగా చాలా యిబ్బందివచ్చిపడిందిసార్! మీ డబ్బు మళ్ళీ నెలఫస్టు తారీఖున తప్పకుండా యిచ్చేస్తాను' అంటూ యింకా బతిమాలాడు రాఘవయ్య.

'ప్రతీ నెలా ఈ పల్లవి మామూలే'—అని గొణుక్కొంటూ, వాడికి ఇరవై రూపాయలు యిచ్చాను! 'ధర్మరాజులు' అని నన్ను పొగడటం—డబ్బు యిచ్చినప్పుడల్లా—వాడికి అలవాటు. ఈ సారికూడా వాడి అలవాటు వాడు మర్చిపోలేదు!

ఆ తర్వాత మాకు జీతాలు యిచ్చారు. నా ఆఫీసు పనిలో నేను లీనమైపోయాను. మూర్తి నా పక్కకు ఎప్పుడొచ్చాడో నేను చూడనే లేదు. వాడు అన్నమాటతో నేను ఉలిక్కిపడ్డాను.

'ఒకేయ్! పర్సు తియ్యరా!' అన్నాడు మూర్తి.

ఎన్. శ్రీ కృష్ణారావు

ప్రతీ నెలా ఒకటో తారీఖునాడు, నా పర్సులో ఎంత డబ్బు వుందో చూడాలనే కుతూహలం వాడికి ఎందుకు కలుగుతుందో నాకు తెలుసు! వాడికికూడా ఒకటో తారీఖునాడే అప్పు కావాలి! ప్రతీ నెలా నా దగ్గరనుంచి ముప్ఫయ్యో, నలభయ్యో అప్పు పట్టుకొని వెళ్లకపోతే వాడికి నిద్ర పట్టదు! అందుచేత నా దగర అప్పుచేయటం వాడికి అలవాటు! ఈ చేబదుళ్ళు పుచ్చుకోవటంలో మూర్తి మహా ఉద్దండుడు! వీడి వ్యవహారం అంతా చాలా స్పెషల్! అధికాంభిక్ష అంటారు మీకు తెలుసా? అదే పద్ధతిలో వీడు సంచరించి, ఒకో సమయంలో నా జేబులోని పర్సు తనే బయటకు లాగేసి, తనకి కావల్సింది తనే తీసుకొని వెళ్లిపోతాడు!

ఒక రోజున,—

'ఏరా! ఎప్పుడు చూసినా నన్నే అప్పిమ్మంటూ పీక్కుతింటావెందుకు? ఈసారి ఆ రామకృష్ణగారిని అడుగు. ఈ నెల నాకు చాలా ఖర్చులున్నాయి' అన్నాను మూర్తితో.

"ఒకేయ్! రామకృష్ణగారినే అడుగుతానో గోవిందకృష్ణగారినో అడుగుతానో నీకు అనవసరం! నువ్విస్తావా? ఇవ్వవా? ఆన్సర్ టుది పాయింట్" అన్నాడు మూర్తి కోపంగా.

చివరకు వాడే గెల్చాడు. వాడికి కావలసిన డబ్బు వాడు పట్టుకుపోయాడు!

మా ఆఫీసులో రఘునాథ్, అప్పులు అడగటం విషయంలో ఓ కొత్తపద్ధతి అవలంబిస్తాడు! ఈ పద్ధతి ఏ యూనివర్సిటీలో చెప్పారో తెలియలేదు!

'డబ్బులు కావాలి' అని నోరువిప్పి అడగటం ఆయనకు సిగ్గు! అందుకని ఒక చిన్న కాగితంమీద—'ఇంపార్టెంట్! అర్జంటుగా యిరవైరూపాయలు కావాలి! ప్లీజ్! దయచేసి 'హెల్ప్ చెయ్యండి' అని వ్రాసి ఆ కాగితాన్ని నాకుఇచ్చి మౌనంగానిలబడతాడు రఘునాథ్! నేనుకూడా మౌనంగానే అది చదువుకొని—'సార్! ఈ నెల నాకు చాలా ఖర్చులున్నాయి. ఈసారికి ఆ రామకృష్ణగారిని అడిగిచూడండి' అని వ్రాసి ఇచ్చేస్తాను. ఇంక గబగబా ప్లీజ్, ప్లీజ్ అంటూ మాట్లేస్తాడు రఘునాథ్!

"రామకృష్ణగారి సంగతంతా వేరులెండి! మీరు కాదనకూడదు. చాలా అవసరం సార్! ప్లీజ్! ప్లీజ్" అంటూ 'ప్లీజ్' అనే ఒక్కమాటతో నాకుంపతెంపి డబ్బు పట్టుకెళ్ళిపోతాడు రఘునాథ్.

ఇల్లాగే నాదగ్గర ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా సంచరించి డబ్బు పట్టుకుపోతారు. ఎవళ్ళనీ కాదనలేని దుర్గుణంఒకటి నాలో వుంది! అందుచేత అడిగినవాళ్ళకి లేదనకుండా ఇస్తూనే వుంటేవాడిని! కాని ఒక్క విషయంలోమాత్రం వాళ్లందరిలోనూ ఏకాభిప్రాయం కనిపిస్తుంది. "రామకృష్ణగారిని ఈసారిఅడగండి"—అని ఎవరితో చెప్పినా సరే—అందుకు నాకు సరైన జవాబుమాత్రంరాదు! ఆయన్ని అప్పు అడగాలంటే వీళ్లందరికీ హడల్! కానీ ఆ రామకృష్ణగారు అందరినీ భయపెట్టేమనిషా

అంటే అదీకాదు మరి! ఆయనకన్నా మంచివారు, దయగలవారు మరొకరుండరేమో అంటే ఆశ్చర్యం లేదు.

కాని నేను...? కొన్ని సమయాల్లో నాకు భలేకోపం వస్తుంది! పుచ్చుకొన్న చేబదులు అన్నమాట ప్రకారం ఇవ్వక పోయారంటే వాళ్లను తిడతాను! కొడతాను కూడా! ఆఫీసులో అందరిముందూ అవమానం కూడా చేస్తాను! అందుచేత నాకు అందరూ భయపడి, నాదగ్గర పుచుకొన్న చేబదులు మర్యాదగా, అన్నమాట ప్రకారం, తిరిగి ఇచ్చేస్తారు. రోజులు గడిచినకొద్దీ చేబదుళ్లు పట్టుకెళ్లేవారి సంఖ్య, డబ్బు మొత్తమూ కూడా ఎక్కువయాయి! ఎల్లాగా ఒకటో తారీఖున ఇచ్చేస్తున్నారు కదా అనేది నాకు ఒక నిశ్చలమైన ధైర్యం. నేను కూడా లేదనకుండా ఇనూనే వచ్చాను. ఇంకా కొన్నాళ్ళకి—చివరికి నేనే ఎక్కతేసా అప్పుచేసి అప్పులు ఇవ్వాల్సిన గతికూడా నాకుపట్టింది! ఇంకా కొన్నాళ్ళకి ఒక్కొక్కరే నా దగ్గరకురావటం మానేశారు! ఆసమయంలో నాకు వాళ్ళందరి దగ్గరనుంచీ రావలసిన బాకీలమొత్తం రెండువేల రూపాయలు! కాని ఒక్కడు కూడా పుచ్చుకొన్న డబ్బు తిరిగి ఇవ్వదల్చుకోనట్లే పంచరిస్తూవచ్చారు! గట్టిగా అడిగితే నామీద కలబడి నన్ను కొట్టటానికి కూడా వాళ్ళు చేతులు కలిపేసుకొన్నారు! నాకు ఒళ్ళు మండిపోయింది! ఉపకారానికిపోతే అపకారం ఎదురొచ్చిందన్నట్లు— నా దగర డబ్బు లేకపోయినా నానా అవస్థలూ పడి నేను పరాయిచోట అప్పులుతెచ్చి వీళ్ళందరికీ పెట్టుబడి పెటినందుకు ఫలితం చివరకు నేనే అప్పులవాణ్ణయిపోయి – పదిమందిలోనూ తలెత్తుకు తిరగలేక – చావకుండా, బతక్కుండా రోజులు గడపాల్సిన ఘోర దరిద్ర స్థితి పట్టింది.

ఈ సమయంలో ఆ రామకృష్ణగారిని చూసి నాకు అసూయ కలిగింది! నేనూ ఆయనా ఒకే ఆఫీసులో అయిదు సంవత్సరాలుగా పనిచేస్తూ వస్తూన్నాం. కాని ఈ అయిదు సంవత్సరాలలోనూ ఒక్క రోజున కూడా ఆయన్ని ఎవ్వరూ అప్పుఅడిగినట్లు నాకు తెలియ లేదు! ఆయన్ని అప్పు ఎందుకు అడగరు? భయమా...? లేక ఆయన ఏమైనా మంత్రం పెట్టేసుకొన్నామా? అనేది నాకు అర్థం కాలేదు ఎంత మందిని, ఎన్నిసారు అడిగినా ఎవరూ కూడా సరిగా జవాబు చెప్పలేదు. అంగుచేత—అసలు యీ సంగతి ఏమిటో ఆయన్నే అడిగి తెలుసుకోవాలను కొన్నాను.

ఒకరోజున ఆయన దగ్గరకువెళ్లి రెండు వందలు అప్పు కావాలని ఆయన్ని అడిగాను.

"రెండు వందలా?"—అని అంటూనే ఆయన తన డ్రాయరు తెరిచారు. "అడిగిన వెంటనే ఇంత సులభంగా డబ్బు ఇచ్చే ఈయన్ని అప్పు అడగటానికి వీళ్లంతా ఎందుకింత భయపడుతున్నారో?"—అని నేను ఆలోచిస్తున్న సమయంలో, ఆయన డ్రాయరు అరలోనుంచి తన డైరీ బయటకు తీసి, అందులో ఒక పేజిలో రాసినది ఏదో చదువుకొని—"ప్రస్తుతం నా దగ్గర అంత డబ్బులేదు అందుచేత నలభైరూపాయలు ఇస్తాను తీసికెళ్లండి" అని అంటూ నేను ఇంక మాట్లాడటానికి అవకాశం లేకుండా నాలుగు పదిరూపాయల కాగితాలూ నా చేతిలో పెట్టి—"నేను చాలా అర్జంటు పని మీద బయటకు వెళ్తున్నాను తర్వాత మాటాడుకొందాం" అని రామకృష్ణగారు గబగబా ఆఫీసులోనుంచి వెళ్లిపోయారు. ఆయన ఆఫీసులో చాలా బిజీగా వుంటారని నాకు తెలుసు, థాంక్సు అనిమాత్రం అన్నాను. అడిగినంతా యివ్వకపోయినా లేదనకుండా కొంత యిచ్చినందుకు నాకు కొంచెం సంతోషమే కలిగింది.

రామకృష్ణగారి దగ్గర ఇంత సులభంగా అప్పు సంపాదించటం సాధ్యమయినప్పుడు, ఆఫీసులో వాళ్ళంతా ఆయన్ని అప్పు అడగటానికి ఎందుకు భయపడుతున్నారో నాకు అర్థం కాలేదు.

నేను రామకృష్ణగారి దగ్గర అప్పు పుచ్చుకొని రెండునెలలు దాటింది. కాని ఆయన మాత్రం పుచ్చుకొన్న చేబదులు ఎప్పుడు ఇస్తావని మొదట్లోనూ అడగలేదు! రెండు నెలల తర్వాతేనా అడగలేదు! నాకు చాలా ఆశ్చర్యం కలిగింది! నేను కూడా మాట్లాడక ఊరుకొన్నాను. మూడోనెల, నాలుగోనెల




సింగారవము
—చిత్రకారుడు: ఎం. వెంకటరామయ్య]

ఆరో నెల కూడా గడిచిపోయింది! ఆయన మాత్రం ఆ నలభైరూపాయల సంగతి అసలు ప్రస్తాపించనే లేదు. ఎప్పటి లాగనే చాలా సహజంగానూ చాలా చనువుగానూ మేము మాట్లాడుకొంటూనే వున్నాం. ఆ డబ్బు సంగతి ఒకవేళ ఆయన మర్చిపోయారేమో అనే అనుమానంకూడా నాకు కలిగింది! ఒకరోజున ఆయన్నే అడిగేశాను:

"ఏమండీ రామకృష్ణగారూ! మీరు ఆరు నెలలకిందట నాకు నలభైరూపాయలు అప్పు యిచ్చారన్న సంగతి మర్చిపోయినట్టు న్నారే!" అని నవ్వాను—అదేదో పెద్ద ఛలోక్తిలా!

"ఎందుకు జ్ఞాపకం లేదు? బాగా జ్ఞాపకం వుంది. పైగా నా డైరీలో రాసికూడా వుంచాను" అన్నారు రామకృష్ణగారు నవ్వుతూనే.

"మరి ఆ డబ్బు తిరిగి ఇచ్చేయమని నన్నెందుకు అడగలేదు? నేనయితేనా..." నా మాటలు పూర్తికాలేదు. ఆయన జవాబిచ్చారు:

"తమరు అలాంటి పెద్దమనుష్యులు కాబట్టే ఈనాడు అప్పుల పాలయిపోయారు" అంటూ వెటకారంగా నవ్వారు.

నాకు చెంపఛెళ్లుమన్నట్లయింది!

"నేను అప్పులపాలయానని మీకెల్లా తెలుసు?"

"ఒకళ్ళువచ్చి చెప్పాలికూడానా? మీ సంగతి తెలియనివాళ్ళెవరు? ఒకవిధంగా ఆపరదాన కర్ణులు! మరోకవిధంగా పక్కా కాబూలీవాలా! భవిష్యత్తులో ఏదోఒక రోజున మీరు అప్పులపాలయిపోయి అవస్థ పడతారని నేను ఏనాడో అనుకొన్నాను. ఇటువంటి విషయాలు చెప్పినాకూడా అర్థం కాదు మీలాంటివారికి. ఎవరికివారికే అనుభవం అవాలి! అందుకనే మీవిషయంలో నేను ఏమీకలగజేసుకోలేదు."

ఆయన మాటలకి నేను సిగ్గుపడిపోయాను.

"అయితే అప్పుఇచ్చి నోరుమూసుకొని కూర్చోవాలన్నమాట!"

"అవును. సరిగా అంతే! ఒకసారి ఇచ్చారంటే మళ్లీ ఎప్పుడు ఇసారనికూడా అడక్కూడదు! అప్పులవిషయంలో నేను కనిపెట్టిన ఒక అనుభవసూత్రం ఇది!

"తిరిగి ఎప్పుడిస్తావని అడక్కపోతే ఎవరికి నష్టం? మనకేకదా! ఈ స్వభావం సంగతి బయటవాళ్లకు తెలిసిందంటే, అందరూ చేబదులు కావాలంటూ తయారవుతారు గాని మళ్ళీ ఇవ్వరు కదా?

"తిరిగి ఇవ్వరని తెలిసే నేను వాళ్ళకి అప్పు ఇస్తాను!"

"చాలా విచిత్రంగా మాట్లాడుతున్నారే! ఇందులో మీకు ఏమిటి లాభం!"

"లాభమా? భలేప్రశ్న! అడిగిన వాడికి లేదనకుండా ఎన్నిసార్లు కావాలంటే అన్నిసార్లూ మీరు అప్పులు ఇచ్చారు కాబట్టే మీరు యీనాడు రెండువేల రూపాయల అప్పులో మునిగిపోయారు! కాని మన ఆఫీసులో కాని, బయటకాని అందరూ కూడా నన్ను అప్పు అడగటానికి ఎందుకు భయపడుతున్నారో తెలుసా? ఇచ్చిన అప్పుసంగతి నేను ఇంక మాట్లాడను! అందుచేత మొదట్లో పుచ్చుకొన్న డబ్బు తిరిగి ఇవ్వక పోవటంవల్ల కొత్తగా అప్పు అడగటానికి వాళ్ళకి సిగ్గు! భయం!

"అయితే అందరూ మీదగ్గర అప్పు పటికెళ్ళిన వాళ్ళేనా? ఇందువల్ల మీకు చాలా నష్టం కలిగివుంటుందే!"

"నష్టం ఎప్పుడూ రాదు! పైగా వాళ్ళు అడిగారుకదా అని, వాళ్ళు అడిగినంతా నేను ఇవ్వను! ఎవరెవరి విషయంలో నేను ఎంత నష్టపోవచ్చో ముందుగానే నాడైరీలో నేను వ్రాసి పెట్టుకొన్నాను. మీ విషయంలో మీరు నన్ను వెయ్యిరూపాయలు అడిగినా కూడా మీకు నేను నలభై రూపాయలు మాత్రమే ఇస్తాను! మీకు ఇష్టమైతే పట్టుకెళ్తారు, లేకపోతే మానేస్తారు. ఎనిమిది నెలలకిందట మీరు మద్రాసు వెళ్ళినప్పుడు నాకు ఒక పనిచేసిపెట్టారు మీరు. అందుకు నేను ఒక బహుమానం ఇస్తానని మీకు నేను వాగ్దానంచేశాను జ్ఞాపకముందా? ఆ బహుమానంవిలువ నలభైరూపాయలు! అందుచేత ఆబహుమానాన్ని పేరుమార్చి మీకుఅప్పుగా ఇచ్చాను! అందుచేతనే "మళ్ళీ ఎప్పుడిస్తారని" నేను మిమ్మల్ని అడగలేదు. ఇవాళ తొందరగా ఇంటికి వెళ్ళాలి. మరి శలవు' అంటూ గబగబా ఆయన వెళ్ళిపోయారు.

నేను కళ్ళు తేలేశాను!

"అరెరె! ఇంత సూక్ష్మసూత్రం నాకు తోచలేదుకదా!" అని విచారిస్తూ యిల్లు చేరాను.

దేర్ ఫార్ —డియర్ ఫ్రెండ్స్ ఆఫీసులోనూ బయటా మీ స్నేహితులు బంధువులు మొదలైనవాళ్ళు ఎవరైనా మిమ్మల్ని అప్పులు అడిగితే, నా మిత్రులు రామకృష్ణగారు నాకు ఇచ్చిన సలహా పాటించండి! మొదట్లో కొద్దిగా నష్టపోయినా ఆతర్వాత మీకు ఆటువంటి బాధలు ఇంకరావు! మీరు సంతోషంగా వుండగలరు కూడా!

* * *

ఇంక ఈ వ్యాసంలోని ఆఖరి సమస్య: కొంతమంది ఉన్నారు-వారికి, వారి ఇళ్ళకు వచ్చే అతిథులను ఇంట్లోనుంచి వెళ్ళగొట్టటం ఎలాగనేది వాళ్ళకి చాలా పెద్ద సమస్య! నిజానికి ఈ విషయం అందరికీ కూడా తెలియటం చాలా అవసరం అనేది మీరంతా ఒప్పుకొంటారని నా నమ్మకం! ఈరోజుల్లో మనం వుండటానికే ఎలకకన్నాల్లాంటి చిన్న చిన్న ఇళ్ళల్లో నానా అవస్థలూ పడుతూ, కాలక్షేపం చేస్తూంటే వున్న బాధలు చాలనట్లు మన యింటికి స్నేహితులనీ, బంధువులనీ ఎవళ్లో ఒకళ్ళు వస్తూ నెలల తరబడి కదలకుండా తిష్ఠవేస్తే వాళ్ళని ఎల్లా వెళ్ళగొట్టటమా అని ఆలోచించటం నిజంగా చాలా అవసరం కూడా!

అసలు నన్నడిగితే - స్కూళ్ళలో అనేక ఇతర విషయాలను గురించి పాఠాలు చెబుతారు కాని ఇంటికి వచ్చే అతిథులను వెళ్ళగొట్టటం ఎల్లాగో కూడా పాఠాలుగా చెప్పాలనే నేనంటాను! ఈసమస్యనే ఒక మహానుభావుడు కొత్త విద్యావిధానాన్ని అసెంబ్లీలో ప్రతిపాదించాడు! కాని ఆయనగారు కూడా ఈ విషయం జోలికి ఎందుకు వెళ్లలేదో నాకు అర్థంకాలేదు.

ఇంటికి వచ్చే అతిథులను వెళ్ళగొట్టటానికి గృహపతిగారు చేతికర్రను ఉపయోగిస్తాడు! గృహిణిగారు రోకలిని ఉపయోగిస్తారు! వారి సంతానం చేతికి ఏది అందితే అదే ఉపయోగిస్తారు!—ఈ జాతి నాకు బాగా తెలుసులెండి! ఆటువంటి సంఘటన చూస్తే నవ్వి నవ్వి చివరకు కడుపులో పోట్లుకూడా వస్తాయి మనకు. ఇటువంటి సాధనాలతో

(55-వ పేజీ చూడండి)

# కేశవ నామాలు

"ఏమండీ...మాస్టారు ... మీ పేరేమి టన్నారూ?" అంటు ఇప్పుడిప్పుడే రైలులో పరిచయం కలిగిన పరిచితుడు అడిగితే అతడు నవ్వుతున్నాడు. అతడు నవ్వుతున్నాడంటే, అర్థం ఉంటే నవ్వాడు. ఆ పరిచితునికి తెలియక పోవచ్చు; అర్థం కాకపోవచ్చు. "మాస్టారూ!" అని పిలుస్తూ పేరు ఇంకెందుకు? పేరు ప్రయోజనం అందుకే కదా! తద్వారా అనేక ఇతర చిన్న ప్రయోజనాలని సాధించుకోవచ్చు. అట్టి పిల్ల ప్రయోజనాలను పొందుదామనో? ఏమో?

"మాస్టారూ!" అన్న ఆసామీ నవ్వాడు. అతడు నవ్వాడని కాదు ఇతడు నవ్వింది. "మీ పేరేమి"టని అతడు అడుగుతే తకామని "శంభుగిరి ఉమామహేశ్వరశర్మ" అని చెప్పి, చిన్నగా ఇకిలించి చూశాడు అతనివైపు. తను "అదిమర్యాదగా" మాస్టారూ...మీ పేరేమిటన్నారే" అంటే" చెప్పడేం?" అనుకున్నాడు శంభుగిరి...అందుకే శంభుగిరికి—నవ్వు వచ్చింది.

కొంతమంది పేరు అడగ్గానే తడుముకోకుండా చెప్పి పారేసారు అడగడమే తడవుగా కొంతమంది ఉన్నారు...వారిదగ్గరే వస్తుంది అంత చిక్కును. ఆడపిల్లల్లా ఏకదిబ్బై పోతారే. సిగ్గుపడి, తలక్రిందకో, పైకో. ప్రక్కకో చూస్తారు. అదోలా మొహం పెట్టి, పళ్ళు ఇగిలించినట్లు ఒకమాటు పదహారుపళ్ళూ చూపించి, సన్నగా చెపుతారు. కొంతమంది "ఎందుకు, "పానిద్దూ" అన్నట్లు మొహం పెడతారు. "పేరు చెపితే నువ్వు జడుసుకుంటావురా" అన్నభావం కూడా ఉంటుంది వాళ్ళ తీరులో! కొన్నిచోట్ల అది సంభవమే కూడాను. "ఏవ్యాఘ్రేశ్వర అవధానో!" అని అలవాటుపడిన ఆ పేరు ఆసామీ ఠక్కున ఒక పట్టులో చెప్పతాడు. ఇక మన గొడవ చూడాలి విన్నాక! మన కర్ణేంద్రియం తికమక మవుతుంది. "ఏం చెయ్య లేమిటి" అంటుంది కర్ణేంద్రియం బుద్ధితో! "ఒక్కమాటు బుజ్జిగోక్కుని నోటిలో అంటుందికదా", "అయి, అయి" అవమని పళ్ళు ఇగిలిస్తా! నోరు అలా చేస్తుంది అపుడు.,

మరికొంతమంది, ఒక్క క్షణం అంటే ఒక్క క్షణం సిగ్గుపడి, ముందర నసుగుతూ, నసిగి, తర్వాత భయం లేదు పోయిందన్నట్లు, గభుక్కున, ఒక్కమాటు, తృప్తిలో చెప్పి పారేస్తారు తమ పేరును. ఉదాహరణకు... "మీ రేమిటి స్వామీ, చెప్పారుకాదని!" దాసరి వరాహరావు అడుగుతే "దా...స..రి" అని నసిగి, విడివిడిగా అక్షరాన్ని విడదీసి పలుకుతూ, ఎందుకొచ్చింది గొడవ, చెప్పి పారేసే పోయె! అన్న ధ్వనిలో, "వరాహరావు" అని గభుక్కున అంటాడు. వరాహరావు అనడానికి 'దా'ని ఉచ్చరించడానికి పుచ్చుకున్నంత కాలం కూడా పుచ్చుకోడు!

ఇంకోరకం ఉంది. మనం నానా తాపత్రయం పడాలి వాళ్ళతో. వాళ్ళపేరు చెప్పించడానికి - వాళ్లు ఒకపట్టాన చెప్పరు. మనల్ని తిప్పుదోవలు పట్టించడానికి - ప్రయత్నించేస్తారు. శుభ్రమయిన పేరు, ఉమాపతి చెప్పుకోడు. అతణ్ణి తెలియనివాళ్లు అడుగుతే, అతను, అతి తెలివిగా, సందు ఏమీ ఇవ్వకుండా, ధోరణి మార్చేసి, అవతల వాడు వేసిన ప్రశ్నే మరిపింప చేసాడు.

## వల్లూరి కృష్ణారావు

ఒకమాటు అన్నాను "నీపేరు చెప్పడానికి అంత గొడవ దేనికి?" అంటే; వాడు అంటాడూ..., "నా పేరు చెపితే అంతతో అవదు. నా కథలుగురించి, పత్రికలగురించి, పత్రికల రుచులుగురించీ..."

"రుచులేమిటి...రుచులు?"అని మధ్యలో అడ్డు వేశాను.

వాడు చెప్పడం మొదలు పెట్టాడు. (విందాం!) "రుచులంటే...మనకు [illegible]న్ని రుచులు ఎలా అయితే ఉన్నాయో, పత్రికలకు కూడా కొన్ని రుచులు ఉన్నాయి. ఒక పత్రికలో మనం చూసే కథలనుబట్టి మనం దాని "రుచి"ని కనిపెట్టగలం. ఆ 'రుచి' ని రచయితలు అనుసరిస్తారు. ఉదాహరణకు...ఒక పత్రికకు మనం ఏడవాలి. ఉత్తినే, ఏడూస్తూ వ్రాసిన, ఏడుపుకథను, ఏడుపు మయంగా ఉంటే, అది అచ్చుపడుతుంది. అలాంటి కథలు సాధారణంగా "కన్నీటికడలి", "కన్నీరు మున్నీరు", "శశికళ్ళోళ్ళలో కన్నీటి కాలువ!" లాంటివి.

ఇకపోతే ఇంకో పత్రిక్కి మనం నవ్వాలి. చూడు ఎంత కాంట్రాస్! నవ్వుతూ ఏకదిబ్బై పోవాలి. "మీరేం చేసినా సరి, ఇక నేనుమాత్రం నవ్వలేనండీ!" అనగలగాలి ఆ కథ చదువుతోంటే. "అబ్బ! ఉండురూ", "ఊ, మీరు మరీనూ"... లాంటి కథలు ఈ కోవకు చెందాలి సాధారణంగా!

"మరో పత్రిక్కి మనం తిట్టాలి. ఆ పత్రిక నాధునికి మనం ఎంత తిడితే ఆయనకు అంత సరదా. వాడు వెధవ...నీచు వెధవ అంటే, ఆయనకు సంతుష్టిగా భోజనం చేసి, తాంబులం నములుతూ, వాపాలు లెక్కపెడుతూ, ఊగుటుయ్యాలమీద వెల్లకిలా పడుకున్నట్లుంటుంది.

"ఇంకోరకం పత్రిక ఉంది దానికీ గొడవే అక్కరేదు. దాని 'ఫీల్డు' అంతా వేరు. మాయలు మంత్రాలు కావాలి "కీలుగుఱ్ఱంపై రాజకుమారుడు" లాంటి కథ మనల్ని మరో ప్రపంచంలోకి లాక్కుపోతుంది.

"ఇంకోదానికి 'త్రిల్సు', 'వండర్సు' కావాలి కథ పేరు చూడ్డంతోటే "చచ్చాం ఫో" అనేసి తబ్బిబ్బులుపడాలి "ప్రఖ్యాత సినీతారదచ్చి ఊరగకొంది ఆ మట్న" "విరమల్లుని అంతర్ధానం! లాంటి కథలు. "కోటీశ్వరుడు శేషుబాబు ఎక్కడ? అని మనల్నే ప్రశ్నిస్తుంది. పేరు చూసీనే దీన్ని ఎలాగయినా చదవాలనే తహ, తహ, ఆకాంక్ష కలగాలి పత్రికలో!

మొత్తంమీద నా చేత వాగించావు... తెలిసిందా"...అనేసి ఊరుకొన్నాడు.

"తెలిసింది తెలిసింది" అన్నాను.

"జంట స్వరాలు మాను." అని మందలించాడు.

మానేశాను!

తర్వాత ఉమాపతి చెప్పిందేమంటే, (పెద్ద ప్రఖ్యాత రచయితలా మొహం పెట్టాడు. వెధవ గొప్పా వీడూను.) తనపేరు చెపితేట "ఒయబ్బా! వీడా, ఆ పప్పు ఉమాపతి! ఎవడో అనుకున్నాం. పెద్ద పులిలా ఉంటాడనుకున్నాం—బుల్లి అప్పచ్చిలా ఉన్నాడు!" అనుకుంటారుట! పైగా, వీడు వాళ్ళని వదిలేదాకా, 'జూ' లోని జంతువుని చూసినటు చూస్తారట (గొప్ప!) ఈ తతంగం అంతా ఎందుకని వీడు చెప్పట తన పేరును సాధారణంగా...ఇంకా ఏవేవో చెప్పాడు వెధవ సెల్ఫు!

వాడు రచయిత మాత్రం అవును. కాని వాడు అనుకొన్నంత గొప్పవాడు మాత్రం కాదు. వాడి వాదనలో కొంతనిజం ఉన్నా పెద్ద ప్రఖ్యాత రచయితనని భ్రమించడంలో వాడి మతిభ్రమణం కనపడింది నాకు!

పెద్ద రచయిత, శిల్పి రాజకీయ వేత్త, విద్వాంసుడు, గానకోవిదుడు మొ॥ వారు కొత్త చోట్ల, తమకు తాము పేర్లు చెప్పుకోరు. అలా చెప్పుకోకపోవడం, "తమ అహం"కు చిహ్నం ఉమాపతి చెప్పింది ఒక కారణం. మరి ఒక కారణం కూడా ఉంది...

పెద్ద పెద్ద ప్రభువులు...తమ పేరుతాము చెప్పుకోవడం నీచాతి నీచంగా భావించే వారుట...తమ పేరును చెప్పుకోవడం నీచంగా భావించే, వారు ఆ పేరు ఇతరుల నోటి వెంట వినడం ఘనంగా భావించడం విచిత్రమే!

శంభుగిరి అతణ్ణి గురించి "ఏదో అయి వుండవచ్చు అనుకొన్నాడు. ఇతను శిల్పా? రాజకీయ వేత్తా? రచయితా? మరి నా బొందా?" అని కూడా అనుకొన్నాడు చివరన. తను అనుకున్న పదార్థాలను ఒక్కొక్కటే తీసి, అతనికి తగిలించి చూడసాగాడు శంభుగిరి.

ఇతడు శిల్పేమో!

వెంటనే కాదు అనుకొన్నాడు. "మనిషి పోని పల్చగా ఉన్నా కళ్ళలో కాంతులు లేవు శిల్పికి ఏవేవో కాంతులు ఉంటాయట. అతని కళ్ళు వట్టి మన కళ్ళు! అతని చేతిని, తేలిగ్గ పరీక్ష చేశాడు. "చస్" అనుకొన్నాడు. "వీడి మొహం, వీడి మూతి, వీడి తలకాయ, వీడి బొంద..." ఇందులో ఏ ఒక్క దాని లోనూ శిల్పం లేదు. వీడు శిల్పి కాదు. పాడూ కాదు."

వీడు రాజకీయ నాయకుడా?

"కాదు. వెనక కుట్ర నాగమ్మ. కుట్ర వెధవని కాదు. రాజకీయానికి కుట్రేమిటి పెద్దేమిటి? చదువుకోవాలా మన్నుకావాలా? ఏమీ అక్కరేదు. వీడు ప్యాంటు వేశాడు అనుకో...అయినా వాడు మాత్రం కాదు. రాజకీయాలు పనిగా పెట్టుకొన్న వాడి కంఠం ఎప్పుడూ ఖంగు మంటుంది. అసలు మాటాడ్డు. ముచ్చు!"

వీడు రచయిత అవునా?

"అబ్బే! వీడి అబ్జర్వేషన్ తగలేసిరి. పండిన పసిడిచేలన్నీ వదలి, కూడూగు అవతల ముళ్ళ దిబ్బలమీద సారిస్తాడు దృష్టిని... వీడికాడు!"

గానం...?

"ఏమో చెప్పలేం" గభుక్కున..."నా బొంద! ఏమీ లేదు. "ఇందాక, ఆముసాడు పాడితే మిటుకు మిటుకూ చూడ్డం తప్పితే అహ్లాదం ఏదీ!"

శంభుగిరి ఒక నిర్ధారణకి వచ్చాడు.

"వీడు ఏమీ కాదయ్యా!

అయినా, తనలో తాను ఇలా కొట్టుమిట్టాడ్డం ఎందుకు? శుభ్రంగా కనుక్కోక! ఏదెందీ అడిగి తెలుసుకోవాలనే తహతహ శంభుగిరిలో ఎక్కువైంది. గుప్త సత్యాన్ని తెలుసుకోవాలనే మానవ దౌర్బల్యం ఇప్పటిదికాదు. అనాది మానవుడినుండీ, ఈ దౌర్బల్యం విడకుండా వస్తూనే ఉంది. బ్రహ్మరాక్షసి విశాలమైన సౌధమంతా వదలి "చూడు, యువరాజా! ఆ గది మాత్రమే చూడకు" అంటే, ఆ యువరాజా ఆగడో! ఆగడో!! అంటూ కూర్చుంటాడు. చంద్రగోళం ఏమిటి? దాని అంతు కనుక్కోవాలి? ఎవరెస్టు ఎక్కాలి. ఎక్కారు. అక్కడున్నదేమిటి? మంచు ముద్ద!! అంతేనా...?

అతడిపేరు ఏదైతేనేం అని శంభుగిరి అనుకోలేదు. అతడు తన పేరు దాచిన కొలది శంభుగిరిలో మక్కువ ఎక్కువ కాసాగింది. అయినా అతడు తన పేరు చెప్పుకోవడం చిన్నతనంగా గాని, భయంగాని ఉండడంలో ఏమి ఇది కొందో శంభుగిరికి అర్థంకాని విషయం... కొంతమంది.. "నాపేరు అడగండీ" అన్నట్లుంటారు!

"ఏమండీ..." అని పలుకరించాడు శంభుగిరి. అతడు ఇతడివైపు మూగవాడిలా చూశాడు. నవ్వాడు. శంభుగిరి కూడా నవ్వాడు.

అతడు శంభుగిరి అసాధ్యుడనుకున్నాడు. అయినా శంభుగి[illegible] అసాధ్యంతో తనకేం మెచ్చి! శుభ్రంగా పేరు చెప్పి పారెయ్యక అక్కడే వస్తుంది అంత చిక్కును కొంత మంది ముచ్చటగా ఒకేఒక్క పేరును అలవాటుపడతరు. కాని, తనలాంటివారు చాలమంది అరుదేనా, వారిని చూసేసే, ఏమిలేక నవ్వువస్తుంది. తన తమ్ముడికి తనగనే పట్టాలా? పొద్దున్న విషయం జ్ఞాపకానికి వచ్చి గభుక్కున నవ్వాడు. వాళ్ళ అమ్మ తమ్ముణ్ణి ఎలా పిలిచిందంటే.

"ఓరే సత్తిపండూ!"

పలకడు సత్తిపండు.

"సత్యం."

లాభం లేదు.

"సతీ"

అబ్బే!

"సత్తిగా!"

ఊహు!

"సత్యన్నారాయణా!"

హమ్మయ్య! వాడిపేగ సత్యన్నారాణ!! ఇంటిలో వారికి కోపం వస్తే తప్ప, ఆ అబ్బాయి, సత్యన్నారాయణ అని వారికి తెలిసిరాదు. అక్కడికీ సత్యన్నారాయణ మూర్తి దర్శనమివ్వలేదు. భక్తురాల్ని పరీక్షిస్తున్నట్టు, తల్లిని పరీక్షిస్తున్నాడు రెండవ అబ్బాయి! ఆమె సత్యన్నారాయణ నామాల్ని జరిపిస్తున్నది.

"ఓరే...నారీ..."

.........

"ఓరే...సత్తివెధవ..."

అప్పుడె నామాలు పూరికాలేదు.

"ఎక్కడతగలడ్డావురా...కోతివెధవా?"

అనడమే తడవుగా తక్కున బయట పడ్డాడు! చాలామంది ఒక్క పేరుతోనే మడిగట్టుకు కూర్చోరు. అనేక నామాలు ఉంటాయి. అనేక వస్తువుల్లో, ఒక వస్తువ మీద యెక్కువ మక్కువ ఉండడం సహజమైనట్లు, ఒకో నామం మీద మోజు ఉంటుంది! రాజారావును..."రాజ్" అని బాధగా, అవిసావినాటిక ఆఖరి సీనులో

# ★ కేశవనామాలు ★

గాయిక నాయకుణ్ణి ఒరిగిపోతూ పిలిచినట్లు పిలిస్తే రాజారావుకు ఇష్టం.

అతడు ఈ విషయమే జ్ఞాపకానికి వచ్చి నవ్వుకున్నాడు. శంభుగిరికి అర్థంకాని విషయమే ఇది. మాటమాట్లాడడుగాని పకపక నవ్వుతాడు. అది పెద్దమనిషి తరహాకాదు. అదే అందామనుకున్నాడు. కాని పరిచయం తక్కువ. అయినా, కార్యసాధకుని లక్ష్యం, విధానం అదికాదు. అందుకనే, కోపాన్ని, ద్వేషాన్ని దిగమింగి,

"అలా మీలో మీరు నవ్వుకుంటే ఇవతల వాళ్ళు నరకంలో ఉంటారు పంతులుగారూ!"

తిరిగి నవ్వాడు..."మరోకనామం."

శంభుగిరికి అర్థంకాలేదు అతడిభాష. "ఏమిటెమీ రనేది?"

అతడు నవ్వాడు.

శంభుగిరికి కోపం వచ్చింది. కాని పైకి ఏమీ అనలేదు. అతడు గ్రహించాడు.

"చెపుతాను. బాధపెట్టను. ఎవరైనా పేరు అడుగుతే నాకు చచ్చేచావు. ఏ పేరు చెప్పాలో అర్థంకాదు."

"అంటే...?"

"అందరూ తలోకపేరూ పెట్టి పిలుస్తారు. మీరు పంతులారూ, మా సారూ అనలే. నన్ను మా బామ్మ "అవతారమూ" అనిపిలుస్తుంది.

"మీ పేరుకాదా అది."

"పేరు కానేకాదు. అసలు ఆ రైలుపెట్టె పూర్తిగా మీటరు గేజ్‌ది."

రైలులా అంత ఉంటుందా మీ పేరు?" శంభుగిరి నవ్వాడు. నవ్వి, "చెప్పండి" అన్నాడు.

"అవతారం అని ఎందుకంటుందంటే, మా తాతయ్య పోయాక, నేను భూమిమీద పడాను. ఆయనే ఈ అవతారంలో వెలిశారని ఆమె ఊహ అవ్వచ్చు. ఆయనపేరూ.." కళ్ళు మూసుకొని, తలపైకెత్తి. గుక్కపట్టి

"వీరవెంకట సత్యహనుమాన్ వరాహ శ్రీ కేశవనారాయణవర్మ...మా ఇంటిపేరు జటావల్లులవారు." ఇంటిపేరు మంచినీళ్ళు తాగిన తర్వాత నెమ్మదించి చెప్పినట్లు చెప్పాడు.

శంభుగిరి ఒక్కమాటు నిశ్చేష్టుడయ్యాడు!

"మీ పేరు అదన్నమాట. బాగుంది. పదిరోజులు వ్యవధి ఇచ్చినా చెప్పలేదు తడుముకోకుండా, అసలు ఆర్డరులో పిలవలేరనుకోండి..." వెంటనే ఏదో జ్ఞాపకానికి వచ్చి ఫక్కుమన్నాడు. ఫక్కుమనడమే కాదు నవ్వలేక తల ఆడించాడు. అతనికి (అతని పేరు ఎలానూ అనలేం. అతడనే అందాం. అదే అలవాటు అయిపోయిందిగా ఎలానూ! తెలియక)

"ఏమిటి నవ్వుతున్నారు" అన్నాడు అతడు.

"అబ్బే ... ఏం లేదు. మీ పెళ్ళి అయిందా?" శంభుగిరి ప్రశ్నించాడు.

"అయింది...ఆఁ!"

"తలుపుదగ్గర ఇంతపేరూ చెప్పారా? అని."

"ఓఁ అదా?" ఫక్కుమన్నాడు అతడు. "ఆమె పేరు చాలా చిన్నదిలెండి. అనడం తేలిక కూడాను. ఇదెందుకు చెప్పానంటె దీనిమీద ప్రశ్న దొర్లిస్తారు. అవునా?"

శంభుగిరి ఒప్పుకున్నాడు. శంభుగిరికి శ్రద్ధ కలిగింది. అందుకే అడిగాడు.

"బామ్మగారి రెండో కారణం మరి."

"ఏముంది! భర్త పేరు పిలుస్తారా?"

శంభుగిరి ఈ విషయంలో ఐక్యంకావడం అతడికి సరదా పుట్టుకొచ్చింది.

"మిగతా వ్యవహారంకూడా చెపుతాను వినండి." అన్నాడు.

"మంచి కాలక్షేపంగా ఉంది. చెప్పండి" అన్నాడు శంభుగిరి.

"అమ్మ ఏమో నానీ! అని పిలుస్తుంది."

"కారణం లాంటిది...?"

"నాకున్న నామాలవెనక ప్రతిదానికీ ప్రబ్రహ్మాండంగా కారణాలు ఉన్నాయి. మా అమ్మకు తోబుట్టువులెవ్వరూ లేరు ఆమె ఒక్కతె మా తాతయ్యకు మగపిల్లలు లేరు. ఆయనకు మగపిల్లలు అంటె సరదా. అందుకు నన్ను 'నానీ' అనేవాడు. ఆయన అలా అనడానికి కారణం, మగనలుసు పుడితే, వాళ్ళ నాన్నపేరు పెడదామనుకున్నాట్ట. అందుకే "నాన్న" ను "నానీ" చేసి పిలిచాడు నన్ను. మా అమ్మ మా తాతయ్యను అనుసరిస్తుంది. మా అమ్మకు నా ముద్దుపేరు నానీ!"

"ఇక పోతే మా నాన్న తిలక్ బాబు అంటాడు."

"అదేమిటి చాలా ఆశ్చర్యంగా ఉంది. ఎక్కడా సంబంధం లేదు."

"ఉంది. చాలా సంబంధం ఉంది. మా నాన్నకు రాజకీయాలంటే ఇష్టం. తిలక్ ఆయనకు పూజనీయుడు ఆయనపేరు పెడదామని ఉండేది ఆయనకు. కాని మా అమ్మ పెటనిచ్చింది కాదుట...'ఇదేం పాయ్యేకాలంరా' అందిట కూడా!"

"పోనీ...మీ తర్వాత సోదరులు..."

"లేకేం ఉన్నారు. వారంతా వరప్రసాదులు."

"మీరు కాదా...?"

"అదే అనుమానం. మా తాతతాత సత్యన్నారాయణమూర్తి నారాధించేవాడు. మా తాత తండ్రి హనుమాన్‌భక్తుడు. మా తాత దశావతారాల్లోని వరాహ అవతారాన్ని ఎక్కువగా ప్రేమించేవాడు. మా తాత పేరు"...

శంభుగిరి ఒక్కమాటు అదిరి..."చెప్పారు ఇదాక...మీ తండ్రిగారి పేరు..."

నవ్వుతూ..."ఆయన పేరు భయంకరమైనది కాదులెండి."

"నన్ను మిమ్మల్ని ఏమనిపిలవమన్నారు?"

సాక్షాత్తూ భగవంతుడు మూఢులైన మానవులకు తననిగూర్చి చెపుతున్నట్లు, ప్రశాంతంగా, నెమ్మదిగా, "నన్ను అడిగి పిలుస్తున్నారా అంతా! పదిమంది పదిరకాలుగా పిలుస్తారు; తెలియక... నేను ఏ నామాన్ని ఉచ్చరించినా, పలుకుతాను. నాకేదో ఫలానా నామం ఇష్టమని, లేదా వారికిష్టమైన నామం నాకు ఇష్టమని నన్ను ఆ నామంతో పిలుస్తారు..."

"స్వామీ! అర్థం అయింది. మీరు మామూలు ధోరణిలో పడండి, మద్రాసు వచ్చింది. దిగుదాం..."

రైలు కూతతో పెద్ద రొద ప్రారంభం అయింది 'అతడు' ఆ జనంలో ఒకడు అయిపోయాడు! శంభుగిరి తీరా చూస్తే అతని పంచీ, తన చేతిలో ఉండిపోయింది ... వెంటనే గురుకువచ్చి...

"ఏమండీ...వీర...తర్వాత రాలేదు! ★




# ప్రభుత్వ వార్తల ప్రకటన పద్ధతి

ఢిల్లీలో వార్తాక్షామం మిక్కుటంగా ఉంది.

ఢిల్లీలో కొన్ని ప్రాంతాల్లో శుభ్రంగా వడబోసిన మంచినీళ్ళు కరువైనట్లే నిజంగా మంచివార్తలనదగినవి కూడా కరువయ్యాయి. పత్రికావిలేఖరులు ఏంచెయ్యటానికీ తోచని పరిస్థితిలో పడ్డారు. కొంతమంది మాత్రం లేచారు. ఒక ఉదయాన బేబీకార్ల దిగుమతులనుగూర్చిన వార్తలు పెద్ద శీర్షికలలో కెక్కాయి. ఈ వార్తలను అధికారులు ఖండించారు. మరొకపత్రిక పెట్రోలు రేషనింగ్ నుగూర్చి భయంకరమైన వార్త ప్రకటించింది. దీనిమీద కూడా అధికారులు నీళ్ళు చల్లారు.

ఇంకొపత్రిక ఇంకో తమాషా చేసింది. వరల్డ్ బాంక్ నుంచి తీసుకున్న అప్పులను మాఫీ చేయించటానికి భారత ప్రభుత్వం సంప్రదింపులు జరుపుతోందని ఆ పత్రిక ప్రకటించింది. ఇది అందరికీ చాలా ఆశ్చర్యం కలగజేసింది. కాని భారత ప్రభుత్వం నిర్దాక్షిణ్యంగా ఇంత "అమూల్యమైన వార్తను" కూడా ఖండించిపారేసింది.

వ్యాపారస్థులను ఆనందానందంలో ముంచితేల్చే మరో చక్కని వార్తను మరో పత్రిక ప్రకటించింది. అంతర్జాతీయ ఆర్థిక సంఘం ప్రైవేటు రంగానికి ముందు ముందు సహాయం చేసేటట్లుగా భారత ప్రభుత్వం ఏర్పాట్లు చేస్తున్నదని ఆ వార్త.

మరొక చలాకీ విలేఖరి ఎనిమిదేళ్ళ కిందటి పాతవార్తను బూజుదులిపి కొత్తరంగు పూసి బయటపెట్టాడు. ధరలను అదుపులో ఉంచటానికిగాను భారతప్రభుత్వం కార్యదర్శుల సంఘం అంటూ ఒకదాన్ని నెలకొల్పబోతోందని అతగాడికథ. కీ. శే. సర్దార్ పటేల్ హోంమంత్రిగా ఉన్న రోజుల్లోనే "ఆర్థిక" కార్యదర్శుల సంఘాన్ని ఏర్పాటు చేశారు. నాటినుంచి ఆ సంఘం ధరలతో సహా అన్ని ఆర్థిక విషయాలమీద ప్రభుత్వానికి సలహా లిస్తోంది. మంత్రిమండలి తాలూకు ఆర్థిక సంఘానికి ఈ సంఘం 'బ్రెయిన్ ట్రస్ట్' గా పనిచేస్తోంది.

ఇంకొక చిత్రమైన విషయం ఏమిటంటే, ప్రధానమంత్రి మానవుని క్షేమంకోసం పెట్టుబడి పెట్టాలన్నారు. పత్రికలవారు ఈ సలహా అనుసరించి, మంత్రులకోసం పెట్టుబడి పెడుతున్నారు. కేంద్ర మంత్రి పండిట్ కె. డి. మాలవీయ పెట్రోలు వ్యవహారాలపై చూపుతున్న శ్రద్ధనుగూర్చి కొన్ని పత్రికలలో అదేపనిగా ప్రశంసలు ప్రకటితమవుతున్నాయి. ఇలాగ ప్రశంసల్ని పెట్టుబడి పెట్టటంవల్ల లాభాలు రాకపోలేదు. జ్వాలాముఖిలో 8 వందల ఏళ్ళ క్రిందటి ఇంధన వాయువులు

**శ్రీకృష్ణ**
[ ఆంధ్రపత్రిక ప్రతినిధి ]

లభ్యమవుతున్నాయని రుమేనియనులు కనిపెట్టిన విషయాన్ని ఎవరో కొందరు పత్రికలవారిని మాత్రం పిలిచి వెల్లడించారు. పెట్రోల్ కంపెనీలతో ఒప్పందాలు చేసుకున్న సంగతిని కూడా ఆ కొందరు పత్రికలవారినే పిలిచి వెల్లడించారు. ఈ ఒప్పందాల వార్తను ఇంతవరకూ అధికార రీత్యా ప్రకటించకపోవటం మరీ విచిత్రంగా వుంది. కాని ఇంకో చిత్రం జరిగింది. అస్సాంలో నూనెశుద్ధి కర్మాగారాన్ని గూర్చి రుమేనియనులు తమ నివేదికను ఇటీవల సమర్పించారు. ఆ నివేదిక ఆమర్నాడు అప్పటిదాకా అశ్రద్ధ చేయబడిన ఒక పత్రికలో ప్రకటితమయింది. రెండు రోజుల తరవాత అదే పత్రిక అస్సాం పైప్ లైన్ ప్రాజెక్టు నివేదిక ప్రభుత్వానికి అందకముందే ప్రకటించింది. ఈ విషయంలో నిర్లక్ష్యం చేయబడిన పత్రికలు ఇదంతా చూసి మరింత 'డబ్బా' కొట్టటం సాగించాయి. ప్రభుత్వం వారి పబ్లిసిటీ కార్యక్రమం ఎంతసజావుగా జరుగుతోందో దీన్నిబట్టి గ్రహించవచ్చు. మంత్రులు ఏ పత్రిక తమకు ఎంత ప్రచారం చేసిపెడుతోందో చూసి మరీ వార్తలు విశేషాలు వెల్లడించుతున్నారన్నమాట. ప్రభుత్వ వార్తలను మంత్రులు తమ ఇష్టంవచ్చినవారికి వెల్లడిస్తున్నారన్నమాట.

కొన్ని ప్రముఖ పత్రికల అధిపతులు తమ సిబ్బందిలోకి ఉద్యోగులను చేర్చుకునే విషయంలో కూడా మంత్రుల ఆమోదంపొంది మరీ చేర్చుకుంటున్నారని ఒక ప[illegible] ఈ మధ్య ప్రకటించింది.

ఏ పార్టీకి చెందకపోవటంబట్టే ఆర్థికంగా ఇబ్బంది పడుతున్న ఉత్తరాది పత్రిక ఒకటుంది. ఈపత్రిక వందఏళ్ళనుంచి ప్రచురితమవుతున్నది. ఇబ్బందుల మూలంగా ఈ పత్రిక మరొక పత్రికతో ఒక రకంగా ఒప్పందం చేసుకోవాలని ప్రయత్నించింది. ఒప్పందం చేసుకోబోతుండగా ఢిల్లీలోని మరొకపోటీ పత్రికనుంచి విపరీతమైన ఒత్తిడి వచ్చింది. ఒప్పందం చేసుకోదలచిన ఆ పత్రికను మూసివేయనైనా మూసివేయాలి, లేకపోతే పోటీ పత్రికకు వారపత్రిక రూపంలోనైనా ప్రచురణ కావాలి అని షరతు ప్రతిపాదించబడింది. పాపం ఆపత్రికకు అడ్వర్టయిజ్ మెంట్లను కూడా తగించి వెయ్యాలని ప్రయత్నం జరిగింది. ఉద్యోగుల నియామకంలో కూడా మంత్రుల సలహాల ప్రకారం నడుచుకుంటున్నారని కొందరు పత్రికావ్యాపారస్థులను విమర్శించినది ఆఢిల్లీ పత్రికే.

* * *

ఫ్రెంచి రాజకీయ పరిస్థితులమీద "స్పెక్టేటర్" పత్రిక సంపాదకీయంలో ఇలా వ్రాసింది: "ప్రస్తుతం పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అపాయంలో పడినది తద్వ్యతిరేకులమూలాన కాదు. దాన్ని తమ ఇష్టం వచ్చినట్లు ఆడించే వారిమూలానే. ఏ ఆదర్శాలు, ఆశయాలు లేకపోయినా, ఏ అస్త్రాలు లేకపోయినా



# న్యూఢిల్లీ లేఖ



**శ్రీమతి భానుమతీరామకృష్ణ**
**ప్రత్యేక వ్యాసం**

ఒకే రకం మనుషులు ఏటేటా మంత్రి పదవుల్లో, అధికారాల్లో స్థిరపడి వుండటం మూలంగానే ఫ్రాన్సులో పార్లమెంటరీ పద్ధతిమీద ఏవగింపు తీవ్రమైంది."

ఇలాంటి పరిస్థితే భారతదేశంలోకూడా ఏర్పడింది. దూరదృష్టితో, వాస్తవాన్ని అర్థం చేసుకుని వ్యవహరించగల నాయకుడు ప్రధానమంత్రి ఒక్కరే. పదేళ్లనుంచీ పదవులను అంటిపెట్టుకుని కదలనంటున్న "మహాంతుల్ని" నిశితంగా విమర్శించారు. ఈ మహాంతులు ఇకనైనా తప్పుకుని యువకులకు చోటు చేయాలని ఆయన అన్నారు. ప్రధానమంత్రి విమర్శను పెడచెవిని పెట్టి ఈ మహాంతులు జన్మదినోత్సవాలుమాత్రం వేడుకగా జరుపుకుంటున్నారు. వీరు ఫ్రాన్సు నుంచి నేర్చుకోవలసిన గుణపాఠం ఎంతైనా ఉంది.

* * *

ఇటీవల పత్రికా విలేఖరులతో గోష్ఠి జరుపుతూ ప్రధానమంత్రి పశ్చిమ జర్మనీ, జపాన్‌దేశాలు, యుద్ధంలో సర్వనాశనమైపోయినా ఎంత త్వరగా ఎంత అభివృద్ధి అయిందీ వివరించారు. "గత యుద్ధంలో అన్నిటికంటె ఎక్కువ నష్టపడిన దేశాలు జర్మనీ, రష్యా, జపాన్. ఈ దేశాలలో వేటి రాజకీయ, ఆర్థిక విధానాలు వాటివే అయినా అతిశీఘ్రంగా మళ్ళీ అభివృద్ధి సాధించాయి. కాపిటలిజమ్ అనండి, కమ్యూనిజమ్ అనండి, ఏదైనా—ఆ దేశాల అభివృద్ధికి అవిమాత్రం కారణాలు కావు. సుశిక్షితులైన ప్రజలు నిరంతరం చేసిన కృషివలననే ఆ అభివృద్ధి సాధ్యమైంది." అని ప్రధాని అన్నారు.

కష్టపడి పనిచెయ్యటమంత మంచి వస్తువు లేదని ప్రధాని చెప్పినముక్క అక్షరాలా నిజం. ఒక దేశం అనుసరించే ఆర్థిక, రాజకీయ విధానాలనుబట్టి అభివృద్ధి కావటం, కాకపోవటం అంటూ ఉండదు. కాని కష్టపడి పనిచేయటానికి ఆ విధానాలు తప్పకుండా సహాయకారులవుతాయి. కమ్యూనిజంలో ప్రజలచేత నడుంవంచి పనిచేయించటానికి "ప్రజల ప్రజాస్వామ్యం" కొరడాలాగా పనిచేస్తుంది. తనకు కేటాయించినంత పని చేయకపోతే మనిషికి తినటానికి తిండి ఉండదు– అది రష్యాలో సంగతి. జర్మనీ, జపానులలో కొరడాలు ఉండవు. కాని పనిచేస్తే లాభం కలుగుతుందనే ఉద్దేశంతోనైనా ప్రజలు పనిచేస్తారు,

జర్మన్ ఆర్థిక వ్యవహారాలమంత్రి డా॥ లూడ్విగ్ ఎర్‌హార్డ్ "పోటీద్వారా అభివృద్ధి" అనే పుస్తకంలో ఇలా వ్రాశారు:

"పోటీవిధానం ఉంటేనే ఆర్థికాభివృద్ధిని చక్కగా సాధించవచ్చును. ఎక్కువ ఉత్పత్తిచేస్తే మనకే లాభమనే వ్యక్తిగత ప్రోత్సాహంకూడా పోటీ విధానంలోనే ఉంటుంది. పనిచేయటంలో గల ఆనందాన్ని గుర్తించిన తరవాత జర్మనీలో పనిచేసేకాలం పెరిగింది. 1947 లో కార్మికుడు వారానికి 39 8 గంటలు పనిచేస్తే, 1956 లో వారానికి 49 గంటలు పనిచేస్తున్నాడు"

"12 ఏళ్ల కిందట జపాను నేలమట్టమై ఉంది. జపానుదేశం అప్పుడు పరాజయ పరాభవంతో క్రుంగిపోయివుంది. ముఖ్యమైన పట్టణాలన్నీ బాంబులతో ధ్వంసమైపోయాయి. ఫ్యాక్టరీలు పాడైపోయాయి. బ్రహ్మాండమైన వర్తక నౌకాబలం యావత్తు నాశనమైంది. వలసలన్నిటినీ లాగేసుకున్నారు. విదేశీ వ్యాపారమంతా ఆగిపోయింది. విదేశాల్లోని ఆస్తులు పోయాయి. జపాన్‌ను ఓడించిన దేశాలు జపాన్ పారిశ్రామిక, ఆర్థిక, వ్యాపార వ్యవస్థను ఛిన్నాభిన్నం చేసివేయాలని ప్రయత్నించాయి. దీనంతటినిబట్టీ, జపాన్ మళ్ళీ పారిశ్రామికంగా తలెత్తుకుని తిరగటం అసంభవమని అంతా అనుకున్నారు. కాని ఈరోజున జపాన్ పూర్తిగా కోలుకుంది. పారిశ్రామికోత్పత్తి 1930 ప్రాంతాల్లోకంటే రెట్టింపయింది. ఆర్థిక వ్యవస్థ స్థిరపడింది. వర్తక నౌకాబలం బాగా పెరిగింది. 1956 నాటికి జపాను నౌకానిర్మాణంలో ప్రథమస్థానం వహించింది. ఈ ఘనత యావత్తు జపాన్‌ప్రజలదే," అని "జపాన్ ఆర్థిక పునర్నిర్మాణము" (రచయిత జి. సి. అలెన్) అనే పుస్తకంపై బి. బి. సి. సమీక్ష ప్రకటించింది.

తమ దేశాలను పునర్నిర్మించుకుని బాగుచేసుకోవాలనే దృఢదీక్షవలనే పశ్చిమ జర్మన్లు, జపాన్‌ప్రజలు ఇంత త్వరగా అభివృద్ధి సాధించగలిగారు. మరో విశేషమేమిటంటే జర్మనీగాని, జపాన్‌గాని శ్రేయోరాజ్యంమాట తలపెట్టనైనా లేదు. "ముందు ఉత్పత్తిచెయ్యి. తరవాత నీ వాటా అడుగు," అని డా॥ ఎర్‌హార్డ్ సిద్ధాంతం.

భారతదేశంస్థితిచూస్తే దీనికి పూర్తిగా భిన్నంగా ఉంది. కష్టపడి పనిచేస్తాడనే పేరు తెచ్చుకున్న భారతీయకర్షకుడుకూడా ప్రతిదానికీ ప్రభుత్వసహాయంకోసమే ఎదురుచూస్తున్నాడు. పొలంపక్కనుంచి నీళ్ళు ధారాళంగా పోతున్నాసరే ప్రభుత్వం బోదె తవ్వించి ఇవ్వాలని అతడు కోరుతాడు.

అందరికీ ఉద్యోగా లిప్పించటం కేంద్ర ప్రభుత్వం లక్ష్యం కనుక, ఉద్యోగం ముఖ్యంగాని పనిచెయ్యటం ముఖ్యం కాదు. కేంద్రప్రభుత్వఉద్యోగులలో మూడోవంతు మంది శుద్ధ దండగ అని ఒక మాజీ కార్మికమంత్రి ఒకసారి నాతో అన్నారు. ఆయన ఆమాట అన్న తర్వాత కొన్ని లక్షలమందికి ఉద్యోగా లిచ్చారు. మానవుడిమీద పెట్టుబడి పెట్టాలనే ఊహ మంచిదేగాని పెట్టుబడిమీద లాభాలేమీ రావటం లేదు.

* * *

ఎప్పటికప్పుడు పెరిగిపోయే సిబ్బంది కోసంగాను సమాచార, బ్రాడ్‌కాస్టింగ్ శాఖ ఒక పెద్దమేడ సంపాదించుకుంది. వాస్తుశిల్పదృష్ట్యా చాలా ఆధునికంగా ఉన్నదా భవనం. కొయ్యబదులు సాధ్యమైనంతవరకూ గాజు ఉపయోగించారు. అదేపనిగా గాజుభవనాలు ఎందుకు కడుతున్నారో తెలియటంలేదు. పూర్వపురోజుల్లో చప్రాసీలు తమ కార్యాలయాలనెంతో శుభ్రంగా ఉంచుకొని గర్వపడేవారు. కిటికీల గాజుతలుపులను నీటుగా తుడిచివుంచేవారు. ఈ నాడు శ్రేయోరాజ్యం ధర్మమా అని కిటికీతలుపులు తుడవటం, సిరాబుడ్లు కడగటంకూడా చప్రాసీలకు నామర్దా అయిపోయింది. జీతం పెరుగుతోంది. జీతంతోపాటే కిటికీ తలుపులమీద దుమ్ముకూడా పెరుగుతోంది. చప్రాసీలు ఫ్యూడల్ వ్యవస్థ చిహ్నాలవంటివారని ప్రధానమంత్రి భావం. అయినా ఈ చప్రాసీలసంఖ్య ఈ నాడు అయిదు లక్షలదాకా పెరిగిపోయింది. రిజర్వుబ్యాంకి భవనంలోకూడా గాజు తలుపులు నానాటికీ అసహ్యంగా తయారవుతున్నాయి. గాజుతలుపులకు బోలెడుఖర్చు అవుతుంది. వాటిని జాగ్రతగా. శుభ్రంగా ఉంచటానికి ఇంకా ఎక్కువ ఖర్చవుతుంది. శుభ్రంగా ఉంచకపోతే అవి భయంకరంగా ఉంటాయి. అందుకే మానవుడిమీద మరికొంత పెట్టుబడి పెట్టడం అవసరం. 

# నిజానిజాలు

"ఈ సంగతి విన్నారటండీ?"

"ఏమిటది?"

"ఒక మనిషి చెబుతున్నమాట నిజమో, అబద్ధమో తేల్చి వేయడానికి అమెరికాలో ఒక యంత్రం కనిపెట్టబోతున్నారట!"

పరుగెడుతున్న బస్సులో, దిగజార్చిన పరదాలకు నడుమ మెత్తని సుఖాసనాలపైన మాగన్నుగా వున్న ప్రయాణీకులు కొందరు ఉలికిపడి కళ్ళు తెరిచేశారు.

"అది వార్తా, కాకపోతే ఊహాగానమా?" అని ప్రశ్నించాను.

"వార్తేనండీ! క్రయిమ్ చిత్రాలు డిటెక్టివు నవలలు తామరతంపరగా అభివృద్ధి చెందుతూ వుండడంవల్ల సంఘంలో నేరస్థుల సంఖ్య మితిమీరి పోతోందట! వాడివాడి మాటల్నిబట్టి. వారు దొంగో, దొరో తేల్చి వేయడానికి అనువుగా విజ్ఞాన శాస్త్రజ్ఞులు ఈ యంత్రాన్ని కనిపెట్టడానికి తీవ్రంగా కృషిచేస్తున్నారట!"

ఈవార్తపైన ఓ తలనెరసిన వృద్ధుడు వ్యాఖ్యానం ప్రారంభించాడు.

"ఉప్పూ కప్పురంలాగే మంచీ, చెడ్డా, సత్యమూ, అసత్యమూ బాహ్యదృష్టికి ఒక్క మాదిరిగానే గోచరిస్తున్నాయి. వాటి తారతమ్యాన్ని గూడా యంత్రాలే నిర్ణయింపగలిగితే అంతకన్నా కావలసిందేమీ లేదు. అప్పుడిక కోర్టులు వకాలత్తులు విచారణలు బొత్తిగా అనవసరం!"

ఈ లోకజ్ఞుడి మాటల్ని మననం చేసుకుంటూ మళ్ళీ కళ్ళు మూసుకున్నాను. ఉదయం కానూకానూ రోడ్డులో రాకపోకల సందడి హెచ్చవుతున్నందువల్ల బస్సు వేగం మందగిస్తోంది. కునుకు పట్టనూపట్టనూ నా మనోవీధిలో ఏవేవో దృశ్యాలు రేఖాచిత్రాలకు మల్లే ద్యోతకమౌతున్నాయి. పెదపెద్ద రైల్వే స్టేషన్లలో జనం నడయాడే చోట గోడకు వ్రేలాడే పటం ఒకటి నాకప్పుడు జ్ఞప్తికివచ్చింది. 'దొంగలున్నారు జాగ్రత్త' అన్న హెచ్చరికకు అది రూపకల్పనైతే గావచ్చు. దొంగలుగా పేరు మోసిన వారి ఛాయా చిత్రాల్లోనుంచీ తలలు మాత్రం కత్తిరించి ఆ పటంలో పునర్ముద్రించడంజరిగింది. వీడుదొంగ అని నుదుట వ్రాసిపెట్టకపోయినా అందులో ప్రతివాడూ మన వుద్దేశంలో దొంగగానే భాసిస్తాడు.

ఇందుకు కారణమేమిటా అని వితర్కించుకున్నట్టయితే చెదరిన క్రాపింగు, చిట్లించుకున్న నుదురు, కనుముక్కుల తీరు యివన్నీ వాడి అంతర్యాన్ని చూపరులకు చెప్పకనే చెప్పేస్తున్నాయేమో నని మనం అనుకోక తీరదు. ఆముఖాన్ని మనం వెయ్యిమందిలో చూచినా పోల్చుకోవచ్చు. అపాయాన్ని శంకించినట్టయితే అందుకుదగిన వుపాయాన్ని వూహించుకోవచ్చును గనుక, యిలాంటి వాళ్ళవల్ల చిక్కు లేదేమో అనిపిస్తుంది. ఉన్న చిక్కల్లా మనుష్యుల్లో మనుష్యులుగా కలిసి సంచరించేవాళ్ళతోనే!

బస్సులో నేనింకా జోగుతుండగానే సూర్యోదయమై వుంటుంది. వేడెక్కిపోతున్న యింజన్ని మంచినీళ్ళతో శాంతింప జేయడానికి, వేడి (కాకపోతే ఉత్సాహం) తగ్గిపోతున్న శరీరానికి టీ నీళ్ళతో వుషారెక్కించడానికి డ్రయివరూ కండక్టరూ బస్సును మార్గమధ్యంలో ఎన్నిసారు ఆపారో నాకు తెలియదు. సడన్ బ్రేకుతో కలిగిన కుదుపువల్ల ఓ లావుపాటి మనిషి నా పైనపడి, ఆ తాకిడికి నా తల కమ్మికి మోదుకోడంతో నీరెండలో నీరసించి మాయమైన మంచులా నా నిద్ర మటుమాయమైంది.

పటణంలో అయిదుగంటలకు బయలుదేరిన బస్సొకటి, అక్కడ మా బస్సుతో తారసిల్లింది.

"ఈరోజు కాస్త లేటుగావస్తున్నావు" అన్నాడు మా బస్సుడ్రయివరు.

ఆ బస్సులో కూచున్న డ్రయివరు కంగారుతో తబ్బిబ్బయి పోతున్నాడు.

"లేటుసంగతలావుండనీగానీ నేనిక్కడ ఒక పాసెంజరును దింపేస్తున్నాను. సీటువున్నా లేకపోయినా నువ్వతణ్ణి ఎక్కించుకోవాలి"

"ఏం, ఎందుకూ!" ఆశ్చర్యంతో ప్రశ్నించాడు మాబస్సు డ్రయివరు.

"తీరిగ్గా చెబుతూ కూచోడానికి టైంలేదు. పాపం, ఈ ఆదమరచిన పెద్దమనిషి క్షణంలో వెయ్యి రూపాయలు పోగొట్టుకున్నాడు."

"వెయ్యిరూపాయలే! ఏం జరిగింది? ఎలా పోయింది?" డ్రయివరుతోబాటు పదారుమంది ఏకకంఠంతో ప్రశ్నించారు.

"ఆదొంగ వెధవకూడా ఈయనతో బాటే టౌనులో బస్సెక్కాడు. గ్రహచారమేమిటంటే ఈయన చేతిలోవున్న లెదర్ బ్యాగులాంటిదే వాడిచేతిలోనూవుంది. మసక చీకట్లో వాడేం ట్రిక్ చేశాడోగానీ చల్లగా వాడి సంచిని ఈయన దగ్గరుంచి, ఈయన సంచిని చేతబట్టుకుని యిరవై అయిదో మైల్లో నాలుగురోడ్ల కూడలి దగ్గర బస్సు దిగేశాడు. బస్సు ముప్ఫయ్యోమైలు రాయి దాటుకునేదాకా ఈయనగారా సంగతి తెలుసుకోలేకపోయారు."

"అయ్యయ్యో, ఆ తరువాతేం జరిగింది?"

"జరగడాని కేముంది? లబోదిబోమంటూ నన్నిక్కడే దింపేయి, వాడిని వెంటాడుతానన్నాడు. "అయ్యా మహానుభావా, కాలి నడకతో వాడిని వెంటాడితే నీ డబ్బు నీకు దొరికినట్టే! అలా కాకుండా యిక్కడ దిగేసి బస్సుకోసం వెయిట్ చేస్తారనుకో! తీరా ఆ బస్సులో సీటు దొరక్కపోతే ఏం చేస్తావు? అలాకాదు. ఈ బస్సులో నేయింకొక నాలుగైదు మైళ్ళురా. మాకంపెనీ బస్సే ఒకటి ఎదురుగావస్తుంది. నిన్ను దాన్లో ఎక్కించేస్తాను' అన్నాను."

"అలాగా! ఇప్పుడేడీ అతను?" అంటూ మాబస్సు డ్రయివరు కూర్చున్న తావులోనే సర్దుకుని వెనుదిరిగాడు. అతనితో బాటు బస్సులోవున్న ప్రయాణీకులందరూ ఆ వైపుకు చూపులు మళ్ళించారు.

చెమటలో ముఖం దొప్పదోగుతుండగా, భుజంపైన అంగవస్త్రం క్రిందికి జారిపోతుండగా వేడి వేడి నిటూర్పులతో ఆసుర్సుమంటూ ఓ నలభైఏళ్ళ వ్యక్తి బస్సులో కెక్కుతున్నాడు.

ఉత్సవంలో బిడ్డను దారబోసుకుని జుట్టు వీడిపోతుండగా, పమిట సవరించుకోవడం సైతం మరచిపోయి, పరుగునా బారునా జనసమూహంలో కలయ తిరిగేస్తున్న తల్లిని గనుక వూహించుకున్నట్టయితే ఈ పెద్దమనిషి ముఖంలోని దైన్యాన్ని ప్రత్యేకం వివరింపవలసిన పనివుండదు.

 

# నిజానిజాలు



అతడు సీటు కోసం అటూ యిటూ చూడకుండా దబేలున క్రింద కూచున్నాడు. తలపైన చేతులుంచుకుని డ్రయివరు కేసి చూస్తూ "వెళ్ళవే బాబూ! వేగంగా వెళ్ళనీ వాయనా!" అని వేడుకున్నాడు.

బస్సు కదిలింది.

శరవేగంతో పరుగిడుతున్న బస్సులో అతడిపైన ప్రశ్నలవర్షం కురవసాగింది.

"ఐతే అతడు సంచీ మార్చేస్తున్నప్పుడు మీరు నిద్రపోయారన్నమాట?"

"పోనీగానీ, అతడు బస్సు దిగుతున్నప్పుడైనా మీరు మీ చేతినున్న సంచిలో డబ్బుందో లేదో చూచుకోలేకపోయారా?"

"ఇంతకూ ఆ మనిషి ఎలావుంటాడండీ?"

—"నన్నేమీ అడక్కండి బాబూ! నన్నేమీ అడక్కండి." అరిచాడనడం కన్నా అతడు ఆక్రోశించాడనడం సమంజసం.

బస్సు పదిహేను నిమిషాలు ఏకధాటీగా పరుగుతీసింది. ఆలోపల ఎవరో అతడికి ఆసన సదుపాయం సమకూర్చారు. కానీ అతడు తన తావులో నిశ్చలంగా కూర్చోలేకపోయాడు. అలాగని లేచి నిల్చోనూ లేకపోయాడు. నడుము విరిగిన వాడికి మల్లే నిటారుగా కూచోనూ లేక, లేచి నిలబడనూ లేక అతడు కాసేపు కిటికీలోనుంచీ తల దూర్చి పరిసరాల్ని గాలిసాడు. మరి కొంతసేపు డ్రయివరువైపు వంగి అద్దంలోనుంచీ రోడ్డుపైకి చూసాడు. చిత్రమేమిటండీ అతడితో బాటే ప్రయాణీకు లందరూ నిలువెల్లా కళ్లు చేసుకున్నారు. ఒకరితల మరొకరికి అడ్డురాకుండా ఒక్కొక్కరూ ఒక్కొక్క భంగిమలో ముందుకూ, వెనక్కూ, ప్రక్కకూ వంగి యింతకుమునుపు తమకు ముఖ పరిచయమైనా లేని వ్యక్తికోసం కనుచూపు ప్రసరించినంత మేరకూ వెదికేస్తున్నారు.

కానీ యిరవై అయిదోమైలు దగ్గర ఎక్కడో బస్సు దిగిన మనిషి, పొలాలపైన బడి అడ్డుదారి పటివుండవచ్చు. లేదా, అది నాలుగురోడ్ల కూడలి గనుక, మరొకరోడ్డు వెంట ఈపాటి కెప్పుడో పలాయనమంత్రం పఠించివుండవచ్చు. కానీ ఈ అనుమానం ఎవరికీ కలిగినట్టు లేదు. ఇవ్వాళో మరి కొంతసేపటికో ఆ దొంగ చేజిక్కిపోవడమే ఖాయమని అందరూ విశ్వసిస్తున్నారు.

అందుకు తోడూ డ్రయివరుగూడా భలో పాయిస్తున్నాడు.

"మాదర్చోద్! వాడెక్కడికి వెళ్ళగలడండీ? మీరొక పనిమాత్రం చేయాలి. ఇలాగే రోడ్డుపైకి చూస్తూవుండి, వాడింకా ఒక ఫర్లాంగు దూరంలో వుండగానే హింట్ యిచ్చేయండి. ఆ తరువాత వాడి సంగతి నేను చూస్తాను."

డ్రయివరు అన్నంతపని చేసేటట్టుగానే వున్నాడు. దుష్టశిక్షణకుగానీ, శిష్టరక్షణకుగానీ అంత పట్టుదలగా పనిచేసే మనుషులు నలుగురైదుగురుంటే ఒక లోకంలో అన్యాయాలే జరగవనిపించింది.

బస్సు యిరవయ్యారో మైలురాయి దాటింది.

"దగ్గరికి వచ్చేస్తున్నాం! జాగ్రత్త!" వెనుకనుంచీ కండక్టరు కేక వేశాడు.

నిమిష నిమిషానికీ ప్రయాణీకులు అనిమిషనయనులై పోతున్నారు అప్రమత్తులైపోతున్నారు. డబ్బు పోగొట్టుకున్న ఆసామిపైన అనుకంప, కాజేసిన దొంగపైన ఆగ్రహం, ఈ రెండు భావాలే వాళ్ళ ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా పరిణమించాయి.

నిశ్చల కాసారంలో రాయిపడి, కొలను కొలనంతా తరంగ కల్లోలితమైపోయిన తరువాత పైకిలేచిన నీటి బుడగలా అప్పుడొక కేక వెలువడింది. "అదిగో, వాడే, వాడే, దొంగ!"

"మీరు కూచోండి, కూచోండి" అంటూ నలుగు రైదుగురు ప్రయాణీకులు ఆ పెద్ద మనిషి భుజాలపైన, తలపైన చేతులుమోపి క్రిందికి అదిమేశారు.

"ఆ వైపు చూచింది చాలు! అందరూ ఇటు తిరిగి కూచోండి" అంటూ కండక్టరు కాషన్ యిచ్చాడు. దగ్గరలో ఆపడానికి వీలుగా డ్రయివరు బస్సువేగం తగ్గించాడు.

బస్సు సరిగ్గా నాలుగురోడ్ల కూడలిలోనే ఆగింది. లెదర్ బ్యాగు చేతబట్టుకుని చెట్టు క్రిందనుంచీ పరుగిడివచ్చిన వ్యక్తి కంగారుగా చేతిని అడ్డంగాచాపి "ఇదేవూరి బస్సు" అన్నాడు.

కానీ కండక్టరు అతడి ప్రశ్నకు తీరిగా సమాధానం చెబుతూ కూచోలేదు. బస్సు దగ్గరికి రాగానే అతణ్ణి రెక్కపట్టుకుని ఒక్క వుదుటున లోపలికి ఈడ్చేశాడు.

అతడు పాతికేళ్ళ యువకుడు. సన్నగా పొడుగ్గా, నల్లగా ఎముకలగూడు లాంటి మనిషి. చప్పిడి దవడలు, ఎత్తయిన ముక్కు. బహుశా అతడు తన పొడుగాటి శిరోజాలను వెనక్కు దువ్వుకునేవాడేమో! బస్సులో బోరగిలబడి అతడు తల పైకెత్తేసరికి ఆ వెంట్రుకలన్నీ ఎటు వీలైతే అటు చెదరిపోయి పెద్ద బుట్టలాగా తయారయ్యాయి.

అతడు బొత్తిగా నాకు అపరిచితుడు. కానీ అతడి ముఖంమాత్రం ఎన్నడో కలలో కనిపించినట్టు నాకొక విచిత్ర భావన కలిగింది. బహుశా ఆ ముఖం (కాకపోతే అలాటి ముఖం) నాకు రైల్వేస్టేషనలోనూ పెద్ద పెద్ద పోస్టాఫీసుల్లోనూ వేలాడే పటాలో కనిపించేదేమో ఇప్పుడు నిర్ధారణగా చెప్పలేను.

అతడు తలపైకెత్తి పరిస్థితిని అవగతంచేసుకోడానికి ప్రయత్నించాడు. కానీ ఆ అవకాశం లభించేలోపుగానే అతడి తలపైన నాలుగైదు మొటికాయలు పడ్డాయి. చుట్టూరా ప్రోగైన ప్రయాణీకులు అతడి వీపుపైన వీలైనన్ని పిడిగుద్దులు ప్రసాదించారు. బస్సు లోపలిభాగం మరీ ఇరుకైపోవడంతో ప్రహారణోత్సవం అత్యంత విజయవంతం కావడానికి వీల్లేకపోయింది.

బస్సులో ఓ వైపున గలాటా జరుగు

# నిజానిజాలు

"ఈ సంగతి విన్నారటండీ?"

"ఏమిటది?"

"ఒక మనిషి చెబుతున్నమాట నిజమో, అబద్ధమో తేల్చి వేయడానికి అమెరికాలో ఒక యంత్రం కనిపెట్టబోతున్నారట!"

పరుగెడుతున్న బస్సులో, దిగజార్చిన పరదాలకు నడుమ మెత్తని సుఖాసనాలపైన మాగన్నుగా వున్న ప్రయాణీకులు కొందరు ఉలికిపడి కళ్ళు తెరిచేశారు.

"అది వార్తా, కాకపోతే ఊహాగానమా?" అని ప్రశ్నించాను.

"వార్తేనండీ! క్రయిమ్ చిత్రాలు డిటెక్టివు నవలలు తామరతంపరగా అభివృద్ధి చెందుతూ వుండడంవల్ల సంఘంలో నేరస్థుల సంఖ్య మితిమీరి పోతోందట! వాడివాడి మాటల్నిబట్టి, వారు దొంగో, దొరో తేల్చి వేయడానికి అనువుగా విజ్ఞాన శాస్త్రజ్ఞులు ఈ యంత్రాన్ని కనిపెట్టడానికి తీవ్రంగా కృషిచేస్తున్నారట!"

ఈవార్తపైన ఓ తలనెరసిన వృద్ధుడు వ్యాఖ్యానం ప్రారంభించాడు.

"ఉప్పూ కప్పురంలాగే మంచీ, చెడ్డా, సత్యమూ, అసత్యమూ బాహ్యదృష్టికి ఒక్క మాదిరిగానే గోచరిస్తున్నాయి. వాటి తారతమ్యాన్ని గూడా యంత్రాలే నిర్ణయింపగలిగితే అంతకన్నా కావలసిందేమీ లేదు. అప్పుడిక కోర్టులు వకాలత్తులు విచారణలు బొత్తిగా అనవసరం!"

ఈ లోకజ్ఞుడి మాటల్ని మననం చేసుకుంటూ మళ్ళీ కళ్ళు మూసుకున్నాను. ఉదయం కానూకానూ రోడ్డులో రాకపోకల సందడి హెచ్చవుతున్నందువల్ల బస్సు వేగం మందగిస్తోంది. కునుకు పట్టనూపట్టనూ నా మనోవీధిలో ఏవేవో దృశ్యాలు రేఖాచిత్రాలకు మల్లే ద్యోతక మౌతున్నాయి. పెదపెద్ద రైల్వే స్టేషన్లలో జనం నడయాడే చోట గోడకు వ్రేలాడే పటం ఒకటి నాకప్పుడు జ్ఞప్తికివచ్చింది. 'దొంగలున్నారు జాగ్రత్త' అన్న హెచ్చరికకు అది రూపకల్పనైతే గావచ్చు. దొంగలుగా పేరుమోసిన వారి ఛాయా చిత్రాల్లోనుంచీ తలలు మాత్రం కత్తిరించి ఆ పటంలో పునర్ముద్రించడంజరిగింది. వీడుదొంగ అని నుదుట వ్రాసిపెట్టకపోయినా అందులో ప్రతివాడూ మన వుద్దేశంలో దొంగగానే భాసిస్తాడు. ఇందుకు కారణమేమిటా అని వితర్కించుకున్నట్టయితే చెదరిన క్రాపింగు, చిట్లించుకున్న నుదురు, కనుముక్కుల తీరు యివన్నీ వాడి అంతర్యాన్ని చూపరులకు చెప్పకనే చెప్పేస్తున్నాయేమో నని మనం అనుకోక తీరదు. ఆముఖాన్ని మనం వెయ్యమందిలో చూచినా పోల్చుకోవచ్చు. అపాయాన్ని శంకించినట్టయితే అందుకుదగిన వుపాయాన్ని వూహించుకోవచ్చును గనుక, యిలాటి వాళ్ళవల చిక్కే లేదేమో అనిపిస్తుంది. ఉన్న చిక్కల్లా మనుషుల్లో మనుషులుగా కలిసి సంచరించేవాళ్ళతోనే!

బస్సులో నేనింకా జోగుతుండగానే సూర్యోదయమై వుంటుంది. వేడెక్కిపోతున్న యింజన్ని మంచినీళ్ళతో శాంతింప జేయడానికి, వేడి (కాకపోతే ఉత్సాహం) తగ్గిపోతున్న శరీరానికి టీ నీళ్ళతో వుషారెక్కించడానికి డ్రయివరూ కండక్టరూ బస్సును మార్గమధ్యంలో ఎన్నిసారు ఆపారో నాకు తెలియదు. సడన్ బ్రేకుతో కలిగిన కుదుపువల్ల ఓ లావుపాటి మనిషి నా పైనపడి, ఆ తాకిడికి నా తల కమ్మికి మోదుకోడంతో నీరెండలో నీరసించి మాయమైన మంచులా నానిద్ర మటుమాయమైంది.

పటణంలో అయిదుగంటలకు బయలుదేరిన బస్సొకటి, అక్కడ మా బస్సుతో తారసిల్లింది.

"ఈరోజు కాస్త లేటుగావస్తున్నావు" అన్నాడు మా బస్సుడ్రయివరు.

ఆ బస్సులో కూచున్న డ్రయివరు కంగారుతో తబ్బిబ్బయి పోతున్నాడు.

"లేటుసంగతలావుండనీగానీ నేనిక్కడ ఒక పాసెంజరును దింపేస్తున్నాను. సీటువున్నా లేకపోయినా నువ్వతణ్ణి ఎక్కించుకోవాలి"

"ఏం, ఎందుకూ!" ఆశ్చర్యంతో ప్రశ్నించాడు మాబస్సు డ్రయివరు.

"తీరిగా చెబుతూ కూచోడానికి టైంలేదు. పాపం, ఈ ఆదమరచిన పెద్దమనిషి క్షణంలో వెయ్యి రూపాయలు పోగొట్టుకున్నాడు."

"వెయ్యిరూపాయలే! ఏం జరిగింది? ఎలా పోయింది?" డ్రయివరుతోబాటు ఐదారు మంది ఏకకంఠంతో ప్రశ్నించారు.

"అదొంగ వెధవకూడా ఈయనతోబాటే టౌనులో బస్సెక్కాడు. గ్రహచారమేమిటంటే ఈయన చేతిలోవున్న లెదర్ బ్యాగులాంటిదె వాడి చేతిలోనూవుంది. మసక చీకట్లో వాడేం ట్రిక్ చేశాడోగానీ చల్లగా వాడి సంచిని ఈయన దగ్గరుంచి, ఈయన సంచిని చేతబట్టుకుని యిరవై అయిదో మైల్లో నాలుగురోడ్లు కూడలి దగ్గర బస్సు దిగేశాడు. బస్సు ముప్పయ్యో మైలు రాయి దాటుకునేదాకా ఈయనగారా సంగతి తెలుసుకోలేకపోయారు."

"అయ్యయ్యో, ఆ తరువాతేం జరిగింది?"

"జరగడానికేముంది? లబోదిబోమంటూ నన్నిక్కడే దింపేయి, వాడిని వెంటాడుతానన్నాడు. "అయ్యా మహానుభావా, కాలి నడకతో వాడిని వెంటాడితే నీ డబ్బు నీకు దొరికినట్టే! అలా కాకుండా యిక్కడ దిగేసి బస్సుకోసం వెయిట్ చేస్తారనుకో! తీరా ఆ బస్సులో సీటు దొరక్కపోతే ఏం చేస్తావు? అలా కాదు. ఈ బస్సులో నే యింకొక నాలుగైదు మైళ్ళురా. మాకంపెనీ బస్సే ఒకటి ఎదురుగావస్తుంది. నిన్ను దాన్లో ఎక్కించేస్తాను' అన్నాను."

"అలాగా! ఇప్పుడేడీ అతను?" అంటూ మాబస్సు డ్రయివరు కూర్చున్న తావులోనే సర్దుకుని వెనుదిరిగాడు. అతనితోబాటు బస్సులోవున్న ప్రయాణీకులందరూ ఆ వైపుకు చూపులు మళ్ళించారు.

చెమటలో ముఖం దొప్పదోగుతుండగా, భుజంపైన అంగవస్త్రం క్రిందికి జారిపోతుండగా వేడి వేడి నిటూర్పులతో ఆస్సు రుస్సుమంటూ ఓ నలభైఏళ్ల వ్యక్తి బస్సులో కెక్కుతున్నాడు.

ఉత్సవంలో బిడ్డను దారబోసుకుని జుట్టు వీడిపోతుండగా, పమిట సవరించుకోవడం సైతం మరచిపోయి, పరుగునా బారునా జన సమూహంలో కలయ తిరిగేస్తున్న తల్లిని గనుక వూహించుకున్నట్టయితే ఈ పెద్ద మనిషి ముఖంలోని దైన్యాన్ని ప్రత్యేకం— వివరించవలసిన పనివుండదు.



# నిజానిజాలు



అతడు సీటు కోసం అటూ యిటూ చూడకుండా దబేలున క్రింద కూచున్నాడు. తలపైన చేతులుంచుకుని డ్రయివరు కేసి చూస్తూ "వెళ్ళవే బాబూ! వేగంగా వెళ్ళనీ బాయబా!" అని వేడుకున్నాడు.

బస్సు కదిలింది.

శరవేగంతో పరుగిడుతున్న బస్సులో అతడిపైన ప్రశ్నలవర్షం కురవసాగింది.

"అతే అతడు సంచీ మారేస్తున్నప్పుడు మీరు నిద్రపోయారన్నమాట?"

"పోనీగానీ, అతడు బస్సు దిగుతున్నప్పుడైనా మీరు మీ చేతనున్న సంచిలో డబ్బుందో లేదో చూచుకోలేకపోయారా?"

"ఇంతకూ ఆ మనిషి ఎలావుంటాడండీ?"

—"నన్నేమీ అడక్కండి బాబూ! నన్నేమీ అడక్కండి." అరిచాడనడం కన్నా అతడు ఆక్రోశించాడనడం సమంజసం.

బస్సు పదిహేను నిమిషాలు ఏకధాటీగా పరుగుతీసింది. ఆలోపల ఎవరో అతడికి ఆసన సదుపాయం సమకూర్చారు. కానీ అతడు తన తావులో నిశ్చలంగా కూర్చోలేకపోయాడు. అలాగని లేచి నిల్చోనూ లేకపోయాడు. ఐదుము విరిగిన వాడికి మల్లే నిటారుగా కూచోనూలేక, లేచి నిలబడనూ లేక అతడు కాసేపు కిటికీలోనుంచీ తల దూర్చి పరిసరాల్ని గాలిసాడు. మరి కొంత సేపు డ్రయివరువైపు వంగి అద్దంలోనుంచీ రోడ్డుపైకి చూసాడు. చిత్రమేమిటండీ అతడితోబాటే ప్రయాణీకులందరూ నిలువెల్లా కళ్లు చేసుకున్నారు. ఒకరితల మరొకరికి అడ్డురాకుండా ఒక్కొక్కరూ ఒక్కొక్క భంగిమలో ముందుకూ, వెనక్కూ, ప్రక్కకూ వంగి యింతకుమునుపు తమకు ముఖ పరిచయమైనా లేని వ్యక్తికోసం కనుచూపు ప్రసరించినంత మేరకూ వెదికేస్తున్నారు.

కానీ యిరవై అయిదోమైలు దగ్గర ఎక్కడో బస్సు దిగిన మనిషి, పొలాలపైన బడి అడ్డుదారి పటివుండవచ్చు. లేదా, అది నాలుగురోడ్ల కూడలి గనుక, మరోకరోడ్డు వెంట ఈపాటి కెప్పుడో పలాయనమంత్రం పఠించివుండవచ్చు. కానీ ఈ అనుమానం ఎవరికీ కలిగినట్టులేదు. ఇప్పుడో మరి కొంత సేపటికో ఆ దొంగ చేజిక్కిపోవడమే ఖాయమని అందరూ విశ్వసిస్తున్నారు.

అందుకు తోడూ డ్రయివరుగూడా భరోసాయిస్తున్నాడు.

"మాదర్చోద్! వాడెక్కడికి వెళ్ళగలడండీ? మీరొక పనిమాత్రం చేయాలి. ఇలాగే రోడ్డుపైకి చూస్తూవుండి, వాడింకా ఒక ఫర్లాంగు దూరంలో వుండగానే హింట్ యిచ్చెయండి. ఆ తరువాత వాడి సంగతి నేను చూస్తాను."

డ్రయివరు అన్నంతపని చేసేటట్టుగానే వున్నాడు. దుష్టశిక్షణకుగానీ, శిష్టరక్షణకుగానీ అంత పట్టుదలగా పనిచేసే మనుషులు నలుగురైదుగురుంటే ఒక లోకంలో అన్యాయాలే జరగవనిపించింది.

బస్సు యిరవయ్యారో మైలురాయి దాటింది.

"దగ్గరికి వచ్చేస్తున్నాం! జాగ్రత్త!" వెనుకనుంచీ కండక్టరు కేక వేశాడు.

నిమిష నిమిషానికీ ప్రయాణీకులు అనిమిషనయనులై పోతున్నారు అప్రమత్తులైపోతున్నారు. డబ్బు పోగొట్టుకున్న ఆసామిపైన అనుకంప, కాజేసిన దొంగపైన ఆగ్రహం, ఈ రెండు భావాలే వాళ్ళ ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా పరిణమించాయి.

నిశ్చల కాసారంలో రాయిపడి, కొలను కొలనంతా తరంగ కల్లోలితమైపోయిన తరువాత పైకిలేచిన నీటి బుడగలా అప్పుడొక కేక వెలువడింది. "అదిగో, వాడే, వాడే, దొంగ!"

"మీరు కూచోండి, కూచోండి" అంటూ నలుగురైదుగురు ప్రయాణీకులు ఆ పెద్ద మనిషి భుజాలపైన, తలపైన చేతులువేసి క్రిందికి అదిమేశారు.

"ఆ వైపు చూచింది చాలు! అందరూ ఇటు తిరిగి కూచోండి" అంటూ కండక్టరు కాషన్ యిచ్చాడు. దగ్గరలో ఆపడానికి వీలుగా డ్రయివరు బస్సువేగం తగ్గించాడు.

బస్సు సరిగ్గా నాలుగురోడ్ల కూడలిలోనే ఆగింది. లెదర్ బ్యాగు చేతబట్టుకుని చెట్టు క్రిందనుంచీ పరుగిడివచ్చిన వ్యక్తి కంగారుగా చేతిని అడ్డంగాచాపి "ఇదేవూరి బస్సు" అన్నాడు.

కానీ కండక్టరు అతడి ప్రశ్నకు తీరిగా సమాధానం చెబుతూ కూచోలేదు. బస్సు దగ్గరికి రాగానే అతణ్ణి రెక్కపట్టుకుని ఒక్కవుదుటున లోపలికి ఈడ్చేశాడు.

అతడు పాతికేళ్ళ యువకుడు. సన్నగా పొడుగ్గా, నల్లగా ఎముకలగూడు లాంటి మనిషి. చప్పిడి దవడలు, ఎత్తయిన ముక్కు. బహుశా అతడు తన పొడుగాటి శిరోజాలను వెనక్కు దువ్వుకునేవాడేమో! బస్సులో బోరగిలబడి అతడు తల పైకెత్తేసరికి ఆ వెంట్రుకలన్నీ ఎటు వీలైతే అటు చెదరిపోయి పెద్ద బుట్టలాగా తయారయ్యాయి.

అతడు బొత్తిగా నాకు అపరిచితుడు. కానీ అతడి ముఖంమాత్రం ఎన్నడో కలలో కనిపించినట్టు నాకొక విచిత్ర భావన కలిగింది. బహుశా ఆ ముఖం (కాకపోతే అలాటి ముఖం) నాకు రైల్వేస్టేషనలోనూ పెద్ద పెద్ద పోస్టాఫీసుల్లోనూ వ్రేలాడే పటాలలో కనిపించేదేమో ఇప్పుడు నిర్ధారణగా చెప్పలేను.

అతడు తలపైకెత్తి పరిస్థితిని అవగతంచేసుకోడానికి ప్రయత్నించాడు. కానీ ఆ అవకాశం లభించేలోపుగానే అతడి తలపైన నాలుగైదు మొటికాయలు పడ్డాయి. చుట్టూరా ప్రోగైన ప్రయాణీకులు అతడి వీపుపైన వీలైనన్ని పిడిగుద్దులు ప్రసాదించారు. బస్సు లోపలిభాగం మరీ ఇరుకైపోవడంతో ప్రహారణోత్సవం అత్యంత విజయవంతం కావడానికి వీల్లేకపోయింది.

బస్సులో ఓ వైపున గలాటా జరుగు












చలనం : సంచలనం : —ఏ. సూర్యారావు]

తుండగా, పైకం పోగొట్టుకున్న పెదమనిషి ఏ సందులోనో గానీ తన లెదర్ బ్యాగును చేజిక్కించుకున్నాడు. ఓమూలగా కూర్చుని సంచిని తెరిచి చూచాడు అతడి ముఖం హర్షప్రఫుల్లమైపోయింది. వెంటనే అతను సంచిని మూసేశాడు. మూసేస్తూ "కొట్టకండి బాబూ! మీకు పుణ్యముంటుంది. అతణ్ణి వదిలేయండి" అంటూ పైకిలేచాడు

"వదిలిపెట్టడమా! వీణ్ణి! ఊరుకోండి సార్, ఊరుకోండి. ఈరోజు వదిలిపెడితే మళ్ళీ రేపిపాటికి ఇలాంటి వ్యవహారమే మరొకటి జరుగుతుంది. మీరు మౌనంగా కూచోండి. నేను వీణ్ణి తీసుకెళ్ళి పోలీసుస్టేషనులో పడదోస్తాను" అన్నాడు డ్రయివరు.

"ఎందుకు బాబూ! వద్దు. మన డబ్బు మనకు దొరికింది. అంతేచాలు." ఆ పెద్దమనిషి డ్రయివరుకు నచ్చచెప్పబోగాడు "ఈరోజు లేవగానే ఎవరిముఖం చూచానో నా అదృష్టం మంచిది. నేను నా కుమార్తె పెళ్ళికోసం నగలు తాకట్టుపెట్టి డబ్బు తీసుకెళ్తున్నాను. కేసు పోలీసుదాకా వెళ్తే విచారణ పూర్తయ్యేవరకూ డబ్బు నా చేతికి రాదు. పెళ్ళికి అంతరాయం కలుగుతుంది. దయచేసి నన్ను నిర్బంధించకండి" అంటూ అతడు సంచిలోనుంచీ మూడు పదిరూపాయలనోట్లను పైకితీశాడు ఒకటి డ్రయివరుకిచ్చాడు. మరొకటి కండక్టరుకిచ్చాడు

"ఇంకొకటి ఎవరికిస్తాడా అని అందరూ డైలమాలో పడ్డారు.

ఆయన యింకా ప్రయాణీకుల పాదాల ముందు బోరగిలపడివున్న యువకుణ్ణి లేపి కూచోబెట్టాడు అతడి కళ్ళలోకి నిశితంగా చూసు "ఈరోజు నువ్వు నిద్రలేచిన వేళ గూడా మంచిది! లేకపోతే మరికొంతసేపటికి కమ్ముల్లోపలికి నడిచివుండేవాడివి. ఈరోజు తప్పించుకున్నావు. రేపు గూడా తప్పించుకోవచ్చు. కానీ ఏనాటికైనా పట్టుబడటం తథ్యం. ఇదిగో, నీకు నేను పదిరూపాయలిస్తున్నాను. ఇకమీదట ఎన్నటికీ యిలాంటిపని చేయవద్దని హెచ్చరిస్తున్నాను. ఆతరువాత నీయిష్టం" అని నోటును అతడి జేబులో వేసి గబగబా బస్సు దిగేశాడు.

డ్రయివరూ, కండక్టరూ, ప్రయాణీకులూ అందరూ తెల్లబోయారు.

"అందరికీ నమస్కారాలు బాబూ!" అంటూ ఆయన చేతులు జోడించాడు.

ఆయనపట్ల ప్రయాణీకులకున్న గౌరవభావం అమాంతంగా ద్విగుణీకృతమైంది. డ్రయివరూ, కండక్టరూ తమకు దొరికిన బక్షీసుతో తృప్తిపడి మళ్ళీ తమతమ కార్యక్రమాల్లో నిమగ్నులయ్యారు!

• * •

తొమ్మిది, తొమ్మిదిన్నర కల్లా బస్సు గమ్యస్థానం చేరుకుంది. తోటి ప్రయాణీకులందరూ గొందుకొకరుగా, వీధికొకరుగా చీలిపోయారు. పట్నంలో నాకూ కాస్త పని వున్నమాట నిజమే! కానీ అదేమంత తొందరపని గాదు. అదీగాక ఓక్షణం పాటు అలా నిల్చోగానే తమతమ[illegible]నులమీదుగా బస్సులు, సైకిళ్ళు, రిక్షాలు, జట్కాలు లాంటి వాహనాలమీద వందలూ, వేలుగా కదలిపోయే మానవులు ప్రత్యక్షమయ్యే పట్టణాలో, అప్పుడే పల్లెటూరినుంచి వచ్చి బస్సు దిగినవాడు, తన స్వంత పని విస్మరించడంలో అసహజమేమీ లేదు!

పదిపదిహేను నిమిషాలపాటు నేను శరీరానికి సౌఖ్యదాయకంగావున్న చలికాలపు ఎండలో నిల్చుని బస్సుస్టాండులో వినోదాల్ని చూస్తూ వుండిపోయాను.

'ఏమండీ! సార్!' ఎవరో పిలిచారు. వెనుదిరిగి చూచాను. అతడు మరెవరోగాదు. దొంగతనానికి మూరోద్దయా తయ్యార్వే

# నిజానిజాలు

లక్ష్యం ఎదుర్కొన్న దురదృష్టవంతుడు!

నాకు మహదాశ్చర్యం కలిగినమాట వాస్తవం! దెబ్బలతో సొమ్మసిల్లి బస్సులో పడిపోయిన తర్వాత యింతసేపటికి అతడికి తెలివొచ్చిందేమో ననుకున్నాను. అతడు కళ్ళు మూసుకోలేదు. తల వాల్చలేదు. కాని ఆకళ్ళలో జీవం లేదు. ఆముఖంలో చలనం లేదు. ఎన్ని తిట్లు, ఎన్ని పరిహాసాలు, ఎన్ని ఈసడింపులు! త్రోవపొడుగునా అతడికి దేహశాంతి జరుగుతూనే వచ్చింది. ఐనా అతడు కదలేదు, మెదలేదూ! కళ్ళూ, చెవులూ, నోరూ లేని దౌర్భాగ్యుడికి సైతం కనీసం స్పర్శజ్ఞానమైనా వుంటుంది. వీడి కదీ లేదనిపించింది!

అలాటివాడు నన్ను పిలుస్తున్నాడు!

'ఏమిటి? ఎందుకూ?' అంటూ తెల్లబోయాను. అతడు దగ్గరకు రమ్మన్నాడు. కానీ నేనింకా తటపటాయిస్తుండగానే అతడే నన్ను సమీపించాడు.

అతడితో ఎలా మాట్లాడాలో తోచక అప్రయత్నంగా 'ఏం కావాలి' అన్నాను.

"ఏమీ వద్దండీ! మీ రొక్కరైనా నిజం తెలుసుకోకలిగితే చాలు" అన్నాడతడు.

"నిజమా! కళ్ళకు కనిపించింది నిజం కాదేమిటి?" అన్నాను.

"కాదుబాబూ! అది నిజంగాదు. దేవసాక్షిగా చెబుతున్నాను. నేనే పాపమూ ఎరుగను." నా ముఖంలో కరడు గట్టుకపోయిన అనుమానపు నీడల్ని పసి గట్టాడేమో, అతడు నా చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ అడిగాడు "చెప్పమంటారా బాబూ!"

చేసేదిలేక చెప్పమన్నాను. అతడు ప్రారంభించాడు.

"ఉదయం అయిదు గంటలకు బస్సెక్కాను."

"ఎక్కడికి పోదలచి?" ఆదిలోనే హాం[illegible]గులా అడ్డు తగిలాను.

"ఊళ్ళో మా అమ్మవుంది. ఆ నాలుగు రోడ్లు కలిసేచోట దిగి రామాపురంనుంచీ బొమ్మసముద్రం వెళ్ళే బస్సెక్కితే పదో మైల్లోనే మా వూరు."

"ఐతే నువ్వు మీ వూరికి వెళ్ళదలచుకున్నావన్నమాట."

"నేను గనుక నెలకు పది రూపాయలు పంపిస్తే మా అమ్మ తింటుంది. లేకుంటే పస్తులు పడుతుంది. నేను మా వూరెళ్ళి నాలుగైదు నెలలయింది. వెళ్ళి డబ్బిచ్చి, రెండు రోజులుండి వద్దామనుకున్నాను."

"అన్నట్టు నువ్విక్కడ చేసే పనేమిటి?"

(43 వ పేజీ చూడండి)

# ఆనందపు లోతులు

## రామానుజాచార్య

నిద్రలేచాడు, ఎప్పటిమాదిరిగా కాకుండా:
ఎంతో హాయిగా, కాటిస్ ఫైడ్ గా.
గడియారం ఆరు. ఆశ్చర్యం!
తెలీదు యీవింత ఎట్లా జరిగిందీ. రెండో సినిమా చూచాడు. ఒంటి గంట. ఒక్కడూ నిద్ర. ఎప్పుడూ ఎనిమిదింటికి కాని లేవడు. బద్ధకం, చేసే పనిలేదు. ఏపనీచెయ్యబుద్ధి కాదు.

ఇంకా రెండు గంటలు!

నిద్దరరాదు, తేలిపోయింది. పక్కమీద కూర్చోడం అసహ్యం! లేచి?

కాలకృత్యాలు. అత్యవసరం.

చుట్టూ వాతావరణం. ఆనందం, ఆహ్లాదం సంతోషం. తనకోసం, తన సుఖంకోసం!

ఏసంగతీ గుర్తురాదు, అంతా ఏవో ఆలోచన్లు! మనసు ఊరుకోదు; విశ్రాంతి తీసుకోదు. ఉరకలు వేస్తుంది ఎందుకో!

ఏదు! స్నానం అయింది. ఇస్త్రీ దుస్తులు తెల్లగా-సన్నజాజికి మల్లే.

కాఫీ?—వ్యసనానికి బానిస!-హోటలు. బజారు—అది సంతోషంలో నే మునిగి.

బారులు తీర్చిన దుకాణాలు-ఒక దానికీ మరో దానికీ మధ్య చీమ దూరేంత సందు కూడా వుండదు. రకరకాలయినవి. రోజూ చూస్తూనే వున్నాడు. కాని యివాళ యేమిటి? ఏదో కొత్తగా వింతగా ఎక్కువ ఆనందంగా. ప్రపంచపు యిరుసు తిరగడంలో ఎక్కడా నీడలు కనపడవు. అంతా వెలుగు.

కళ్లీ నములూ—ఎక్కడికి? యింటికి కాదు—దూరంగా. వెనుకనుంచి ఎవరో పిలుపు—చప్పట చరుపు. రాఘవరావు! చదువులో సహాధ్యాయి. బాగా ఆస్తి వుంది. యే వుద్యోగమూ చేయడు. తన లాగే ఉన్న డబ్బు ఖర్చు చేసుకోలేక అవస్థపడుతున్నాడు. ఖులాసా కబుర్లు.

'యీ సినిమా చూచావా?' గోడమీద అంటించిన పోస్టర్ చూపుతో.

'ఆఁ'

'ఎలా వుంది?

'రాత్రి—రెండో ఆట చూచాను. బాగుంది, చాలా బాగుందిలే' తను!

'నేను చూడలేదింకా - యివాళ చూదామా?'

'ఎందుకు?నువుచూచిరా - నేచూశాగా!'

'మళ్లీ'

'వొద్దు.'

'బాగుందిగా'-యిట్లాగే ఉత్సాహంగా-

'వెంకటరత్నం. గుర్తున్నాడూ నీకు?:

'ఎవరు?'

'వెంకటరత్నం బి.యేలో నా వెనక సీటు. మంచి ఫ్రెండ్ మనకు. పొడుగా, నల్లగా-'

'ఎస్. గుర్తొచ్చింది అవును! యిప్పుడెక్కడ?'

'అదే చెబుతా - యిక్కడే! బ్యాంకు ఏజంట్'

'మంచిపని!'

'నిన్ననే చార్జి పుచ్చుకున్నాడు. నా గెస్టు వాడు. మధ్యాహ్నం భోజనం అయినాక - రా, మాట్లాడుకుందాం. వాడూ నిన్ను గురించి చాలా -'

'ఓ! అంతకన్నానా!' సంతోషం తనకు.

బాంధవ్యాలు అన్నిట్లోకీ స్నేహంగొప్పది. ఆసంబంధాన్ని మించింది మరేమీకనబడదు - అతనికి. వెంకటరత్నం, రాజు, రాఘవరావు, తను - నలుగురూ బి. ఏ పట్టా ఒకేసారి తీసుకున్నారు. వాత్సల్యం, ప్రేమ, అనురాగం హృదయంలో పెల్లుబికి - వెల్లువగా!

అడ్డంవస్తున్న కళ్ళను తప్పించుకుంటూ, ప్రయత్నపూర్వకంగా నడుస్తూ - యేదో తిరుగుతున్నట్లు. విలాసంగా వుంది కాలం - పన్నిన వలలోనిండా చేపల్లాగ!

గుళ్ళోకిదిగి - ఆడవాళ్ళనీ కొద్దిగా మగవాళ్ళని పోగుచేసి పురాణాలు చెబుతూ - ధవారన, యింకా యేదో ఆరాధనచేసున్న స్వాములార్ని గురించి, హోటల్లో కాఫీ బాగుండకపోవడాన్ని గురించి, విరహంఎరగని కన్నె పడుచులనుగురించి - యింకా ఏవో ఆసమయానికి నాలుక చివరకు యేదివస్తే అది - మాట్లాడుకుంటూ - కాలానికి కళ్లెం వేసినట్లు, నడుస్తున్నారు ధీమాగా!

కనపడే ప్రతిదృశ్యంచూస్తూ, యేమవుతే యేమవుతుందోనని కళ్ళప్పగించి. అప్పుడే రోడ్డుమీద జనం విపరీతంగా - హడావడిగా - పరిగెత్తుతున్నట్లు తెల్లవారిందే తడవు, మనుషులసందు, అపనలో తీరికలేక పోయి, ఒక చేకొట్టుకోవటం. విసుగు. అందులోనే వుంది కావును - అమందానందం. బుజాలమీద భారం వేసుకుని తిరుగుతూ.

తన కేమిటి? ఏమీ లేదు. ఒక పనిలేదు. కనిపించిన స్నేహితుల్తో కాలం గడపడం.

రాఘవరావు హటాతుగా ఆగి, కొత్తగా వచ్చిన సాహిత్య పత్రిక ఒకటి కొన్నాడు దాని పేరుబాగా పరిచయం తనకు. విషయ సూచిక చూస్తున్నాడు. తనకళ్లు మెరిసినై ఆశ్చర్యంతో. నిజమేనా? తనకథ! అచ్చులో తనకథ!

అప్పుడు చెబుతున్నాడు తను, దర్జాగా—స్నేహితుడితో తన కథగురించి—తన అనుభవంగురించి! పదహారణాల సాహిత్య పత్రికలో తన కథ! ఇంతవరకూ తనను యేడిపించుకు తిన్న చిల్లర మల్లర పత్రికలకు శృంగ భంగం. తలవొంపులు. సిగ్గుచేటు. బాగా దెబ్బతీశాడు తను. కసి తీర్చుకుందుకు.తనకథ! సాక్షాత్తు తను యే అక్షరం వ్రాస్తేసరిగా దాన్నే అచ్చువేశారు—తన కొక దమ్మిడీ ఖర్చులేకుండా. చిన్న చిన్న పత్రికలలో పడనిది-ఒక్కసారిగా సాహిత్య పత్రికలో! జన్మలో వుంటుందనుకో లేదు, సాహసమే చేశాడు! ఆనందం పెల్లుబికింది యిప్పుడు. తను ఒక కాలం చేత వున్నవాడు ఇక ఊరుకోడు విజృంభిస్తాడు. చవిచూపిస్తాడు దేశానికి. చదువుకున్న వాళ్లకి—తన భాషలో సొంపు, విషయ సౌష్ఠవం.

ఈ ఆనందంలో ఆలోచనలో—యేం చెబుతున్నాడో తెలీదు—రాఘవరావు.

వాడు చెబుతూనే వున్నాడు. వింటే—? అసలీ పత్రిక బాగుంటుంది. మొదటనుంచి కొంటున్నాను నేను. నీది యిదే మొదటి కథ కావును! బాగా చదవాలి దీన్ని. శ్రద్ధగా ఎవరిమీద రాశావో, ఎవరినెట్లా యేడిపించావో!

తన మొదటి కథ యిదే—కాని యింకా రాస్తాడు ముందు ముందు. వాడికి తెలీదు-కథ ప్రయోజనం ఏమిటో—ఎవరోన్నొ తిడితేనో దుయ్యబడితేనో-అది కథే! తెలీదు వాడికి—అసలు కథలు ఎందుకు రాస్తారో. కథలన్నీ ఎవర్నో తిడుతూనే—మొదలుతూనే!

ఆనందంలో యేదో మాట్లాడ బుద్ధి అవుతుంది. పెద్ద ఉపన్యాసం. కాని నోరు పెగలదు. కలంచేతిలో వుంటే? కాని—రాఘవ యేమిటో అంటున్నాడు—'వెంకటరత్నాన్ని ఒక్కడ్నీ కూర్చోబెట్టి వచ్చా—పదయింది! పోదాం యింటికి? తనుయింటి

# ★ ఆనందపు లోతులు ★

కెందుకు? తిండికి—హోటలు. అదే బజారు.

'తప్పకుండా వస్తా. ఎటూపోకండి మళ్ళీ ఇద్దరూ. ఓ గంటలో'

ఒంటరిగా—రోడ్డుకు అణిగి మణిగి! పద యుంది.

పోస్టాఫీసులో యిదే టైంకు ఉత్తరాలు యిస్తారు.

అటువైపు.

ఉత్తరం రాలేదు. ఏదో బుక్—పోస్ట్. తెరిచి చూపి—అదే సాహిత్య పత్రిక—తన కథ ప్రేమతో అచ్చువేసుకున్న మొదటి గొప్ప పత్రిక! ఎరిగిన వాడెవడో చూశాడు—తనకా పత్రిక రావటం.

'చందా కట్టావా?'

'అవును—' అంతకన్నా యేం అనాలి?

'వెనకటి ఇస్యూలు వున్నాయా?'

'ఊహూ, యిదే మొదలు!'

'నువ్వు చదివాక...'

'అట్లాగే!—'

తనకు తెలుసు యీ దేశపు దౌర్భాగ్యం. డబ్బు వున్న వాళ్లు కూడా ఖర్చు చేయరు. పుస్తకాలు కొనరు అసలే. అవ్వి లేకపోతే గడవనివి. ప్రాణం పోయేవి—మాత్రం కొనుక్కుంటారు. జీవితంలో ఒక రకంగా సెటిల్ అయాక యిక విజ్ఞాన వికాసాలు గుర్తురావు. కాని చదవాలనే వుంటుంది, పుస్తకాలు. చదివితే బాగుంటుందనీ బ్రహ్మాండంగా వుంటుందనీ తెలుసును హృదయానికి. డబ్బుపెట్టి ఎవరూ కొనరు. తెలుగువాళ్ళు పత్రికలే కొనరు. వాళ్ల ప్రాణానికి డబ్బే ప్రాణం.

హోటలు వచ్చింది. పుస్తకంమీద ధ్యాస తగ్గించి, ఆలోచనలు మాత్రం తగ్గించలేక పోయి—మడిచి జేబులో పెట్టుకొని—భోజనానికి!...

భోంచేస్తాంటే ఎవరో కనిపించారు. తనబంధువే. దూరం. ఎప్పుడో చూచాడు—చాలకాలం క్రితం. ఆయనే పలకరించాడు. తన కజిన్ బ్రదర్ బావమరిది! యీయన కజిన్ బ్రదర్! తింటున్నసేపూ మాట్లాడుతూనే వున్నాడు. ఏవేవో శుభ వార్తలు. ఏదో చుట్టాలను గురించి—ఎవరెక్కడ వున్నారో—యేం చేస్తున్నారో—ఎంతమంది పిల్లల్ని కన్నారో—! ఎవరో తనకు చెల్లెలు వరస అయే పిల్లకు నెల్లూరు జిల్లాలో పెళ్లి. మరో అక్కగారు యేదో ఆడపిల్లను పురుడు పోసుకుంది. ఎవరో కోరులో గెలిచారు. గొప్ప ఆ సి. బావమరిది యిటీవల యేదో కమిటీ మెంబరుగా ఎన్నికయ్యాడు. కజిన్ బ్రదర్ తండ్రికి ప్రమోషన్—గెజెటెడ్ రాంక్! ఆయిదేండల్లో రిటైరు. ఏదో ఊళ్ళో కొత్తగా కాలేజీ పెట్టారు...

అన్నీ సంతోషం కలిగించేవే. కారణం మాత్రం ఆలోచించడు. బంధువును వెంటబెట్టుకుని యింటికి. పదినిమిషాలు—డక. ఆయనకేవో పను. ఏపనీలేకుండా పొరుగూరెందుకు? రాత్రికి పడుకుందుకు రమ్మన్నాడు. ఏడింటికి అదేహోటలు. శెలవు.

ఈ సందట్లో మరుపు - వెంకట్రత్నం సంగతి. సరిగ్గా పన్నెండుకు అక్కడికి. రాఘవనిద్ర. రత్నం లేచాడు. వాడిముఖం విప్పారి—తామరాకంత,గోడగడియారానికి పదిరెట్లు! హృదయం అంతకన్నా. ఇద్దరికీ అంతే. తనకు యింకా ఎక్కువ. చాలా ఎక్కువ. పొద్దుట్నించీ యింతే. అన్నీ శుభ వర్తమానాలు. అసలు కథ వొక్కటే చాలు.

మాటల్లో వెనకటిరోజులు. గడించిన సుఖాలు - కలవరింతలు! ఆరోజులు మళ్ళీ రావు. అందుకని భయం. కాని ఈరోజు? ఇదిమాత్రం మళ్ళీ వస్తుందా? ఈ ఆనందపు అలలు—?

'ఎందరు పిలలు?'

'ఒకటి ప్లస్ ఒకటి—' అడగబోయే ప్రశ్నకూడా యిపుడే జవాబు. వాడంతే. అప్పుడే రత్నం యిద్దరుపిల్లలతండ్రి. తను?—మొదటి కాన్పు—పుట్టింటికి పంపాడు. నేడో రేపో రావాలి—వుత్తరం—పిల్లో పిల్లడో చెబుతూ, వస్తుంది...బారసాలకు వెళ్లాలి. ఆ శుభవార్త కూడా నేడే వస్తుందేమో! అసలు—దానికి సూచనలే యివ్వి కావును. అవవచ్చు. 'రాజెక్కడో తెలుసా?'

—యేం తెలుసు? తనకేం తెలుసు? ఎవడూ ఉత్తరాలు రాయడు. ఎవరికీ తనంటే శ్రద్ధ?...

'కాకినాడలో మాషరు—'

—ఎల్. టీ. అయినాడు, గవర్నమెంట్ స్కూళ్లు—'

'ఈరోజుల్లో దాన్నిమించిన ఉద్యోగం. మంచిది వుంటుందంటే నేను నమ్మను.

రోజుకు అయిదుగంటలుపని—దర్జాగా కుర్చీలో కూర్చుని!'

'అవునే—పొరుగింటి పుల్లకూర—' వెటకారం తనకు. కొద్దిగా అసూయ రత్నం ఉద్యోగంమీద. రాజుమీద సానుభూతి. వీడుయేజంటు. పెద్దబ్యాంకుకి. ఏదో బోల్డు కబుర్లు చెబుతాడు.

రత్నం నవ్వు—స్నేహితుడి హాస్యానికి. ఊఁ అర్థంలేదు. రాఘవ లేచాడు. 'ఇప్పుడే కలలోనువ్వు—'

కలలోకూడా వస్తాడుతను, నవ్వూ—పగటికలలు! కళ్లు నులుముకుంటూ, హటాత్తుగా—రత్నంతో—'వీడికథ, అసలు రాగానే చెబుదా మనుకున్నాను, చదువు—పెద్దగా' పత్రిక చూపుతూ వాడు. గొప్పగా తను మందహాసం. రత్నం వింత చూపు. తనకథ—ముగురు బియ్యేలు—అర గంట చదివారు.—సవిమర్శగా. ఒక్కో వాక్యానికి గొప్పపడుతో, అభినందిస్తో.

'బాగా రాశావురా, ఎంతిస్తారు?'

'పాతిక, బహుశ—యేం?'

—అవునన్నాడు తను, అమాత్రం చేయదూ? కథలమీద, సాహిత్యంలో కథలస్థానంమీద. జనసామాన్యంలో కథల ప్రభావంమీద, అభిరుచులమీద—గొప్ప చర్చ. తనకు మంచి ప్రోత్సాహం. 'వేలు' పెట్టినా లభ్యంకాని ప్రోత్సాహం. తన గొప్పను ఎదటి వాడు పొగడడం-అయాచితంగా. అప్పుడే!

కథలమీద సంపాదనగురించి, పేరు మార్చుకుని కొందరు యేకంగా ఆడవాళ్ళ పేర్లతో రాయడాన్నిగురించి—! అర్థ నారీశ్వర భావం.

ఏదో ఆనందం, ఖుషీ అందర్నీ చుట్టి. ఊహించరు ఎవరూ, ఎందుకో—దాన్ని తేలిపోవడం తప్ప. పుట్టబోయే కొడుకును గురించి-వాడిఆటపాటల్ని గురించి, పోషణ గురించి, లోలోపల ఆలోచన్లు. పైకిమాత్రం మాటలువింటూ—వాళ్ళ కబుర్లకుమత్తు.

ఆనందంలో అలిసిపోయి, ఉత్సాహంలో ఎక్కువ మాట్లాట్టంవల్ల శ్రమ. బడలిక. గడియారం మూడు. కాలం దొర్లించడం బహు తేలిక. ఏదో తిండి అందరికీ కావాలి. యిప్పుడు. టిఫిన్. బయులుదేరారు. ఎక్కడికి? ఒకచోట కాఫీ బాగుండదు—కాని పెసరట్టు దివ్యం. తీపి బాగున్నచోట కారం వికారం. కాఫీలో చింతగింజలు. అన్నీ సరి పడవు అందరికీ. కాని ఎక్కడికేనా వెళ్లాలి గద! కూర్చున్నారు, తిన్నారు, తాగారు, అనురక్తి మళ్ళీ హెచ్చింది. బిల్లు ఎవరు చెల్లించాలని వాదన.

'మీరు నా గెస్ట్—' అంటాడు రాఘవ. తక్కిన యిద్దరూ ఏదో సమాధానం. చివరకు వాడే యిచ్చాడు. మళ్ళీ యింటికి.

నిమిషం నోరుమూతపడదు. పడకూడదు, పడితే అమూల్య క్షణాలు ఎట్లా అవటం? తనకది పర్వదినం. మళ్లారాదు ఎన్నడూ. వొస్తుందని తనకు నమ్మకం సున్న. ఏ దేవుడినో ప్రార్థించి సాక్షాత్కారం చేసుకున్నాడు. వరం సంపాయించాడు, ఒకరోజు సుఖానికి. మళ్లీ మాటలు. అయిదు వరకూ యిట్లానే. అదేసాయిలో. అదే ఆనందంలో. అంగీకరించారు దేవుళ్ళు.

అయిదున్నర . . ఆరు !

సినిమాకి. రావని ఎటా ? మిత్రు లిద్దరూ అంటూంటే. ఎవరి ఖర్చుమీదో సినిమాకు. చూచిందే నిన్నరాత్రి. తిరిగీ చూడటం. చూస్తున్నంతసేపూ గర్వం. ముందేం జరుగనుందో తన కొక్కడికే తెలుసు. అది గర్వం. విశిష్టత. నిన్న తను చూచినా, యివాళ చూస్తున్నందుకు.

బాగుంటుంది. అసలు సినిమాలే బాగుండుకు. ఆనందం యిచ్చేందుకు.

హాలు వదిలి రోడ్డుమీదికి. హోటలు. భోజనం ముగురూ.

ఇంటికి. వీధి మలుపు వచ్చింది. తను వెళ్తానన్నాడు. 'యేం, ముగ్గురం, అక్కడే—కబుర్లు చెప్పుకుంటూ—నిద్ర—'

'కాదు యింటిదగ్గరే పడుకోవాలి. అసలే రోజులు—వెధవ్వి!' చెప్పాడు యింకా యేవో కారణాలు - తను యింటికి వెళ్లటానికి. ఇల్లు చూడాలని ఎందుకో ఆదుర్దా. బెంగ యింటిమీద.

స్నేహితుల దగ్గర సెలవు. మళ్లీ రేపు పొద్దునే కలుస్తాడు.

పదిన్నర దాటింది. ఇల్లు వచ్చింది. ఇంటి గుమ్మందగ్గిర ఎవరో...

'ఎవరు-?' తాళం చెవికోసరం జేబులో చెయ్యిపెట్టి-

'బావా, సినిమాకు వెళ్లావా యేం?...'

బావమరిది గొంతు. ఏడుపు. ఏమిటి ... ఎందుకు?

'ఏం చెప్పను బావా...'

ఏం మునిగింది? చెప్పడేం? చెప్పలేడేం? ఏదో అనుమానాలు తనకు. 'పురుడు వచ్చింది. ఇవాళ సాయంకాలం పిల్లా, మా చెల్లెలూ యిద్దరూ యీలోకాన్ని వదిలి...'

ఏం వింటున్నాడు తను ?

ఉదయం లగాయితు అనుభవించిన అనవసర ఆనందానికి పరిహారం ?

కాలం గంటలు - పదకొండు.

తలుపుతాళం తీయనేలేదు. ఏదో నిమిషానికలా రైలుబండిలో—యిద్దరూ. ★



పెరటిలో మల్లెతీగ మొగ్గ తొడిగింది. ఆ చిన్న చిన్న, మొగలు పచ్చటి పరికిణీలు కట్టిన చిన్నారి, అందమైన తెల్లటి ముస్తాబయిన పాపాయిల్లాగ వున్నాయి. ఎన్ని మొగ్గలు! తీగ తీగకూ మల్లె మొగ్గలు. హృదయాల్ని కదిపివేసే మల్లె మొగ్గలు. అద్భుతమైన సొగసూ, అంతకన్న అత్యద్భుతమైన పరిమళాల్నిచ్చే, సృష్టిలోకల్లా అత్యంత అద్భుతమైన, మానవమాత్రుడు దేవత్వాన్ని పొందడానికి అవకాశం కల్పించే, గొప్ప సృష్టి మల్లె మొగ్గలు!

మల్లె మొగ్గలు, మనుషుల మనసులు పరిమళాల్లో వికసించినట్లు వికసిస్తాయి. ఆ వికాసమిచ్చే దివ్యమైన అనుభవాన్ని మానవులు ఎప్పటినుంచో, ఎంతో నిండు హృదయాలతో అనుభవించి తమ తమ జన్మలు తరింపజేసుకొంటూనే వున్నారు.

మల్లె పొదుకు ఎదురుగా ఆయింటి పెరటి వైపు వరండాలో మడత కుర్చీలో కూర్చుని ఎంతో ఆప్యాయంతో ఆహ్లాదంతో మల్లె మొగ్గల్ని, అక్కడక్కడా వికసించిన మల్లె పువ్వులనూ చూస్తూ, ఊహాలోకంలోకి వెళ్లిపోతున్నాడు శంకరం.

శంకరానికీ ఆమల్లె మొగ్గలకు అవినాభావ సంబంధం! శంకరం ఆపూరొచ్చి ఆయింటి కొస్తే గానీ ఆ మల్లెలు వికసించవు. ఆతీగలు

మొగలు తొడిగితేగానీ శంకరం ఆవూరు ఆయిల్లు, ఆచోటుకు రాడు. రావడానికి వీలు లేదు. కొన్ని ఏళ్ళుగా ఆలా జరుగుతూ వచ్చింది.

శంకరం యూనివర్శిటీ ఆనర్సు పరీక్షలు పూర్తిచేసి, ఇంటికి వచ్చాడు. ఆ యింట్లో దీనురాలైన తల్లి ఒక్కతే వుంది.

శంకరం అలా ఆమల్లె పందిరికేసి చూస్తూ వుంటే గడచిన రోజులన్నీ జ్ఞాపకం వస్తున్నాయి.

*　　*　　*

ఆ రోజుల్లో అతనికి దిగులూ, బెంగా వుండేవి కావు. ఎంతో ఆనందంగా రోజులు గడిచిపోయేవి.

అత్తయ్యకూతురు పద్మతో ఎంతో సరదాగా ఆడుకొంటూ మాట్లాడుతూ రోజులు క్షణాలుగా వెళ్ళబుచ్చేవాడు.

చిన్నప్పుడు ఈ మల్లెపందిరి దగరే ఆడుకొనేవారు. ఎండా కాలం మల్లెపందిరి ఎక్కి మంచిమంచి మొగలూ, పూలూ తుంపి ఆమెకిచ్చేవాడు. ఆమె వాటిలో కొన్నింటిని అతనిమీదచల్లి, మిగత వాటిని వొడిలో భద్రపరచుకొని పారిపోయేది. అప్పుడతని వొళ్ళంతా నవ్వి పొంగిపోయేది. చాల గొప్ప పని చేశాననుకొనేవాడు. ఆమె వెళ్లిపోయిన తర్వాత రాలిన మొగ్గలన్నీ ఏరి దాచేవాడు. అలా ఎన్నో ఏళ్లు గడచిపోయాయి. వయస్సు ఎక్కువైనా వాళ్ళ స్నేహంలో మార్పేమీ లేదు ఎన్నో వందలసార్లు అతను మల్లెమొగ్గలు త్రుంపి అవన్నీ పద్మకు యిచ్చి ఆమె సంతోషం చూసి ఆనందించాడు

*　　*　　*

శంకరం నాన్నగారు ఒక ప్రైవేట్ కంపెనీ బ్రాంచికి మేనేజరుగా పనిచేస్తూ వుండేవారు. ఆయన చాలా సుఖంగా జీవించాలనే కోరికగలిగిన మనిషి. అనవసరమైన కష్టాలను చాలదూరంలో వుంచేవాడు. సంపాయించి కూడబెట్టడంకన్న, సంపాయించినదానిని బాగా అనుభవించి తరించాలనే రకం మనిషి. ఆయన తనసిద్ధాంతాన్ని అక్షరాలా అమలుజరిపారు. మంచి సుఖమైన కుటుంబజీవితం గడిపారు. ఉద్యోగంకూడా ఎంతో సామర్థ్యంతో నిర్వహించారు. తత్ఫలితంగా కంపెనీ అధికారులు, ఆయనకు త్వరలో ప్రమోషన్ ఇవ్వాలనికూడా నిర్ణయించారు.

ఆయనకు వ్యసనాలు ఎక్కువగానే వున్నాయి. ముఖ్యంగా కాఫీలు, సిగరెట్లు అమితంగా ఉపయోగించేవారు. కొంతమంది స్త్రీలతోకూడా సంబంధముండేది. అయితే ఆయన పెద్దమనిషి. అంతా రహస్యంగా వుంచేసుకొనేవారు.

కొద్దిరోజులలోనే ప్రమోషన్ రావచ్చునుకొంటూ వుండగా ఆయనలో హఠాత్తుగా కేన్సర్ లక్షణాలు పొడసూపినవి. వెంటనే హాస్పిటల్లో చేర్పించారు. పద్మ నాన్న వెంకటరత్నం ఆయన ఆరోగ్యం విషయంలో పూర్తిశ్రద్ధ తీసుకొన్నాడు. రెండు ఆపరేషన్లు జరిగాయి. ఇక బాగుపడలేని స్థితికి అప్పటికే వచ్చేసింది. వైద్యుల కృషి ఫలించలేదు. ఒకరాత్రిపూట, ఆయన శాశ్వతంగా కళ్ళుమూసుకొన్నారు. అర్ధాంగి, ఏకైకపుత్రుడు నిరాధారులై నిలిచిపోయారు.

ఆయన అర్ధాంగి సరస్వతమ్మ మహోదాత్త యిల్లాలనిపించుకొంది. ఆమెభర్తకోసం తన సకలవాంఛలనూ, తనసొంత అభిప్రాయాలనూ, అభిరుచులనూ త్యాగంచేసింది. ఆమెకు భర్తమీద ఎంతప్రేమ ఉందో ఆయనకూ ఆమెఅంటే అంతప్రేమఉంది. అయితే అతని భోగలాలసతకు మరికొందరు స్త్రీలు అవసరమయ్యారు. సరస్వతమ్మ అయినాసరే ఒక్కమాట అనలేదు. ఆయన భవిష్యత్తు కోసం కొంతడబ్బయినా నిలవచేయక పోవడమనేది ఆమె ఉద్దేశాలకి పూర్తిగా వ్యతిరేకం. అయినాసరే ఆమె ఏమీ పైకిచెప్పలేదు. మౌనంగా వున్నంతవరకే ఇద్దరిమధ్యా ఆ పవిత్రమైన సంబంధం నిలుస్తుందని ఆమె భావించింది. ఒక్కమాట, ఒక్క వ్యతిరేక భావప్రదర్శన చాలు, తమ మధ్య అగాధమేర్పడటానికి! భర్త దారుణమైన నిరంకుశ స్వభావం కలవాడని ఆమెకు తెలుసు. ఆయన ఉద్దేశాలతో, చర్యలతో ఏకీభవించి, అడ్డురాకుండా, ఇష్టం లేకపోయినాసరే, లొంగివుండి, తాను పూర్తిగా భర్తను గౌరవిస్తున్నట్లు ప్రవర్తిస్తేతప్ప లేకపోతే భర్త "దయ" దారితప్పుతుందని ఆమెకు తెలుసు. ఆమె తెలివైనది. కానీ దీనురాలు. బాధితులైన వేలాది కుటుంబస్త్రీల ప్రతినిధురాలు ఆమె.

తండ్రి చనిపోయేనాటికి శంకరం ఆనర్సు చదువుతున్నాడు. ఆ కుటుంబానికున్న స్థిరాస్తులు చాలతక్కువ. రెండెకరాల పొలము, ఎకరా మామిడితోట, మంచిఇల్లు వున్నాయి. ఆయన చనిపోయిన తర్వాత ఆరు వేలరూపాయల భీమాడబ్బు. సరస్వతమ్మకు ముట్టజెప్పారు. ఆ డబ్బుతోనే శంకరం చదువు సాగించడానికి వీలయ్యింది.

శంకరం మామయ్య వెంకటరత్నం చిన్నప్పుడు శంకరాన్ని ఎంతో ముద్దుగా చూసుకునేవాడు. తనకు కాబోయే అల్లుడని అతని చదువు సాంగత్యాలపట్ల ఎంతో శ్రద్ధ తీసుకొనేవాడు. అత్తయ్య సరేసరి! తల్లిదండ్రుల గురించి చెప్పనవసరమే లేదు. వారికి ఏకైక పుత్రుడు కాబట్టి తమప్రాణం పోసి అతణ్ణి పెంచి పెద్దజేశారు.

వెంకటరత్నంగారి ఇల్లు, శంకరం ఇల్లు ప్రక్కప్రక్కనే వున్నాయి. ఏ ఇంట్లోనో ఒక ఇంట్లో, లేదా తోటలో, పద్మ, శంకరమూ ఒక్కచోటే కనిపించేవారుగానీ ఎప్పుడూ విడిగా కనిపించేవారుకారు. ఇద్దరూ ఒకే ప్రాణంగా పెరిగారు.

అలాంటి ఒకేప్రాణంలో పగులు ఏర్పడి, ఆ రెండు చీలికలమధ్య ఒక అగాధమేర్పడే పరిస్థితి కలిగింది.

శంకరం నాన్నగారు చనిపోయిన తర్వాత పరిస్థితి తారుమారయిపోయింది. వెంకటరత్నంగారిలో హఠాత్తుగా, అత్యాశ్చర్యకరమైన మార్పువచ్చింది. శంకరం కనిపించగానే ఆయన 'గంభీరత' అనే ముసుగు తొడుక్కుంటున్నాడు. మునుపటి ఆప్యాయత పూర్తిగా పోయింది. ఆ చూపుల్లో భరించలేనంత కర్కశత్వం కనిపించి శంకరం వొణికిపోయాడు.

సరస్వతమ్మకు సర్వమూ తెలుసు. వెంకటరత్నం వైఖరి ఆమెకు ఆశ్చర్యం కలిగించలేదు. ఆ యిల్లు కట్టించేటప్పుడు పెద్ద శ్రేయోభిలాషిగా అతను అన్నిపనులూ తన చేతికి తీసుకొని, ఎంత డబ్బు కాజేసింది ఆమెకు తెలుసు. వెంకటరత్నం కేవలం వ్యాపారస్థుడు వ్యాపారస్థుడి మనస్తత్వం ఎలావుంటుందో ఆమె వూహించగలదు.

వెంకటరత్నం ఆశించినట్లు శంకరం



# మల్లె పువ్వు



నాన్న 'లెక్కలేనంత' డబ్బు మిగిల్చి పోలేదు. బంగారు ఆభరణాలు, పొలాలు, భవనాలు మిగిల్చిపోలేదు. ఆయన చనిపోగానే పల్లెదగ్గరవున్న పొలాన్నీ, ఇంటినీ చనిపోయే ముందే రహస్యంగా, అమ్మివేసినట్లు తెలివిడి అయింది. పైగా ఇంట్లో వుండిన బంగారు ఆభరణాలన్నీ ఎప్పుడో హరించిపోయాయని కూడా తెలిసింది. కొన్ని అప్పులుకూడా మిగిల్చిపోయినట్లు తెలిసి చాల కష్టపడిపోయాడు. ఆలోచించి, ఆలోచించి అగయిపోయాడు. ఆ అగ్గిని లోపల కూడబెట్టుకొన్న తర్వాత శరీరం ఆ నిప్పుకు నివురు గప్పినట్లయింది. ఆ నిప్పు ఎప్పు డేం ముప్పు తెస్తుందోనని తల్లీ కొడుకులు భయపడ్డారు.

ముఖ్యంగా పద్మకూ, తనకూ ఇంకేమీ సంబంధం లేకుండా పోతుందేమోనని శంకరం విచారం. చిన్నప్పటినుంచీ రోజూ సాయంకాలం తోటలోచేరి కబుర్లు చెప్పుకోవడం అలవాటు. కాలేజీలో చేరిం తర్వాతకూడా అలాగే రోజులు గడిపారు.

పద్మ ఇంటర్ వరకు చదివి ఆపేసింది. శంకరం బి. ఎస్. సి. ఆనర్స్ చదవడానికి మద్రాసు వెళ్లాడు.

తండ్రి చనిపోయిన తర్వాత మొదటిసారి వేసవిసెలవుల్లో ఇంటికి వచ్చినప్పటికే పరిస్థితి పూర్తిగా మారిపోయింది. రెండు రోజులైనా పద్మ కనిపించలేదు. ఆ ప్రస్తావన తల్లిదగ్గర తెస్తే, ఆమె ఏమాత్రమూ శ్రద్ధ చూపించకుండా నిర్లిప్తంగా వూరుకొంది. తల్లీ తండ్రీ ఆమెను ఇల్లు కదలకుండా చేసి వుంటారనుకున్నాడు.

మూడోరోజు ఉదయం స్నానం చేసి, టిఫిన్ కాఫీ తీసుకొని పద్మ యింటికి వెళ్ళాడు.

వరండాలో పద్మ కనిపించింది. లోపలికి వెళ్ళిపోబోయి, శంకరం మరీదగ్గరికి వచ్చేసరికి ఆగిపోయింది.

"కనిపించనే మానేశావ్ పద్మా!" అన్నాడు వెళ్ళగానే శంకరం.

"ఎలా కనిపించమంటావు శంకరం!"

ఆ మాటలో తరతరాలనుంచీ 'కన్య' పడిన బాధ వ్యక్తమవుతోంది. ఆ మాటలో మానవజాతి పుట్టినది మొదలు నేటివరకూ గల స్త్రీ చరిత్ర సమస్తం విశదీకరింపబడి వుంది!

శంకరం ఆ మాటతో గిలగిల లాడిపోయాడు. అతనికి ఎవరూ మంచినీళ్ళు ఇవ్వలేదు.

"లోపల మామయ్య వున్నారా" అన్నాడు. 'ఉంటే చెప్పు, వాణ్ణి చంపేస్తానన్న'ట్లుంది, ఆ స్వరం.

"లేరు. అమ్మవుంది" అందామె. ఆ మాటలో అతనికి జవాబు దొరికింది. అత్తయ్య వుండటంవల్ల తామిప్పుడు స్వేచ్ఛగానూ మాట్లాడుకోడానికి వీలు లేదన్న మాట.

"ఈ మార్పంతా ఏమిటో నాకు అర్థం కాకుండా వుంది. ఇంతలో ఎందుకిలా మారిపోయావు పద్మా" అన్నాడు గరగరలాడే గొంతుకతో.

ఆమె రెండు నిమిషాలు మౌనంగా కుడికాలి వేలు నేలరాస్తూ కళ్ళు క్రిందికివాల్చి వూరుకుంది. కనుగుడ్లు, తెల్లటి కనుగుడ్లే కరిగి నీరవుతున్నాయా అన్నట్లు కళ్ళలో నీళ్లు తిరిగాయి.

"నేను మారనేలేదు. నీకు తెలీదా శంకరం! నీకు తెలియనిదేముంది చెప్పు" అంది అతనిగుండె ద్రవింపజేస్తూ:

"అవును. నాకు తెలుసులే పద్మా. నువ్వు సాయంకాలం ఇంటికివస్తే, అంతా మాట్లాడుకొందాం" అని అతను అక్కడినుంచే ఒకసారి 'ఆశ'తో ఆమె ముఖంలోకి చూసి, తృప్తిగా నిట్టూర్చి, వెనుదిరిగాడు. పద్మ అలా చూస్తూ నిల్చుంది.

ఆ సాయంకాలం ఇంటి తోటవేపు వరండాలో మల్లె పందిరి ఎదురుగా, నేటిలాగే పద్మకోసం చూస్తూ కూర్చున్నాడు.

ఆ సాయంకాలం ఆమె ఎలాగోవచ్చింది కటిక చీకటిలో హఠాత్తుగా చంద్రుడుదయించి, ఒక్కసారి చల్లటి వెలుగునింపేసినట్లు, పద్మవచ్చింది. వచ్చి అతని హృదయంలో 'జ్యోతి' కి నూనెవేసి, వత్తి ఎగదోసింది.

ఆమె లోపల సరస్వతమ్మతో మాట్లాడటం విన్నాడు. ఇంకో నిముషంలో వస్తుందని చూస్తున్నాడు. ఆమె వస్తూ, శంకరాన్ని ఎలా పలకరించాలో బోధపడక సరాసరి మల్లెపందిరి దగ్గరకు నడిచింది. శంకరం ఆమె పందిరి దగ్గరకు చేరేవరకు చూస్తూ వూరుకొని, చేరగానే తనూ వెళ్ళాడు. ప్రక్కనే నిల్చుని మొగ్గలు తుంపాడు. తుంపి రెండుచేతులా నింపుకొని ఆమెముందుకు చాచాడు. ఆమె దోసిలి పట్టింది. అందులో పూలన్నీ వుంచి మెత్తగా నవ్వాడు. ఆమె విలవిలలాడుతున్న మనసుతో ముఖం ప్రక్కకు త్రిప్పుకొంది.

"మీ నాన్నకు కలిగిన దుర్బుద్ధిని నువ్వూ ప్రోత్సహిస్తున్నావా పద్మా" అన్నాడు.

"నీకు తెలీదూ. నా ఉద్దేశం!" అదీ ఆమె జవాబు. ఆ మాటలో ఎంత గొప్ప అర్థముంది?! శంకరం మాట్లాడలేదు పద్మ తన దోసిటిలో పువ్వులన్నిటినీ ఒకేచేతికి మార్చుకొని, ఒక మొగ్గ తీసి, శంకరం జేబులో పడేలా వేసి వెళ్లిపోబోయింది.

ఆ మొగ్గ అతని గుండెదగ్గరగా పడింది. అతనిమనసుకు ఎంతో ఆహ్లాదం కలిగింది.

"మనం ఎప్పుడూ విడిపోం. నీమనసు మంచిగా వుంటే చాలు" అని గట్టిగా అన్నాడు. ఆమె వింటూ అలా వెళ్లిపోయింది.

* * *

మరుసటిఏడు వేసవిలో పరిస్థితి ఇంకా మారిపోయింది. పద్మను చాలసార్లు చూశాడు. మాట్లాడే అవకాశం కలగలేదు. వెంకటరత్నం ఎప్పుడూ వరండాలో నేకుర్చీ వేసుకొని కూర్చుని తల వార్తాపత్రికలో దూర్చి, కళ్లతో ప్రక్కగా, ఆ వీధిలో వెళ్లే ఆడపిల్లల్ని చూస్తూవుంటాడు. తను అలా వెళ్తే, ఉరిమి చూసి, తలదించుకొంటు

న్నాడు.

ప్రతిరోజూ మల్లెపువ్వులు కోసి పద్మ చెల్లెలుకు ఇచ్చేవాడు. ఆ పువ్వులు పద్మ జడలో అలంకరింపబడి, ఆ ముఖం వెలుగుతుందనే 'భావన'తోనే, అతనా వేసవి సెలవులు గడిపేశాడు. ధైర్యంచేసి పద్మ యింటికివెళ్లి మామయ్యచేత అవమానింపబడితే, ఉన్న ఆశాకిరణం కూడా అస్తమిస్తుందేమోనని వూరుకొన్నాడు.

"ఈ దౌర్భాగ్యుడు ఆనర్స్ కూడా పూర్తి చేస్తాడని నాకు నమ్మకం లేదు. మూర్ఖతలో ఇతను తండ్రికి ఏ మాత్రమూ తీసిపోడు" అన్నాడట వెంకటరత్నం కూతురుతో.

పద్మమనసు చెప్పింది.—

"ఈ పరిస్థితి తొలగుతుంది. శంకరం తప్పకుండా నావాడే నేను శంకరం భార్యగానే పుట్టా. అది జరిగి తీరుతుంది" అని!

శంకరం విశ్వాసమూ అదే!

'పద్మలేని శంకరం' అనే మనిషి లేనే లేడు. శంకరంలేని పద్మకూడా లేనే లేదు. పుట్టుకతోటే ఇద్దరూ భార్యాభర్తలు. ఎవరూ కొత్తముద్ర వేయనక్కరలేదు." అనుకొనేవాడు.

* * *

చల్లనిగాలి వీచింది. అతని మనసు ఒకసారి ఆనందంగానూ, ఒకసారి దిగులుగానూ వుంది. పరీక్షలయిపోయాయి. యూనివర్సిటీ ఫస్టొచ్చి, స్కాలర్‌షిప్ వచ్చి, రిసెర్చి చేయాలనుకొంటూన్నాడు. తప్పకుండా వస్తుందనే నమ్మకం. ఆ నమ్మకం ఆనందం కలిగిస్తోంది. పద్మను చూడకుండా ఎలా వుండటం? పద్మ మాటలు వినిపించనిచోట, పద్మ నీడలేనిచోట ఎలా వుండటమనే తపన అధికమైంది. వరసగా నాలుగురోజులు మల్లెలుకోసి వుంచాడు. పద్మ చెల్లెలయినా కనిపించలేదు.

రెండేళ్ళ క్రితం పద్మ తన జేబులో విసిరిన మల్లెపువ్వు వాడి ముకుళించుకుపోయింది దాన్నతడు చిన్నరంగుకవరులో భద్రపరచుకొన్నాడు. ఆ కవరు మాశాడం లేచాలు— అది ఆ నాటి పరిమళాల్ని, వికాసాన్ని తీసుకొని వచ్చి, ఆనందపరవశుణ్ణిచేసి ఆత్మవిశ్వాసం కలగజేసుంది. ఆ విశ్వాసంతో మళ్ళీ "పద్మ హృదయం ఇక్కడే వుంది. ఇంకెవరూ తీసుకుపోలేరు," అని ఆ కవరును కళ్ళకద్దుకొంటాడు.

"ఈ రోజు పద్మ కనిపించకపోతే బ్రతకలేననుకొన్నాడు పద్మ మనసు కూడా ఇలాగే బాధపడుతూ వుండదూ! రెండు స్పందించే హృదయాలకు మధ్య ఒకే గీత! ఒకే గోడ! ఆ గోడను ఛేదించడం సాధ్యం కాకుండా వుంది. ఆ గోడను ఛేదించే ప్రేలుడు సామాను వెంకటరత్నం దగ్గర వుంది. అతను అనుకొంటే, మాటనొక్క, ఆ గోడను ఎత్తేసి, రెండు హృదయాలను సమ్మిళితం చేసి అమృతం పుట్టించగలడు. కానీ మంటలు పుట్టించడమే అతని లక్ష్యం.

ఆలోచిస్తున్న శంకరానికి పరిచితమైన 'నడక' వినిపించింది! ఆ నడకలో లయ ఎవరిదో అతనికి తెలుసును. పద్మ వస్తోంది.

అతను వెంటనే లేచి మల్లెపందిరి దగ్గరకు వెళ్లాడు. ఒక్కొక్క మల్లెమొగ్గనే తుంపుతున్నాడు. పద్మ వచ్చి ప్రక్కనే నిల్చుంది. పది మొగలు ఆమె చేతికి అందిచ్చాడు. ఆ మొగ్గలు ఆమె చేతిలో కొత్త వికాసం పొందాయి.

అతనామె గడ్డం పట్టుకొని అన్నాడు. "చెప్పు పద్మా! ఏన్నాళ్ళిట్లా! మన మధ్య ఈ ఉక్కు తెరలేమిటి? మన వేడి నిట్టూర్పులతో ఈ ఉక్కుతెర కరిగిపోయే వీలేదూ! మామయ్యను ఎందుకింత ఖాతరు చేయాలి. ఆయనెవరు? ఇంక నా చేత కాదు. ఇక నిన్ను దూరంగా చూడలేను." అంటూ ఆమెను దగ్గరకు తీసుకోబోయాడు.

ఆమె విశ్వాసంతో కూడిన చిరునవ్వు నవ్వింది. శరీరం వేడెక్కింది. వేళ్లలో రక్తం చిమ్మింది. చేతిలో మొగలు వికసించాయి!

"ఎప్పుడూ వేరుకాము. శంకరం! ఇంకా సమయంరాలేదు. అంతే," అందామె.

అతనామెను దగ్గరకు తీసుకొని నుదుటిమీద ముద్దు పెట్టుకొన్నాడు. ఆమె చేతిలో పూలు అతని భుజాలమీద పోసింది!

* * *

వెంకటరత్నం ఎప్పుడూ ఏదో పనిలో నిమగ్నుడై వుంటాడు. అతను చేసే వ్యాపారం 'ఫలానా' అని చెప్పడానికి వీలులేదు. ఏ వ్యాపారం ఎప్పుడు లాభిస్తుందనిపిస్తే, అప్పుడు ఆ వ్యాపారం చేస్తూ, గడిస్తూ వుంటాడు. తన మేధాశక్తిమీద, ఊహాబలం మీద అతనికి విపరీతమైన నమ్మకం. ఆ నమ్మకంతోనే అతడు ఏ వ్యాపారంలోనైనా అమిత సాహసంతో ప్రవేశిస్తూ వుంటాడు. అతని ప్రయత్నాలు, నూటికి తొంభైపాళ్లు విజయవంతమవుతూ వుంటాయి. అతని వ్యూహాలు, అంచనాలు తల్లక్రిందులవడమనేది ఎప్పుడోగానీ జరగదు. అతను ఒక వ్యాపారం చేయదలచుకొంటే, దానికి సంబంధించిన అన్ని విషయాలూ ఆలోచిస్తాడు.

ఉదాహరణకు అతనికి ఆవకాయ వ్యాపారం చేయాలనే తలంపు కలిగిందనుకోందాం. అప్పుడు- "మామిడికాయల కాపు ఎలా వుంది? వర్షాలు ఎలావున్నాయి. వినియోగదారుల కొనుగోలుశక్తి ఎలావుంది? బియ్యం మొదలైనవాటి ధరలు ఎలావున్నాయి. వేరుసెనగపంట ఎలావుంది. ప్రపంచ పరిస్థితులు మనుష్యులను ఏ విధమైన మనస్తత్వంలో వుంచుతున్నాయి..." ఇవన్నీ, కూలంకషంగా కూపీ తీసి తెలుసుకొని, ఆమీదట, ఆ యేడు ఆ వ్యాపారం లాభకరమైనదనిపిస్తే, తక్షణం ప్రారంభించి, అతి తక్కువ వ్యవధిలో ఆ వ్యాపారంచేసి, పరువుపూర్తిగ వదిలించుకొని, రొక్కం కళ్లచూసుకొని, మళ్ళీ మరో వ్యాపారంలోకి వెళ్ళిపోతాడు.

"ఈ ఏడు మంచివర్షాలు కురిశాయి. చెరువులు, నదులలో నీళ్ళున్నాయి. పుష్కలంగా చేపలుంటాయి. అంచేత దేశంలో చింతపండు అవసరం అధికమవుతుంది. గడిచిన ఏడాదివరకు కరువుగావుండ వేలకొలదీ చింతచెట్లు వంటకలపకో, బొగ్గులకో కొట్టివేశారు. అందుచేత ఈసారి చింతపండు తక్కువగా వుంటుంది. ఈ సారి ముందుగానె పూతమీదనే చెట్లుకొనేస్తే, లాభం దండయవచ్చుననే ఆలోచన కలిగింది

(47-వ పేజీ చూడండి)




[ఉద్యోగపర్వము నుండి]

తే. వినుము గాండీవ మను నొకవిల్లు దాటి, పొడవు గలిగియుఁ గృష్ణుండు పూని తోడు
గూడుకొని వచ్చుటయు నెరుంగుదుము వీని, కెల్ల శంకించి భూమి పాలీము గాని.

క. పవనజుగదయును నీగాం,డివమును నెట వోయె నంగడికిఁ బాంచాలిం
దివిచికొని వచ్చునెడఁ బరి, భవ మెఱుఁగవె బీర మేల పలుకుదు తోఁడ్తోన్.

చ. వలలుఁ డనన్ విరాటుకడ వంటలవాఁ డయి భీముఁడున్ బృహ
న్నల యన నాఁడు పేడి వయి నాన యొకింతయు లేక నీవు న
గ్గల మగుదైన్య మొంది కడుఁ గాఱియ వొందితి రుర్వియేలునా
నలఁ బడి సవ్యసాచి యిది శౌర్యమొ బాహుబలంబొ చెప్పుమా.

ఉ. మాయలు నింద్రజాలములు మాధవుఁ డిందును గొన్ని వన్నినన్
వాయపురజ్జు లెప్పుడు నవారణ నీ వెటు లాడితేనియున్
వేయును నేల పార్థులును విష్ణులు నేఁబదివేలు వచ్చినం
జేయుదు మేము గయ్యా మొకచీరియు సంపదఁ బంచి యిత్తుమే.

వ. అనిన భీమార్జుననకులసహదేవు లొండొరులం జూచుచు నాననంబులు చలింప మొగంబులు జేవుఱింపఁ గ్రోధాయత్త చిత్తులై యున్నం గనుంగొని నవ్వుచు నారాయణుం డులూకున కిట్లనియె నీవు వోయి సుయోధనుతో నెల్లవారును విన నిట్లనుము.

తే. బవర మెల్లియ బిరుదవై బరవసంబు, గలిగి చావుము చావక తొలఁగరాదు
కృష్ణసారథికం బగు జిష్ణురథము, దొడరి నీ వెందుఁ జొచ్చినఁ, దోన చొచ్చు.

క. రిత్తలు రజ్జెదువాఁడే, మత్తగజాయుతబలుండు మారుతి యని ను
ద్వృత్తుఁ డగుదుస్ససేనుని, నెత్తు రురము వ్రచ్చి త్రావు నీవుం జూడన్.

వ. అని యిట్లు హరి పలికినయనంతరంబ యర్జునుం డులూకున కిట్లనియె.

క. వారు గలరు వీరు గలరు, పోరికి నని చెప్పె దీవు పొంగారుచు మీ
వారిని మిమ్మును రేపు గ, దా రూ పేర్పడఁగఁ జూచెదము గితవసుతా.

చ. తన భుజశక్తి లేక యొరుదర్పమ యూఁది పరాక్రమింప వ
చ్చిన నది సెల్లునే కులవిశిష్టుని సువ్రతు వృద్ధు నార్యు భీ
ష్ముని నెనకొల్పి సేనలకు ముఖ్యుఁడ వీ వని యుబ్బఁ జేసి యా
సునఁ దల పెట్టి చంపికొనఁ జూచె సుయోధనుఁ డింత నే మగున్.

చ. తనతలఁ బెట్టు భీష్మభుజదర్పము లోకముకంటె నెక్కుడీ
తని నొక భంగి నండ గొని తప్పదు చావున కంచు నున్నవాఁ
డనిఁ, దొలుముద్ద గొందుము రయంబున నాతని వెండి ద్రోణులం
దునుముదు మప్డు సూతసుతుఁ దోలుదు మంతట నాన మాలెదున్.

క. అనుజుల తనుజుల చావులు, గనుఁగొని మఱి తాను భీముగదచే నిలఁ గూ
లినయప్పుడైన దుర్యో,ధనుఁడు మదిం దలఁచుఁ గాక తన దుష్కృతముల్.

వ. అది యట్లుండె నీవు వేగ పోయి రేపకడయ మీరాజుం గలనికి నడపింపు మనియె నప్పుడు ధర్మనందను డులూకు
నకుం దాంబూలాభరణంబు లిచ్చి వీడుకొలిపి ధృష్టద్యుమ్ను నవలోకించి యెల్లి గయ్యం బని మనసైన్యంబుల కెఱిం
గించి సర్వసన్నాహంబులు సమకట్టుమని పనిచి కొలువువిరిసి చనియె ధృష్టద్యుమ్నుండును ద్రోణులం దొడరంబడం
సితి నని యుబ్బుచు వెడలి భీష్ముం దలపడఁ గంటినని పొంగుశిఖండి దోడుగా రాజశాసనంబు నిర్వర్తించె నిట
యులూకుండు వచ్చి దుర్యోధనుం బేరోలగంబునం గని యతనికిఁ గృష్ణార్జునులపలుకు లున్న రూపు విన్నవించిన
నతండు కర్ణుదెసఁ గనుంగొని సమస్తసేనలకు రేపు బవరంబని చెప్పి పుచ్చుము సకలసాధనంబులు నాయితంబులు
సేయు మని పనిచిన నతండు నట్ల చేసె ని ట్లుభయకటకంబులు రణంబునకు నుత్సహించి విజృంభించి యుల్లసిల్లె
ననిన ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె.

క. వినుము హరితోడు గల యర్జును గెలువ నదీసుతునకుఁ జొప్పడునే యా
పని నిలుపు ములూకుని చెప్పినమాటల కేమి యనిరి పిదపఁ గొలువునన్.

వ. అనిన విని యంబికానందనునకు సూతనందనుం డిట్లనియె.

ఆ. అయ్యులూకు పలుకు లన్నియు విని భవ, త్తనయుతోడ నిట్టు లనియె భీష్ముఁ
డేను గలుగ వెఱవ నేటికి సేనలఁ, గాతు నీవు మెచ్చఁ గౌరవేంద్ర.

క. నడిపింపఁగఁ, బొడిపింపఁగ, నెడమడు వై కలఁగినప్డు దేర్పఁబుపఁగ నేఁ
గడు నేర్తుఁ బేర్చు నాదగు, కడిమియ నీసైన్యమునకు గాసెన గాదే.

క. అనినం గురురా జిట్లను, వినుము పితామహ మహోగ్రవిత్తము లనఁగాఁ
జను నీవును నాచార్యుండును గలుగఁగ నాకు నెన్నఁడును వెఱ పేలా.

తే. ఏను గంధర్వకిన్నరదానవాది దివ్యభూతంబులకును భీతిల్ల ననినఁ
బాండుపుత్రులమాత్రకుభయము నాకు నెక్కడిది ప్రేల్మిడినవారి యుక్కుమడఁతు.

## భీష్ముండు గౌరవసేనలో నతిరథమహారథాదుల నిరూపణంబు సేయుట

వ. అని పలికి మఱియు నిట్లనియె.

క. నీయందు వారియందుం, జేయం గల మానుసుల విశేషంబులఁ జి
త్తాయత్తంబుగఁ జెప్పుము, నీయెఱుఁగని యవియు లేవు నిక్కపుఁదరముల్.

క. అనవుడు నీ విట్లడిగిన, విని యూరక యుండఁ దగదు విను మేర్పడ నె
ల్లను నున్నరూపు సెప్పెద, మనవారల వారివారిమానము లధిపా.

వ. అని గాంగేయుం డిట్లనియె.

సీ. నీ వతిరథుఁడవు నీతమ్ము లందఱు సమరథశ్రేష్ఠులు సమరమునకుఁ
బరుసనివీరులు పాంచాల సేన నిర్జింతురు నను నేన చెప్పికొనఁగ
నేర నాథ యెడ్డెఱ మీ రెఱుంగుదురు భోజాగ్రణి కృతవర్మ యతిరథుండు
దృఢ వేధి యాతండు దీర్చు నెంతటిపని యైనఁ గైకొని శల్యుఁ డతిరథుండు

ఆ. వాసుదేవుతోడె యీసువాఁ డల్లుర, విడిచె నిన్నుఁ గూడి విక్రమమునఁ
దేరుకొనఁగఁ జాలు భూరిశ్రవుం డతి, రథుల మొదలి యనికి రక్కసుండు.

క. విను సైంధవుఁడు మహారథుఁ, డనిఁ బోక పెనంగు నతని నాద్రౌపదికై
పెను పఱఁ బఱచిరి కుంతీ, తనయులు వారల కెదుర్పఁ దపముం జేసెన్

వ. కాంభోజ రాజగు సుదక్షిణుండు సమరథుం డితనిపాల రథబృందంబులు మేలు గలుగుఁ బాండవబలంబులం గలంచు
మాహిష్మతీపతి యగు నీలుం డతిరథుం డితనికి సహదేవునకుఁ దెగనిపగయై యుండు దానంజేసి యాలంబున నోల
మానగొనం డవంతిదేశాధీశు లగు విందానువిందు లర్ధరథులు పరస్పర స్నేహంబున సాహసికులై యొకళ్లొకళ్లం
బెట్టి పోవక పోరుదురు త్రిగర్తపతులు దోడంబుట్టువు లేవురును మహారథులు గోగ్రహణంబునం బడిన బన్నంబుఁ
బాపికొనం గడంగుదురు వీరికి భుజబలం బగ్గలం బై యుండు.

క. సమరథుఁడు బిరుదు లక్షణ, కుమారకుం డేచి మొనలఁ గోత్తల సేయున్
మిము నెల్ల మిగులుభుజగర్వము మదముం గలఁడు కొనఁ డరాతుల నధిపా.

వ. బృహద్బలుండు సమరథుండు గోసలబలంబులతోడం గడంగి చిచ్చునుం గరువలియునుం గొని తాఁకు దండధా
రుఁడు సమరథుండు సేనపటుపుగలండు బెట్టిదంబు గాఁ గయ్యంబు సేయు.

తే. అతిరథోత్తముఁ డీవ్రేటియందు మేటి, కృపుఁడు తనపెంపువాటించి గెలుచుఁ జచ్చుఁ
గాని నాలుగు దెఱఁగుల సేనలకును, దివియఁ డించుకయును నరదేవముఖ్య.

క. శకుని విను సమరథుఁడు పాండుకుమారులతోడ నెప్పుడుం బగ గొని వా
రికిఁ గీడ రోయు భృత్యులు, ప్రకటబలులు గలరు నేర్పు బవరంబునకున్.

మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁ డశ్వత్థామ గాండీవితోఁ
బురుడింపం దగువాఁడు వీని కెన యీభూలోకసంచారు లె
వ్వరు లే రీతఁడు బ్రాహ్మణుం డనని భావం బూనఁగా నోర్వమిం
దర మూహింపఁగ లేద కాని జముచందం బయ్యెడుం బోరులన్.

సీ. అతిరథోత్తముఁడు ద్రోణాచార్యుఁ డందఱియిందఱి విలుకాండ్ర కెల్ల గురుఁడు
హితుఁడు నీకెంతయు నేర్చిన మొన లితం డడరినఁ జమరినయట్ల మ్రందు
వృద్ధని యితని భావింప రా దనిలోన నంగవిస్ఫురణంబుభంగి సూడ
నర్జునుపైఁ గూర్మి నతని నో నేయఁడు సచరాచరం బైనజగము లెల్ల

తే. నొక్కమొగమై కడంగినఁ జిక్కువఱుచు, దివ్యబాణజాలంబుల దీటుకొలిపి
ప్రాణములు డాఁపఁ డీతనిపాటిదొరలఁ గానమే రాజ్యములయందుఁ గౌరవేంద్ర.

క. అతిరథుఁడు బాహ్లికుఁడు విను, మతులితబలుఁ డితనియట్ల యాత్మజుఁడును వి
శ్రుతశక్తి సోమదత్తుం, డితనికి నితనికి సమర మొన పెండిలికిన్.

క. అసురవరుఁ డీహలాయుధుఁ, డసమానబలుండు సమరథాగ్రణి విను పాం
డుసుతులయెడ రోషముఁ గలఁ, డసంఖ్యమాయాబలమున నరులఁ గలంచున్.

తే. వినుము ప్రాగ్జ్యోతిషాధీశుఁ డనుపమాన, శక్తి యీభగదత్తుండు సమరథుండు
గజము నెక్కి తానేనికకయ్యమైన, నేర్చునై రావణమీఁది యింద్రుఁ బోలి.

## భీష్ముఁడు గర్ణుని నర్ధరథుఁ డని చెప్పుట

వ. గాంధారరాజులగు వృషకుండును నచలుండును సమరథులు మానిసితనంబును మానుసులుం గలవారు వీరిసమరో
పాయం బజేయం బై యుండు.

సీ. నీకుఁ బ్రెగ్గడయును నెయ్యంపుఁ జెలియునై కయ్యంబునకు నెప్డుఁ గాలుద్రవ్వఁ
బాండుపుత్త్రులతోడి పగకు నిన్ననకొల్పుఁ గొలువున రజ్జులు వలుకు నట్టి
రాధాసుతుం డర్ధరథుఁడు గుండలములుఁ గవచంబుఁ బోవుట కారణముగ
బీఱువాఱినవాఁడు వీఁడేడి కృపఁ బెద్ద పరశురాముండు శాపమున వీని

తే. యస్త్రవీర్యంబుఁ జెఱిచె నట్లగుట వీఁడు, పార్థు మార్కొని మానంబుఁ బ్రాణములును
దనకు సొమ్ముగఁ దక్కించుకొనఁగ లేమి, యెల్లవారికి నెంతయుఁ దెల్ల మధిప.

క. అనవుఁడు గురుఁ డిట్లనుఁ గర్ణునిచందము మున్న గడఁగు రోయఁడు పార్థ
విను మేమఱి యుండుం గావున నీతం డర్ధరథుఁ డవుం దలపోయన్.

వ. అనిన విని రాధేయుండు క్రోధతామ్రాక్షుం డగుచు గాంగేయున కిట్లనియె.

క. ఒంటమిని లేని యొంటర, మింటరములు పల్కు టుచితమే యర్ధరథుం
డంటి నను నేమితక్కువ, గంటి చెపుము దీన నీవు గన్నది గలదే.

తే. నొవ్వఁ బలుకుదు సభలోనఁ జివ్వకొల్ల, కేను గురుపతిఁ జూచి సహించి పోదు
సురనదీపుత్త్ర విను నాకుఁ జూడ నర్ధ, రథుఁడ వగు దీవు లావు బీరంబు నరయ.

వ. అని పలికి కొలువుఁ గలయం గనుంగొని.

చ. హితుఁ డని నమ్మఁగాఁ దగునె యీతనిఁ గార్యపుమాట లిట్టివే
పతిదెస కూర్మి వాపుటకుఁ బట్టుగ నెక్కువ తక్కువంచు ను
న్నతు లగు మేదినీశులకు నానగఁ బల్కుట గాక యిట్టివా
రితవులు తండ్రికిన్ సుతుల కే మన నేర్తుము పెద్దరాజులన్.

వ. అని దుర్యోధనుం జూచి యిట్లనియె.

ఉ. కర్ణము దప్పె నీయెదురఁ గష్టపుమాటల కేల యోర్తు రీ
దుర్జనుఁడైన శాంతనవుదోర్బల మేటిది యీతఁ డొక్కఁడున్
వర్జితుఁ డైన నేమి నృపవర్గము గుందుట యెంతఁ బాయునే
యర్జునపక్షపాతి యితఁ డాలము మేకొని చేయఁడుం జుమీ.

తే. చాలఁ గాలంబు వోవక చతురు లైన, వృద్ధజనముల బుద్ధులు విండ్రు గాక
ముదియ మతి దప్పి నోరికి నొదవినట్లు, పలుకు వెడఁగుల మాటలు పాటియగునె.

క. సేన మొగ మీతఁడైనం, బూని మహీశ్వరులు నీకుఁ బొడిచెద రే దు
ర్మాని యని కాదె యీతని,తో నడచుట కొల్లనైతి దురమున కధిపా.

వ. అనిన భీష్ముండు సూతసూనున కిట్లనియె.

చ. ముదుకఁడ నైన నాదుబలముం జలమున్ వివిధాస్త్రశస్త్రసం
పదయును బోయి నీగురుఁడు భార్గవుచే విను మాజిభూమి నా
కెదిరినవారు పెక్కుఁడల నే మయిరో యెఱుఁగున్ జగంబు నా
ముదిమియు నీకుమారుతనమున్ వరుసన్ విజయుం డెఱింగెడున్.

క. అనుమానింపక సభలో, నను నేఁ జెప్పికొన వలసె నాకిమ్మెయి దు
ర్జనితుఁడ వగు నీయెడ ని, సున నా కిటు వలుకవలసె సూతతనూజా.

తే. శౌర్యమును ఖడ్గమును నింత గలుగునీవు,గలుగఁ జేటువాటిల్లె నిక్కౌరవులకు
దీని మముబోఁటు లెల్లను దీర్ప నెట్లు, సాలెదము మంచిబంటవు సక్కనగుము.

చ. నెప మిడి యోహటించి యిటు నీవు దొలంగినఁ బోవ వచ్చు నే
కుపితమనస్కుఁడై నరుఁడు గూల్పఁ గ్రమంబున దొడ్డ లెల్లఁ జ
న్నపిదప నెట్లుఁ జొచ్చెదు రణంబున నప్పుడు సావకున్నదై
న్యపుఁబరివారముం బతియు నైన నెఱింగెద రెల్లచందముల్.

వ. అని పలికి దుర్యోధను నుపలక్షించి కర్ణుతో వెండియు.

ఆ. సూతపుత్ర యితఁడు నాతలఁ బెద్దమో, పెత్తి నమ్మియున్న యట్టిచోటఁ
గ్రందు సేయ నాకుఁ గా దని సైరించి, యున్న బ్రదికి తింక నూరకుండు.

వ. అని యాడి మొగంబు గంటు వెట్టికొనియున్న సురనదీసూనుదిక్కు మొగంబై సుయోధనుండు నీకుం గోపింప నగునె నన్నును గార్యభారంబునుం జూచి నా బ్రదుకునకై సర్వంబును సహింపవలయు నని తేర్చి యంగరాజుం గనుంగొని మీ రిద్దఱు నొక్కటి యై భరంపడి యిప్పని సక్కంజేసి కాక మీలోన నిట్టి యెరవు మాట లేల యని యొదివి పలికి తదనంతరంబ పాండవపక్షంబువారల తారతమ్యంబులు వినువాఁ డై యమ్మాట పుట్టించిన నతనికి భీష్ముం డి ట్లనియె.

తే. పాండుపుత్రుల నద్దెస దండిమగలఁ గలనిజం బేను జెప్పినఁ గర్ణుమనసు
నొచ్చు నీచిత్త మె ట్లగునో యెఱుంగ, నాకు నిది యేమి పని రిత్త నడుమనుండి.

వ, అనిన మఱియు దుర్యోధనుండు దఱిమి యడుగుటయు ని ట్లనియె.

## భీష్ముండు పాండవవీరులం దతిరథమహారథాదుల నిరూపించి చెప్పుట

తే. అతిరథుండు యుధిష్ఠిరుం డగ్నికల్పుఁ, డాహవంబున నప్రతిహతుఁడు భీముఁ
డతిరథశ్రేష్ఠుఁ డతనిమహాబలంబ, మానుషము విక్రమం బసమాన మధిప.

# ఆంధ్రసచిత్ర బాలల

### ★ విజ్ఞప్తి ★

పరీక్షలు అయిపోయి ఫలితాలు తెలిశాయి. కొత్త తరగతులు, కొత్త పాఠ్య పుస్తకాలు, కొత్త ఉపాధ్యాయులు, కొందరికి కొత్త పాఠశాలలు—అంతా కొత్త వాతావరణం; చాలా సంతోష ప్రదమయిన వాతావరణం. ఈ కొత్త పరిస్థితులలో మీరు పొందే సుఖానుభూతిలో ఆంధ్ర సచిత్ర వారపత్రిక కూడా భాగస్వామి కావాలని కుతూహలపడుతూ ఒక శుభ వార్త అందజేస్తున్నది. 1958 జూలై 1వ తేదీనుంచీ బాలల సంఘం ఒకటి స్థాపించబోతున్నది. జులై 1వ తేదీ నాటికి 15 సంవత్సరాల వయస్సు నిండని, ఐదేళ్ల వయస్సుకు తక్కువగాని ప్రతి తెలుగుబాలుడూ, బాలికా సభ్యత్వం పొందవచ్చు. సభ్యత్వానికి రుసుమేమీ చెల్లించవలసిన పనిలేదు. తెలుగు బాల బాలికలందరూ వెంటనే సభ్యులుగాచేరి అప్పుడప్పుడు నిర్వహించే చిన్న చిన్న పోటీలలో పాల్గొని సంఘ ఆశయాలను జయప్రదం చేయడానికి సహాయపడతారని ఆశిస్తున్నాము; ఆయా బాల బాలికల తలిదండ్రులు, సంరక్షకులు, పాఠశాలల ఉపాధ్యాయులు ఈ కృషిలో సహకరిస్తారని విశ్వసిస్తున్నాము.

**గమనిక**

పదకొండు మొదలు 15 సంవత్సరాలవరకూ వయస్సుగలవారిని "A"వర్గంగానూ, ఆరు మొదలు 10 సంవత్సరాల వయస్సువరకూ గలవారిని "B" వర్గంగానూ విభజించడం జరుగుతుంది.

### ★ గమనించవలసిన ముఖ్య విషయాలు ★

సభ్యులుగా చేరదలచిన బాలబాలికలు చేయవలసిందొకటే. దీనితోపాటు ఒక సభ్యత్వపు దరఖాస్తును ముద్రిస్తున్నాము. అందులోని ఖాళీ స్థలాలను మీ వివరాలతో జాగ్రతగా నింపి (కొట్టివేతలు, తుడుపులు వుండకూడదు) ఆ అచ్చు దరఖాస్తును కత్తిరించి కవరులో

సంపాదకుడు,
ఆంధ్ర పత్రిక సచిత్ర వార పత్రిక,
తంబుచెట్టివీధి, మద్రాసు—1.

అనే చిరునామాకు పంపాలి. కవరుమీద వెనుకవైపు "సచిత్రవార పత్రిక బాలల సంఘం" అని స్పష్టంగ వ్రాయాలి.

చేతితో వ్రాసిపంపే సభ్యత్వపు దరఖాస్తును స్వీకరించము.

ఒక్కొక్క దరఖాస్తుమీదా ఒక్క సభ్యు లేదా, సభ్యురాలిపేరు మాత్రమే వుండాలి. కుటుంబంలోని నల్గురు బాలబాలికలు సభ్యులుగా చే దలిచినా, విడివిడిగా నాల్గుదరఖాస్తులువాడాలన్న మాట. సభ్యత్వపు దరఖాస్తును సచిత్ర వార పత్రికలో సాధ మైనంతవరకు వారం వారం ప్రచురిస్తుంటాము.

పూర్తిచేసిన దరఖాస్తుతోపాటు ఒక్కొ సభ్యుడూ (సభ్యురాలు) 8 నయాపైసల తపా బిళ్ల పంపితే, సభ్యులుగా చేర్చుకున్నట్లు ఒకా కరి విడివిడిగా ఒక్కొక్క సభ్యత్వపు కార్డును పంపుతా ఆ కార్డుమీద సభ్యత్వక్రమాన్ని సూచించే సంఖ్య వుంటుంది. ముందు ముందు సభ్యులు సంఘంగాని జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలోన ఆ సంఖ్యను ఉదహరిస్తూండడం జరుగుతుంది.

పదిహేనేళ్ళ వయస్సు పూర్తి కాగానే, తేదీతో బాలలసంఘంలో సభ్యత్వం దానంతట రద్దయిపోతుంది.

(1) సభ్యులుగాచేరే బాలబాలికలను ఆరుమొ పదేళ్ళవయస్సువరకూ ఒక వర్గంగానూ, కొండు మొదలు పదిహేనేళ్ల వయస్సువరక మరొకవర్గంగానూ విభజించి ఉభయవర్గాలక విడివిడిగా అప్పుడప్పుడు రెండురకాల పో నిర్వహించి ప్రథమ శ్రేణిలో నెగ్గేవారికి మా తోచిన బహుమతుల నివ్వడం. (ఈవిషయం

# శ్రీవారపత్రిక సంఘం

పోటీ నిర్వాహకర్తలదే తుది నిర్ణయం.)

(2) సభ్యులలో వారి వయస్సుకు తగినట్లుగా రచనా శక్తినీ, పఠనాసక్తినీ, కళాభిమానాన్నీ యథాశక్తి పెంపొందజేయడం.

(3) చిత్రలేఖనం, నృత్యం, అభినయం, గాత్రం వీణ, వయొలిన్, మొదలైన లలితకళలలో ప్రత్యేక అభిరుచీ, ప్రవేశం కనబరిచే బాలబాలికలను బహుమతుల ద్వారానూ, తదితర విధంగానూ ప్రోత్సహించడం.

(4) ఏ ప్రాంతంలో నివసిస్తున్న వారైనప్పటికీ తెలుగు బాల బాలికలందరిమధ్యా స్నేహ సమైక్య భావాలను పెంపొందింపజేయడం.

(5) ఉన్నతపాఠశాలలలో చదివే విద్యార్థులకు ఉచిత విద్యార్థివేతనాలు బహూకరించడం. దీనికి సంబంధించిన వివరాలను ఉత్తరోత్తరా ప్రకటిస్తాము.

---

ఆంధ్రసచిత్రవారపత్రిక

బాలలసంఘం

GROUP
**A** లేక **B**

[సభ్యత్వ దరఖాస్తు]

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) ...

పుట్టినతేదీ, నెల, సంవత్సరం: జులై 1 నాటికి వయస్సు ఏండ్లు: నెలలు:

తండ్రి, లేక, సంరక్షకుని పూర్తిపేరు: ...

ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు ...

చదువుతున్న తరగతి, లేక, ఫారము: ...

పాఠశాల. పేరు: ...

ప్రధానోపాధ్యాయునిపేరు (తెలిస్తే): ...

అయ్యా:

ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకొనప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు.

ఇట్లు

తేదీ: -1958]

(సంతకము)

* పరా: ఏ పాఠశాలలోనూగాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ సడీ' అని వ్రాయాలి.

సంచిక: 25-6-58] ఈ దరఖాస్తు 28-6-58 నాటికి మాకు చేరాలి]




## 35

అనుకున్నట్టే పులు ఆ మరుచటిగోజు రాత్రి వెంటపడసాగాడు ఎంత బోధ పర్చినా లాభం లేకపోయింది నీలి బ్రతిమాలింది ఎన్నో బుద్ధులు చెప్పినా వినిపించుకోలేదు. చివరకు ఆమె విసిగిపోయి కొడుకును పట్టుకొని మొగుడ్ని వెళ్ళిపోమని సైగ చేసింది పులయ్య వెళ్తుంటే వీడు గగోలు పెట్టి యేడుస్తూ గుంజాటనపడుతూ అమ్మ చేతిలోనించి జారిపోడానికి ప్రయత్నిస్తున్నాడు. చివరకి నీలి చింకిగుడ్డతో కాళ్ళు చేతులు కట్టి యింట్లో ఒక మూల కూర్చోపెట్టింది. అవీ పీకివేసి పరుగెత్తబోతే ఆమె పట్టుకొని యీసారి తాడుతో గట్టిగా కట్టింది. అలా యేడుస్తూ యేడుస్తూ వెక్కుతూ వెక్కుతూ చివరకు యెంతో సేపటికిగానీ నిద్రాదేవి ఒడిలో తలవాల్చలేదు

పుల్లయ్య వెళ్ళగానే ఆ అన్న లేచి నిల్చొని తన యింటికి తీసుకవెళ్లాడు ఇదే అన్నయిల్లు చూడటం. ఆ చుట్టుపట్లవున్న యిల్లవేపు ఆ వెన్నెల్లో చూసాడు ఆ పరిసరాలు చెత్త చెదారాలతోనూ చాలా అసహ్యంగావుంది. ఈ చిన్న పాకలో ఒక భాగంలో అన్న, అన్న చెలీ, ముగ్గురు పిల్లలూ వున్నారు. ఒకేగది-అది గదిఅనే బదులు ఒక పంచగది అంటే బాగుంటుంది. చిన్న బుడ్డీ దీపం ఆ గదిలో వెలుగుతోంది. ఆ గదిలో నేలమీద చిన్న గుడ్డ పరచుకొని అన్న చెల్లెలు పడుకుంది ఉండి వుండి ఆమె మూలుగు వినిపిస్తోంది అన్న కొడుకు మల్లకంటే మూడేళ్ళు పెద్దలా వున్నాడు అక్కడే పుస్తకం పట్టుకొని గట్టిగా చదువుకొంటున్నాడు. పెదపిల్ల చిన్నపిల్లను అడ్డాలలో వేసి జోకొట్టుంది.

పులయ్య పిల్లవాడి చదువు విని తన కొడుకు విషయం జ్ఞాపకానికి వచ్చింది. "బాగా సదువుతున్నాడే" అన్నాడు.

ఆ అన్న ఆ కొడుకు గురించి యెంతో గొప్పగా చెప్పుకున్నాడు. వాడిమీద ఆశతోనే బ్రతుకుతున్నానని చెప్పాడు. అదంతా వింటుంటే తనలాగే కొడుకుల్ని చూసి అంత ఆనందం గర్వం పడేవాళ్ళున్నారని, తెలుసుకొన్నాడు. అన్న చెలెలు వేపు ఆ యేడుస్తున్న తల్లిలేని పిల్లవేపు చూస్తుంటే పుల్లయ్య కెంతో కనికరంవేసి "రామరామ తల్లలేని పిల - అమ్మలేని పిలలికి అల్ల కల్లోలాలే - ఎలాగ బరిస్తున్నావన్నా" అన్నాడు.

అన్న అలా గడపలో కూర్చొనే తన గాథ మొదలు పెటాడు. "అన్నా? బతుకు తానని కూలినేక నాలినేక సెయ్యి బదుల్లు సేసి సెనగల యాపారం అనీ......యీయాపారం ఆయాపారం యేది సేసినా జరిగింది కాదు. అది సచ్చిపోయిన్నాడు - సేత పిల్లగవ్వ నేదు. దానికి సరిగ్గా గంజిపొయ్య నేక జబ్బులపాలుసేసి నా నే సంపేసినాను-సచ్చినదాకా నాకిది లేదు అది లేదని అనలేదు. లేనినాడుకూడా వున్నట్టే మెలిగింది. అది సచ్చిన్నాడే నానూ సచ్చిపోతానన్నా."

పుల్లయ్య పనివిషయమై మరచిపోయి. ఆ విషాదగాథ వింటున్నాడు. అన్న మళ్లీ ఆగోల మధ్యనే మొదలు పెటాడు "మన సేతుల్లో యేం వున్నాదన్నా-ఉన్నదంతా గుండెదయిర్యమే - అదే తెచ్చుకున్నాను - యీ పిల్లల్ని సూసుకొని యిలాగ రొులిపోతంది"

ఇంతలో యింకోవ్యక్తివచ్చాడు పొటిగా పల్గగా భీకరంగా వున్నాడు. మొరటులా వున్నా ఆ మ ని షి రా గా నే ఆ అన్న లేచాడు. ముగ్గురూ మౌనంగా కొంతదూరం నడిచారు. రోడ్డు ప్రక్కన కాలవగట్టుపై కూర్చొని ఆ అన్న "ఇదిగో మన వోడే అన్నా...అలాగ కనిపిస్తున్నాడు - గానీ బీదోలంటే యీడి ఒళ్లంతా కోసి యిచ్చిమంటే యిచ్చేస్తాడు. ఎలాగ గడిస్తాడో అలాగే విసుర్తాడు డబ్బునీ..."

అంతదూరంలోవున్న హార్బరులో దీపాల తోరణం అగుపిస్తోంది. అటువేపుమాస్తుంటే పుల్లయ్యకు తొందరపాటు హెచ్చవుతోంది.

"పనిలోనికి యెళ్లమా?" అన్నాడు

"అప్పుడే నా. అయినా యీ రాత్రులు మనం అటే సేయవేం!"

"ఏం?"

"అదిగో సూడు ఆకాసం మీద యెవడు న్నాడో.. ఆడుసుంగిపోవాల..."

పుల్లయ్య సంశయంగా చూసాడు తనకేదో అనుమానం వేసి "ఓడ దించాలకదన్నా!"

"అవునన్నా...మనలాంటోలకివస్తే ఓడ పోతే ఛేస!"

"నాకు సరిగ్గా సెప్పన్నా"

"నీకు కష్టంగా వున్నాదా? మనం పని దొరికిన్నాడు సేసుకుందాం లేని వాడు ఇందులో తప్పేం వున్నాది? మనం యీ సిన్న పనిసేసి యెవుడి కొంప కూల్చలేదే."

"దొంగతనమా?" అన్నాడు పుల్లయ్య ఆశ్చర్యంగా. "ఒరే చంద్రయ్యా! ఈ అన్న వుత్తి సేతకానివాడిలాగ ఆకలితో సచ్చిపోతానంటాడు గానీ యెలాగో కడుపు నింపుకొని బ్రతుకుతాననడు?" అని పుల్లయ్య వేపు తిరిగి "అన్నా! నివ్వు పని సంపాదించుకొని బతగ్గలవా?"

పుల్లయ్య తలవూపాడు.

"చెప్పు సంపాదించగలవా?"

"లేను!"

"అయితే బతకడానికి దొంగతనం సెయ్యగలవా?"

"సెయ్యలేను!"

"పోనీ ఏ డబ్బున్న ఆడది కలిసివస్తే—"

"పాపం పాపం!'

"అయితే నివ్వు యీ పెపంచకానయెందుకూ పనికిరావన్నమాట. నివ్వు బతకలేవు—ఒకరిస్తే పుచ్చుకోలేవు—అయితే యెందుకు పనికొస్తావు?"

"నీతింటూ సచ్చిపోడానికి" చంద్రయ్య అందుకున్నాడు. "సూడన్నా నీనీతి నాకేం బోధపడలేదు కడుపులు మాడిసచ్చిపోతున్నప్పుడు నీతింటూ కూర్చుంటావా? ఆదర్శ రాజేం చేసినాడు? అబద్ధం ఆడనేదా? ఆడికంటె నువ్వు గుప్పోడివా? నువ్వు సాలా అమాయకుడివి—నా మాట యినకపోతే నాలుగు రోజుల్లో నిన్ను యీ డ్పినోళె యెవరూ వుండరు."

పుల్లయ్య ముఖం క్రిందికి దించివేసాడు. ఆ అన్న మళ్ళీ అన్నాడు. "మనం ఎవడ్ని ఖూనీ సెయ్యనేదు. ఒకడి రక్తం తాగనేదు. తోడి మనుషుల్ని దగాచేస్తున్న వాళ్ల దగర న్యాయంగా అడిగితే యివ్వలేదని యింకోలాగ తీసుకుంటున్నాం—ఆకాసం మీదవున్న యీ మేఘాలు అందరివి—ఈ భూమిమీదవున్న పళ్ళూ ఫలసాయాలు అందరివే—అయితే పెద్దోడు హెచ్చు పిల్లడు తక్కువ తిన్నట్టే అలాగ యింటిని పంచుకుంటే యే గొడవా లేదు. మనలాంటి పిల్లోడికి పెట్టకుండా తినేసే, దయలేని యీ పెద్దోళ్ళపై పడక యింకెవరిమీద పడమంటావ్?"

పులయ్య యింకా మౌనంగానే వింటున్నాడు. అన్న యింకా వాగ్ధాటిని ఆపలేదు.

"నివ్వను కుంటున్నావ్ యిలాగ రాత్రులు దొంగతనానికి వెళ్లినవాళ్లే దొంగలని.. నీకు తెలీదు—ఈ దోచుకునోళ్లు నాటికి నూరు లాభాలు యేసుకుంటున్నారు. ఆలు దొంగలా? మనలా బతకడానికి యెళ్లినవాళ్లు దొంగలా? నివ్వు రాకపోతే మాకు సేతకాదని కాదు-అదేంటో నీవు కలుసుకున్న మూర్తం అలాంటేది. అయ్యోన్నా లాంటోడివి—పిల్లలతో మలమల మాడి పోతావని యింత సెప్పడం? నీ పిచ్చిగాని అన్నా యేదో ఒకలాగ దొంగతనం అన్యాయం సెయ్యంది యీ లోకంలో యెవుడు ఆ సిపాస్తులు సేసుకున్నాడు పోనీ వ్వు దొంగతనం సెయ్యొద్దు—పైనే వుండు—నీ ఒంతు నివు తీసుకో"

అలా చందమామ క్రుంగేవరకు కూర్చున్నారు. పులయ్యకు ఆ సమయంలో తిరిగి వెళ్ళిపోవడానికి మనస్కరించలేదు అప్పు తీర్చాలి—అద్దె యివ్వకపోతే నిలుచున్న పాటున గెంటించి వేస్తుందామె! పెళ్ళాం యెదరగా తను అన్ని గొప్పలు చెప్పాడు-మళ్లీ లేదని యెలా చెప్పటం? తన కొడుకును చదువులో వెయ్యాలి. వాడికి పలకా పుస్తకాలు-బట్టలూ వుండాలి-తను వాళ్లతో చేరకపోతే రేపటినుంచీ యేం చెయ్యగలడు? తన వూరు వెళ్ళిపోతే?? ఆ సుందరమైన భూములు, గలగల ప్రవహించేనది-కుమ్మటం లాంటి యిల్లు—పోతులు వ్యవసాయం—ఆ చక్కని మనోహర ప్రదేశం. మా తల్లి లచ్చిందేవి గలగలలు—నీలమ్మతల్లి సంబరాలు.. గరిడీ. యెక్కడా సంతోషమే.. ఎక్కడా వుత్సాహమే ..ఒక్కసారి యివన్నీ వికటాట్టహాసం చేసిన ట్లనిపించాయి "పుల్లయ్యా ... పూరెందుకు కదిలావో మరచిపోయావా? మనుషులు మారిపోయారు—వారితోపాటూ మేమూ మారిపోయాం...ఎక్కడ కక్కడే ప్రాణం లేకండా ఒరిగిపోయాం... నివ్వు యీ పలెకువచ్చి యేం చేస్తావుని...బ్రతుకుతానంటావా? యెలా బ్రతుకుతావ్...? ఒక సెంటుభూమి వుందా? ఉండటానికి యిల్లు వుందా? అందరూ నిన్ను చూసి పకపక నవ్వి వెక్కిరిస్తారు పడిపోయావు కదా అని కనికరించరు. యేం తిని బ్రతుకుతావ్—ఏ ముఖం పెట్టుకొని వెల్తావ్?" యిలా గుండెలో గడగడలు బయలుదేరాయి మనసులో వడగళ్లు . . వానలా

(41-వ పేజీ చూడుడు)

# నక్షత్రఫలితాలు

**[25-6-58 మొదలు 1-7-58 వరకు]**

బి. నరసింగరావు

### గ్రహస్థితి

| చ | శ | శు | ర బు |
|---|---|---|---|
| | 1 తేదీ పశ్చాదుదితో బుధః బుధుడు కర్కాటకములో ప్రవేశించును. కన్య, తుల, వృశ్చిక, ధనస్సులలో చంద్రుడు | | |
| | | | |
| | కే | రా | గు |

***అశ్విని [చూ, చే, చో, లా]***

ఈ వారము కార్యభారము ఎక్కువ. రాజవార్తా ప్రసంగములు, వింత మాటలు వినుట, పరాక్రమమువల్ల ఘనత, ధనలాభము ప్రయాణము వుండును. అకాలభోజనమువల్ల వేడిచేసి కడుపునొప్పి నేత్రపీడ, బలహీనత వంటి సూచనలు కనబడగానే ఔషధసేవ చేయుటవల మేలు ఉద్యోగస్తులకు బదిలీయగుటగాని, అధికారుల ఒత్తిడికి తట్టుకోలేక శెలవుపెట్టుటగాని జరుగును విద్యార్థులకు జయము తక్కువ వారమంతయు యోగావయోగములతో మిశ్రమముగా వుండును. 29 30 1 తేదీలలో అనారోగ్యము, బదిలీ సూచనలు.

*** భరణి [లీ, లూ, లే, లో] ***

ఈ వారము ప్రతిపనికి అనవసరముగా ఆలస్యము జరుగుతుంది. ఏపని చేసేందుకూ సమాధానము కుదరక చికాకుపడతారు. ఆశాభంగము ఎక్కువ వర్తకులకు లాభము తక్కువ. రహస్యములను కనిపెట్టటలో నిపుణులగుటవల ప్రభుత్వము మిమ్మల్ని ఆ పనికి నియోగించుతుంది ఉద్యోగస్థులకు శిక్షకొరకు వనపర్వత ప్రాంతములకు బదిలీ అవుతుంది. విదేశీయులతో పరిచయము, కార్యసాధన కలుగుతవి 29 30 1 ఆత్మీయుల అనారోగ్యముచే వ్యధ, చాంచల్యము, బదిలీ.

*** కృత్తిక [ఆ, ఈ, ఊ, ఏ] ***

ఈ వారము మీరు ఎవరి సహాయమునూ కోరి కార్యములు చేదామనుకున్నారో ఆ వ్యక్తివలనే మీకు ఆటంకములు కలుగుతవి ధనాభావము ఎక్కువగా వుంటుంది. ఆధ్యాత్మిక చింత కలవారగుటవల ఈశ్వరకృపచే అన్ని కష్టములను గడిచి క్రమేణా కార్యసిద్ధి పొందుతారు. ఇంట్లో వారి ఆరోగ్యము ఆందోళన కలుగజేస్తుంది. ఉద్యోస్తులకు ఒత్తిడి, వ్యాపారస్తులకు నిరాశ. విద్యార్థులకు జయము తక్కువ. 27, 28 తేదిలలో నష్టద్రవ్యలాభము, 29, 30, 1 తేదీలలో ఆరోగ్య చింత, ఆటంకములు, ఒత్తిడి.

*** రోహిణి [ఓ, వా, వీ, వూ] ***

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ కోర్టు దావాలు అనుకూలిసవి ఎక్కువ శ్రమపడిన మీదట యత్నకార్యాలు ఫలిస్తాయి. పరోపకారమునకు యత్నపడ పనుల ఒత్తిడివల్ల చేయలేక నిందలు పొందుతారు. ఇచ్చి పుచ్చుకునేపట వివాదములు. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ, తోటివారి సహకారముచే సర్దుబాటుగా వుంటుంది. వర్తకులకు వారమంతా నిరాశగా వున్నా వారాంతమునకు మేలుగా వుంటుంది. 29, 30, 1 అధికారుల ఒత్తిడి, వివాదములు, భార్యకు అనారోగ్యము

*** మృగశిర [వే, వో, కా, కీ]***

మీ ఆలోచనలు కార్యరూపమునకు వచ్చేందుకు ఎన్ని అవాంతరాలు కలిగినా, నిరుత్సాహపడక పట్టుదలతో ప్రయత్నించి తుదకు కార్య సాఫల్యమును పొందుతారు. ఖర్చులకు అవసరపడిన సొమ్ము సమయానికి జతపడనందున ఋణము చేయవలసి వస్తుంది. కాని వారాంతమునకు తీరుస్తారు అవయవములకు దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చు. రసాయనిక శాస్త్రజ్ఞులకు లోహపు సామాను, రంగుల వ్యాపారస్తులకు కష్టముతో కూడిన లాభము. ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు యంత్రములు నడుపు నిపుణులకు మేలు కాలము. 29, 30, 1 ఆరోగ్య చింత ప్రమాద సూచన.

*** ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ]***

ఈ వారము మీకు యోగకాలము, మీ బుద్ధిబలముకుతోడు అధికారుల సహాయము బంధు సహాయము కలుగుటచేత వచ్చే ఆటంకములు గడిచి ఫలము పొందుతారు. ధనాదాయము వృద్ధి అవుతుంది. వైద్య, జ్యోతిష శాస్త్ర ప్రసంగాలలో పాల్గొంటారు. కవులు నూతన రచనలు చేస్తారు. ఈశాన్య దిక్కునుండి మీ దగ్గరబంధువుల క్షేమవార్త తెలిసి సంతోషము పొందుతారు. విద్యార్థులు ఉత్సాహముగా కొత్త క్లాసులలో చేరుతారు. 27, 28 తేదిలలో ధనాదాయము, బంధుసహాయము, పండితగోష్ఠి, కుశలవార్త 29, 30 అధిక ఖర్చులు కవులకు శిల్పులకు, నటీనటులకు మేలు కాలము.

*** పునర్వసు [కే, కో, హా, హీ] ***

ఈ వారము మీకు యోగము ఎక్కువ. ఉన్న యిబ్బందులు తీరుతవి. అనుకున్న సొమ్ము చేతికి వస్తుంది. దావాలలో గెలుపు కలుగుతుంది. పురుష సంతానము సుఖ సంతోషాలకై చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. పండితులతో శాస్త్ర ప్రసంగములు చేయుటచే విజ్ఞానము వృద్ధి పొందుతుంది. ఉద్యోగులకు అధికారము పెరుగుతుంది. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు యోగకాలము విద్యార్థులకు అనుకున్న స్థానములు దొరకుటచే సంతోషము. 27, 28 తేదిలలో భాగ్యవృద్ధి.

***పుష్యమి [హూ, హే, హో, డా]***

ఈ వారము మీకు యోగదాయకమైననూ మానసికాందోళన వుంటుంది. ధనయోగము కలుగుతుంది. కవితాగోష్ఠి, గాన సభలవంటి వినోదాల్లో బంధుమిత్రులతో కలిసి పాల్గొంటారు ఇంతవరకూ అనారోగ్యముగా వున్న ఆప్తులు కోలుకొంటూవున్నట్లు వార్త వచ్చుటచే సంతోషము పొందుతారు. కవులకూ, గాయకులకు, నటీనటులకు యోగకాలము. ప్రత్తి, దూది, నూలు, బట్టలు బియ్యము, వెండినగలు వ్యాపారస్తులకు లాభయోగము. 27, 28 కార్యసిద్ధి, విందు, వినోదము. నీటిపై ప్రయాణము చేయవలసి వుంటుంది.

*** ఆశ్లేష [డీ, డూ, డే, డో] ***

గతవారము పూర్తికాకుండా వుండిపోయిన కార్యములు ఈ వారము లాభకరముగా ముగుస్తాయి. ధనయోగము అనుకున్నదానికన్నా ఎక్కువగా వృద్ధి అవుతుంది. శుభ కార్యాలోచనలు చేస్తారు సాంఘిక సేవచేసి కీర్తి పొందుతారు. ఉద్యోగస్తులకు

అధికార హోదాలు పెరుగుతవి. వాహన యోగము కలుగుతుంది. విలువగల వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు ఎక్కువ లాభము కలుగుతుంది 27, 28 ధనయోగము స్త్రీలతోనూ, ఆప్తులతోనూ, విందు, వినోదము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీ నటులకూ యోగకాలము. 30, 1 అధిక ఖర్చులు, ఆందోళన.

### * మఖ [మా,మీ,మూ,మే] *

ఈ వారం యత్నకార్యములకు ఆటంకములు కలుగుతవి. కార్యభారమువల్ల తీరుబడి వుండదు. ఆర్థికస్థితి బాగా వుండనందున గృహావసరములు తీరక యిబ్బంది కలుగుతుంది. అకాల భోజనమువల్ల అనారోగ్య చిహ్నాలు కనబడగానే ఔషధసేవ చేయుట వల మేలు. వర్తకులకు శ్రమ ఎక్కువ. ఉద్యోగస్థులకు ఒత్తిడి వున్నా అధికారుల ఆదరణ పొందుతారు. రాజకీయవాదులకు మేలుగా వుంటుంది వారమంతా అలజడిగా వున్నా కార్యలాభము, ధనయోగముకూడా వుంటాయి. 30, 1 ఆరోగ్యభంగము.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### మో, టా, టీ, టూ

ఈ వారము మీకు మిశ్రమయోగము. మొదటో నిరాశగా వుంటుంది కాని క్రమేణా మిత్రసహాయమువల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన ఉద్యోగస్థులకు మంచిరోజులు కావు. వర్తకులకు లాభము తక్కువ. ప్రభుత్వముచే రహస్యములు కనకొనుటకు నియమితులవుతారు వారమంతా మనోవ్యధ, గృహకలతలు, నిరాశవంటి అవయోగములున్ననూ, ప్రయాణము, మిత్రసహాయము, కార్యలాభము, అన్యదేశీయుల పరిచయము, విచిత్రవస్తు సంపాదన మొదలగు మంచి యోగములు కూడా వుంటాయి 30,1 బదిలీ, చంచలస్థితి, ఆప్తుల అనారోగ్యము.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### [టే, టో, పా, పీ]

ఈ వారము తలపెటిన పుణ్యకార్య చింత సానుకూలము కావచ్చును తీర్థయాత్రలలో చిత్రవిచిత్ర వస్తువులను చూస్తారు. దైవభక్తి కలిగి వ్యవహరించుటచేతను సత్ప్రదవ్యలాభమును పొందుతారు అమితముగా తినుటవల్ల శరీరపీడ కలుగుతుంది. సాధుసాంగత్యమువల్ల ఆధ్యాత్మిక చింతచే మనోవికాసము కలుగుతుంది. ఉద్యోగస్థులు కొంత శ్రమపడిన మీదట మేలు పొందుతారు. వర్తకులు నిరాశ చెందిన పాతబాకీలు వసూలవుతాయి వారమంతా ఆందోళనగా వుంటుంది. 30, 1 త్రిప్పట, అనారోగ్యము.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము బుద్ధిమాంద్యము ఎక్కువగా వుంటుంది. తలపెట్టిన కార్యములలో జయము లేకపోవుట, వ్యర్థముగా తిరుగుట, సజ్జన విరోధమువంటి చెడుఫలితాలు కలుగుతాయి. పరోపకారమునకు పూనుకొని, సాగక, మాటపడి విచారిస్తారు ధనలోపము తీరిందికి చాలా తాపత్రయ పడతారు. దావాలలో గెలుపు కలుగుతుంది. ఉద్యోగస్థులు శలవు పెట్టవలసి వస్తుంది. అపరదినుసులు, ఉప్పు, నువ్వులు, నూనె వ్యాపారస్థులకు లాభము మొత్తముమీద వారమంతా ఒడిదుడుకులుగా వుంటుంది. 30, 1 వివాదము, భార్య అనారోగ్యము.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము మీకు అంత యోగదాయకము కాదు. ప్రతీపనికి ఆటంకాలు కలుగుతవి. కాని పట్టుదలతో ప్రయత్నించి తుదకు జయము పొందుతారు. అనుకున్న డబ్బు సమయమునకు రాకపోవుటవల సోదరులు కోరినసహాయము చేయలేక మనోవ్యధపొందుతారు. ఉద్యోగస్థులకు అధికారుల పోటు మాటలవల్ల మనోవ్యధ కలుగుతుంది. శరీరముపై కురుపులు లేస్తాయి అగ్నివలగాని, యంత్రములవల్లగాని ప్రమాదము జరుగవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు, ఇంజనీరింగు, పోలీసుశాఖలలో వారికి శ్రమఎక్కువైనా మేలుగా వుంటుంది. 27, 28 యత్నకార్యసిద్ధి, ధనలాభము 30, 1 ప్రమాద సూచన.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము మీ పలుకుబడివల్ల కార్యసిద్ధిని పొందుతారు. ఆర్థికస్థితి బాగుంటుంది. నూతన మిత్రలాభము కలుగుతుంది. ఉద్యోగస్థులకూ అధికారుల ఆదరణ లభిస్తుంది. మంచిపుత్తరములు వస్తవి. డాక్టర్లకూ, గణిత శాస్త్రజ్ఞులకూ, కవులకూ, శిల్పులకూ, నటీనటులకూ యోగకాలము 27, 28 కార్యానుకూలత, ధనయోగము, విద్యాగోష్ఠి. 30, 1 అధిక ఖర్చులు, బద్ధకము. విద్యార్థులకూ అనుకూలము. కవులు నూతన రచనలు ప్రారంభిస్తారు.

### —ధరలు:—

నూలు, వస్త్రములు. మందముగా వుండును.

నూనె దినుసులు. మార్పులేదు.

బెల్లము, పంచదార, చింతపండు: మార్పులేదు.

ఆహార ధాన్యములు: నిలబాటుగా వుండును.

పప్పుదినుసులు: సమస్థాయిలో వుండును.

వెండి, బంగారము: స్వల్ప తేడాలలో వుండును.

పర్వత ప్రాంతములలో ఎక్కువగానూ, సమస్థలములలో సామాన్యముగానూ, తీరప్రాంతములలో గాలితో కూడిన వర్షములు కురియును

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము తెలుగనివారు నామనక్షత్రము (వారి వారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, హృషీకేశుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

### * విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈ వారము మీకు ధనయోగము. భాగ్యవృద్ధి కలుగుతుంది. తలపెట్టిన పనులు లాభకరముగా ముగుస్తాయి కోర్టు వ్యవహారములు అనుకూలమవుతవి. పండితగోష్ఠివల్ల ఉత్తమ గ్రంథపఠనము వల్ల విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. పిల్లల క్షేమాభివృద్ధి సంతోషము కలిగిస్తుంది ఉద్యోగస్థులకు అధికారుల ఆదరణ లభిస్తుంది విద్యార్థులకు కొత్త తరగతులలో ప్రవేశము దొరుకుతుంది. 27, 28 ధనాదాయము, కార్యసిద్ధి, పండితగోష్ఠి. 30 1 అధిక ఖర్చులు, ఆందోళన.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము మీ యత్నకార్యములు లాభిస్తాయి ఆర్థికస్థితి బాగుంటుంది. బంధుమిత్రులతో కలసి కవితాగోష్ఠి, గానసభలు వంటి వినోదములలో పాల్గొంటారు. దక్షిణదిక్కునుండి మంచి



# నక్షత్రఫలితాలు



వార్త వింటారు. నీటి పై ప్రయాణము చేయవలసి వుంటుంది. ప్రత్తి, దూది, నూలు బట్టలు, బియ్యము, వెండివ్యాపారస్తులకు యోగకాలము. విద్యార్థులకు క్రొత్తతరగతులలో స్థానములు లభిస్తాయి. కవులకు గాయకులకు కళాకారులకు మేలుకాలము. 25, 26 మానసికాందోళన. 27, 28 ధనలాభము కార్యలాభము, క్షేమవార్త. 30, 1 చాంచల్యము.

## *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారము మీ ఉద్యోగము, హోదా, ఆదాయము వృద్ధిపొందుతాయి. అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభసాటిగ పూర్తిఅవుతవి. పరోపకారముచేసి కీర్తి పొందుతారు దావాలలో గెలుపు కలుగుతుంది. నూతనవసు సంపాదన చేసారు. ఇంట్లోవున్న స్త్రీలకు అలంకారప్రాప్తి. వర్తకులకు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు నటీనటులకు యోగకాలము. 25, 26 ప్రయాణము. 27, 28 ధనయోగము. కార్యలాభము, కీర్తి, విందు, వినోదము. 30, 1 అధిక ఖర్చులు, వ్యసనము

## * మూల [యే, యో, బా, బి] *

ఈ వారము మీఆదాయాభివృద్ధికొరకు మీరు చేసేప్రయత్నాలు ఫలిస్తాయి. కార్యభారము ఎక్కువవుతుంది. ప్రభుత్వవార్తా ప్రసంగములు, వింతవార్తలు వినుట, పరాక్రమమువల్ల ఘనత సంపాదించుటవంటి కార్యములలో నిమగ్నులౌతారు. శరీరములో వేడి, కళ్లమంట, తలపోటులాంటి అనారోగ్యసూచనలు చూపట్టగానే ఔషధసేవ చేయుట మేలు ఉద్యోగస్తులకు బదిలీ అయే సూచనలున్నవి. వర్తకులకు రావలసినసొమ్ము వసూలుకాక యిబ్బంది 27, 28 రాజకీయాలలో భయం, ధనలాభము, కార్యానుకూలత 30 1 ఇబ్బంది, అనారోగ్యం.

## *పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢ]*

ఈవారము నిలకడలేని ఆలోచనలతో యేపని చెయ్యలేకపోతారు. ధనలోపమువల్ల ఇబ్బంది శ్రమపడినప్పటికీ మాట దక్కదు. గృహమందున్న వృద్ధుల అనారోగ్యము ఆందోళన గలిగిస్తుంది. ఆకస్మికముగా కలుసుకున్న మిత్రుని సహాయమువల్ల చిక్కులు తొలగి ఫలసిద్ధి కలుగుతుంది. ప్రయాణము చేయవలసి వస్తుంది. అందువల వర్తకులకు లాభము. ఉద్యోగులకూ బదిలీ అయేభయము కలుగుతుంది. విద్యార్థులకు అనుకున్న స్థానములు దొరకక ఆశాభంగము 27 28 కార్యలాభము, విదేశీయుల పరిచయము, అపురూపవస్తు సంపాదన. 30, 1 బదిలీసూచన, అనారోగ్యము.

## *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈవారము మీకు మిశ్రమయోగము. అనుకున్నట్టుగా పనులు జరగవు. ధనలోపమువల్ల గృహావసరములు తీరక కలతలు. కోరిన సహాయము లభించదు దైవముపై భారము వేసి కార్యసాధనకు ప్రయత్నించి ఫలమును పొందుతారు. పుణ్యపురుషుల సాంగత్యమువల్ల ఆత్మవికాసము కలుగుతుంది. వర్తకులకు వస్త్రద్రవ్యలాభము కోర్టు వ్యవహారములో జయము. పుణ్యక్షేత్రములు, అద్భుత విచిత్రములను చూచుట. 30, 1 చెడువార్తలను వినుట, ఆందోళన.

## *శ్రవణము [జూ, జే, జో, ఘా]*

ఈ వారము కార్యభారము చే శ్రమ ఎక్కువ ఇతరులకొరకు శ్రమపడినసూ చేసిన ప్రయత్నము కొకపోయినందున మాట పడతారు. కోర్టువ్యవహారములు మీపరము అయినా కొత్తచిక్కులు మళ్లీ తలెత్తుతాయి భార్యకు ఆరోగ్యము చెడుటనుంచి ఆందోళన కలుగుతుంది. ఉద్యోగస్తులకు బదిలీ అయే సూచనలున్నాయి. అపరదినుసులు, ఉప్పు, నువ్వులనూనె వ్యాపారస్తులకు లాభయోగము. 25, 26 అన్నివిధాలా అసంతృప్తగా వుంటుంది. 27, 28 కార్యలాభము. వర్తకులకు లాభయోగము 30, 1 ఆరోగ్యచింత.

## * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారము మీ ప్రయత్నములు ఫలించక అనేకచిక్కులు కలుగుతవి. ధైర్యముగా పట్టుదలతో కార్యరంగములకు దిగి ఆఖరుకు ఫలప్రాప్తిని పొందుతారు. సోదరుల సహాయమువల చాలావరకూ ధనలోపము తీరుతుంది. ఉద్యోగస్తులు అధికారుల ఒత్తిడివల్ల శెలవు పెట్టవలసి వస్తుంది; లేదా ట్రాన్స్‌ఫరు అవుతారు. యంత్రములు, అగ్ని మొదలగు వాటివల కలిగే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయన ఎరువుల వ్యాపారస్తులు ఖనిజములు, లోహముల వర్తకులకు లాభయోగము వారమంతా శ్రమతో కూడిన కార్యసిద్ధి 30 1 ప్రమాద సూచన.

## *శతభిషం [గో, సా, సీ, సూ] *

ఈవారము మీరు యుక్తిగా యత్నకార్యములను సాధిస్తారు. జ్ఞాతులవల్ల ధనసహాయము కార్యసహాయము కలుగుతవి. ఈశాన్యదిక్కునుండి సంతోషవార్త వస్తుంది. ఉద్యోగస్థుల హోదా పెరుగుతుంది. విద్యార్థులకు కొత్త క్లాసులలో ప్రవేశము దొరుకుటచే ఉల్లాసముగా వుంటారు. గణిత శాస్త్రజ్ఞులకు యోగకాలము, 25, 26 చాంచల్యము. 27 28 ధనయోగము బంధు సహాయము కార్యలాభము ప్రమోషను 30, 1 అమిత ఖర్చులు.

## *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

ఈవారము క్రొత్తపనులు ఉత్సాహముతో మొదలు పెడతారు. ధనాదాయము ఎక్కువవుతుంది. దావాలలో గెలుపు కలుగుతుంది, పిల్లల అభివృద్ధికి కావలసిన కార్యక్రమము జయప్రదముగా నెరవేరుసారు విద్యార్థులు నూతన తరగతులలో చేరుతారు. పండిత గోష్ఠివల విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. వారమంతా తీరికలేని కార్యక్రమములో ఘనత వహిస్తారు న్యాయస్థానములలో మీ మాట నెగ్గుతుంది. పండితులకూ, ఉపాధ్యాయులకు, న్యాయవాదులకూ, న్యాయకార్యాలయ ఉద్యోగులకు మేలుకాలము.

## * ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]*

గతవారముకన్నా ఈ వారము మీ ధనాదాయము ఎక్కువవుతుంది. తలపెట్టినపనులు అనుకున్నట్టుగా జరుగుతవి. బంధుమిత్రులతోకలిసి, కవితాగోష్ఠి గానసభలవంటివినోదాలలో పాల్గొంటారు. నీటిమీద ప్రయాణము చేయవలసి వుంటుంది. విద్యార్థులకు క్రొత్తతరగతులలో స్థానం దొరుకుతుంది. ఉద్యోగస్తులకు అధికారుల ఆదరణ వుంటుంది ప్రత్తి, దూది, నూలు, బట్టలు, ద్రవపదార్థములు, బియ్యము, వెండివ్యాపారస్తులకు లాభము. వారమంతా యత్నకార్యజయము వున్నా మానసిక ఆందోళన ఎక్కువగా వుంటుంది. దక్షిణ దిక్కునుండి మంచివార్త

## * రేవతి [దే, దో, చా, చీ] *

ఈవారము మీరు తలపెట్టినపనులలో ఫలప్రాప్తిని పొందుతారు. అనుకున్నకన్నా ఎక్కువగా ధనలాభమును పొందుతారు. సంఘసంక్షేమ కార్యాలాచరించి కీర్తిసంపాదిస్తారు. నూతనప్రయత్నములు చేస్తారు. ఉద్యోగస్తులకు మేలుగావుంటుంది విద్యార్థులకు క్రొత్తక్లాసులలో ప్రవేశము కలుగుతుంది వర్తకులకు విలువగల సరుకుల క్రయవిక్రయములలో ద్విగుణలాభము కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. వారమంతా తీరికలేని కార్యక్రమముతో ఖర్చులు ఎక్కువ





# వనితాలోకం

## ★ విశాల హృదయాలు ★

వెనకెప్పుడో ఆంధ్రపత్రికలోనే అనుకుంటా, ఒక కథ చదివాను రచయిత ఎవరో గుర్తులేదు కాని కథ నాకు చాల నచ్చింది. 'ఆదర్శ దాంపత్య' మనే పుస్తకం వ్రాయాలనుకున్న ఒక భర్త, తన భార్యతో కబురు చెబుతూ 'ఆదర్శ దాంపత్య మంటే భార్యాభర్తలు పూర్తిగా ఒకర్నొకరు అర్థం చేసుకోవాలని, అంటే వారి పెళ్ళికి వెనక జీవిత మంతా ఒకరి కొకరు చెప్పుకొని తప్పులేమైనా చేస్తే ఒకర్నొకరు వుదార హృదయంతో క్షమించుకోవాలని అంటాడు. ఇట్లాగే ఏదేదో చెప్పి, భార్యను విసుగుతాడు, పెళ్ళికానప్పటి సంగతులు చెప్పమని. ఆమె కోరికపై మొదట తనే మొదలెడ్తాడు, తను కాలేజీలో చదివేటప్పుడు క్లాసుమేట్‌ను ప్రేమించాడని, ఆమెకు తనకు మధ్య గడచిన ప్రేమ లేఖలు వెన్నెల రాత్రులు వర్ణించి చెపుతాడు ఇదంతా ఓపిగ్గా భార్య విన్నాక ఆమెను బలవంతపెట్టాడు, ఆమె ఎవరిని ప్రేమించిందో చెప్పమని; అందులో తప్పేదైనా వున్నా తను క్షమిస్తానని అంటాడు ఆమె చెప్తుంది. .. అప్పటికి పెళ్లి కాలేదని, తను ఒకర్ని ఎంతో గాఢంగా ప్రేమించిందనీ అతని వడిలో వాలిపోయిందనీ, అతను ముద్దు పెట్టుకుంటే మురిసిపోయేదనీ.. ఇక చూస్కోండి, సంస్కారం వున్నదన్న ఆ భర్త ఒక్కొక్క వాక్యానికి నిప్పులో కాలుతున్న వంకాయలా వుడికిపోతాడు.. చివరికతని కోపం కొండంత అయి, ఆవేశంతో తిడుతూ గొడలి పట్టుకొస్తాడు ఆమె నెత్తిన బాదడానికి. తొణుకూ బెణుకూ లేకండా ప్రశాంతంగా చెప్తుంది ఆమె "అతను మా నౌకరు రామయ్య. అతని వయస్సు 60 సం॥ అప్పటికి నా వయస్సు 4 సం॥ లు అని. సిగ్గుతో బిక్కచచ్చిపోతాడా విశాల హృదయుడు! ఇలా వుంటుంది ఉపన్యాసాలిచ్చే మగవాళ్ళ విశాల హృదయం.

అయినా "ఆడవాళ్ళకు అనుమానా లెక్కువ" అనేది సామాన్యంగా ప్రతి మగవాడూ అనేమాట. మాటేమిటీ మాటకంటే 'నింద' అంటేనే బావుంటుందేమో.

ఈ అనుమానాల పేరి కేవలం ఆడవాళ్ళకే ఎందుకు ఆపాదింపబడాయి? మగవాళ్ళకు లేవా అనుమానాలు? అసలు మగవాళ్ళకే ఎక్కువా? లేక ఆడవాళ్ళకే ఎక్కువా? ఆ మాటకొస్తే మగవాళ్ళకంటే ఆడవాళ్ళు వెయ్యిరెట్లు మెరుగని నా నమ్మకం.

ఈ విషయం ఆడవాళ్ళు, మగవాళ్ళు అనకుండా భార్యాభర్తలలో తీసుకుందాం

---

ఆర్. ఇందిర (మద్రాసు)

---

"మా ఆవిడకు నాగరికత, సభ్యత తెలీనే తెలీవు. ఎవరైనా పరాయి ఆడదానితో నేను మాటాడినా ఓర్చుకోలేదు. వొట్టి అనుమానం మనిషి. అబ్బబ్బ! ఈ ఆడవాళ్లంతా ఇంతే. ఇంత 'నేరోమైండెడ్‌గా' (సంకుచిత మనస్తత్వం) వీళ్ళనెందుకు సృష్టించాడో ఆ దేముడు. మగవాళ్ళకుండే 'బ్రాడ్‌మైండెడ్‌నెస్' వీళ్ళకు వుండనే వుండదుగదా!" ఇది సామాన్యంగా చాలా మంది మగవాళ్లు తమ భార్యలగురించి అనే మాట.

ఒక దంపతులు ఏ పార్కుకో, ఏ సినిమాకో లేక మరెక్కడికైనా వెళ్తున్నారనుకోండి. ఒక అందమైన అమ్మాయి ఒకటేమిటి. మద్రాస్‌లాంటి సిటీస్‌లో అయితే బోలెడుమంది అంతొ రూపంలో అందంగా లేకపోయినా అలంకరణలో మగవాడిని సూదంటురాయి లాగా ఆకర్షించేటు అలంకరించుకునే వాళ్ళు చాలమంది. ఊఁ సరే. ఇంక అసలు విషయానికొద్దాం. ఏమని చెప్తున్నాను-ఆ భార్యా భర్తలు రోడ్డమ్మట పోతుంటే ఒక అందమైన అమ్మాయి ఎదురైంది అనికదూ అప్పుడా భర్త తనివి తీరకుండా ఆ పిల్లని చూస్తూ అంటాడు భార్యతో "ఆ అమ్మాయి చూడు. ఎంత అందంగావుందో! అందమంటే అదీ ఎంత నైస్‌గా డ్రెస్ చేసుకుందీ అండర్ వేర్స్ చూడు. ఎంచక్కా కనపడుతున్నాయో! బ్యూటిఫుల్!" ఇదీ ఆ భర్త ధోరణి. ఇక ఆ భార్య కెట్లా వుండాలి చెప్పండి? చిర్రెత్తుకరాదూ? వుడుకుమోత్తనం పట్టలేక ఇంటికొచ్చాక ఆ ఇల్లాలేమైనా నోరు జారిందా, చెప్పానుగదూ అటువంటి భర్తల ధోరణిపైన్నే. కొంతమంది భర్తలు పక్కని భార్య వుందని పరాయి అమ్మాయిల అందాన్ని మనస్సులోనే మెచ్చుకొని కళ్లలో తాగేస్తుంటె, మరి కొంతమంది భార్యతోనే ఆ అందచందాల్ని పొగడనారంభిస్తాడు. అదే తన భార్య పరాయి మగాడి అందంగురించి పొగడితే ఏ భర్తైనా వూరుకుంటాడూ? ఏదైనా పదిమంది గుంపులో వున్నప్పుడు కాస్త అందమైన అమ్మాయి కనపడితే ఆ భర్త ఏం చేస్తాడూ? పక్కన భార్యవున్నట్లు కూడ మర్చిపోయి ఈవిడ చెయ్యవదిలేసి ఆవిడ పక్కకు చేరాడు. అటువంటి అమ్మాయిలకు కాస్త దగ్గరలో వుంటే చాలు, స్వర్గసౌఖ్య మనుభవించి నట్లుంటుంది, అటువంటి భర్తలకు. కాని నిజానికి అందులో వొరిగిందేమీ లేదు, ఇవతల భార్య మనస్సు నొప్పించడం తప్పితే. అదే ఇటువంటి పని తన భార్యచేస్తే ఇంటికొచ్చాక చెప్పుతీసుకొని కొడ్తాడు (లేకపోతే కొట్టబోయినంత పని చేస్తాడనుకోండి)

భార్య ఇంట్లో లేనప్పుడు కానీ, వున్నప్పుడుకాని, ఆమె స్నేహితురాళ్ళెవరైనా

తృప్తి

—చిత్రకారుడు : డి. వి. ప్రసాద్, గుంటూరు]



వస్తే ఎక్కువ చనువుగా గంటలకొద్దీ కూలేసి అక్కర్లేనివి కాకలసినవి అన్నీ మాట్లాడే భర్తలున్నారు. ఎంతో ఓర్పు గలది ఐతే కాని ఇటువంటి భర్త ప్రవర్తన సహించలేదు స్త్రీ. అట్లాగని మగవాళ్ళను ఆడవాళ్ళకంటె ఎక్కువ సిగ్గు ప్రదర్శించుమని, భార్య లేనప్పుడెవరైనా ఆమె కోసంవస్తే తలుపు చాటునుంచో, కిటికీ సందులనుండో "మా ఆవిడ లేదు" అనమనీ చెప్పడంలేదు. ఎవరైనావస్తే సభ్యతకోసం వచ్చినవారినిబట్టి కూర్చోమనవచ్చు, అవసరమైన విషయాలుంటే మాట్లాడవచ్చు. కాని మితిమీరి ప్రవర్తిస్తేనే చిక్కు. అంతమాత్రం ఫ్రీడమ్ ఆభర్త తనభార్య కెందుకివ్వకూడదంటాను. తను లేని సమయంలో ఏ ఫామిలీ ఫ్రెండ్సువచ్చినా భార్య వారిని కూర్చోబెట్టి మాట్లాడితే అపార్థం చేసుకునే సంకుచిత హృదయులు (తప్పు వారినివిశాల హృదయులు అనాలి కాబోలు!) వున్నారు.

ఇక జాయింట్ ఫామిలీలోనే వుంటే ఆ ఇల్లాలిబాధ భగవంతుడికే తెలియాలి. భార్య తన అన్నలతో గాని తమ్ముళ్ళతో గాని పొరపాటునైనా అవసరమొచ్చి మాట్లాడిందంటే తప్పుపట్టే భర్తలుంటారు. వాళ్ళపనేమీ చేయకుండా, వాళ్ళున్నా తనకేమీ సంబంధం లేనట్టు ప్రవర్తించినదా—ఇప్పుడు వెంటనే తప్పుపట్టే వొంతు అత్తగారిది. మరదులంటే గిట్టదు, బావగార్లంటే భయం, భక్తి లేనేలేదు వాళ్ళ పనులేవీ తాకనైనా తాకదు ఇట్లా అత్తగారు అభాండాలు వేసారు ఇక నా యిల్లాలెవరి మెప్పు పొందుతుంది? భర్తను మెప్పించాలంటే అత్తగారికికోపం, అత్తగారి మెప్పు పొందాలంటే భర్తగారి ఆగ్రహం. అదేభార్య తన అక్కచెల్లెళ్ళతో తనభర్త మాట్లాడినా, చనువుగా వున్నా కూడ తప్పుపట్టదు ఎందుకంటే ఆమెకది సహజంగానే వున్నట్టు అనిపిస్తుంది. ఇంతమాత్రం సహృదయత పురుషులలో వుందా?

మొన్న ఒకనాడు టి నగర్‌లోవున్న మా స్నేహితురాలింటికి వెళ్ళాను. మధ్యాహ్నం 11 గంటలకు వెళ్ళాను తలుపులన్నీ తీసే వున్నాయి. ఆమెభర్త ఆఫీస్‌కి వెళ్ళివుంటారు. ఆమె ఒక్కతే లోపల ఎక్కడో వుండి తలుపులన్నీ ఇట్లా తీసిందేమా అని ఆలోచిస్తూ గదిలోకెళ్ళాను. మంచంమీద బోర్ల పడుకొనివుంది నిద్రేమోనని ఒకటి, రెండుసార్లు పిలిస్తే జవాబు లేదు దగ్గరకెళ్ళి చూస్తే—ఎక్కెక్కి ఏడుస్తోంది! ఇదేమిటేమంటే చెప్పదు ఆఖరికి చెప్పిందికథ—ఆమెభర్త ఆనాడాఫీస్‌కి సెలవుపెట్టారట. సరే భోజనాలయ్యాక మామూలుగాహస్కా గొడుతూవుంటే సినిమాయాక్టర్సు మీదకు తిరిగింది ప్రసంగం. తన అభిమాన నటుడు గురించి చెబుతూ, అతనెంతో చక్కగా యాక్టుచేస్తాడంది. ఏదో అతన్ని గురించి నాలుముక్కలు పొగిడిందట ఇందులో పెద్ద తప్పేముంది. ఏదో సందర్భం వచ్చింది కనుక, అతను నటనాకౌశల్యం కలవాడు కాబటి పొగిడింది. అంతేకాని అంతమాత్రానికే కట్టుకున్న భర్తకు డైవర్సు ఇచ్చి అతని వెంటపడ్తానని అన్నట్టు అపార్థం కల్పించుకుంటే ఎట్లా? ఇంతకూ అసలు విషయమేమిటో చెప్పలేదుకదూ. ఏముందీ, ఈమె ఆ ఫలానా నటుడిగురించి నాలుగు ముక్కలు

(48-వ పేజీ చూడండి)

# మన సమాజంలో భర్తృవిహీనల దుస్థితి

బార్బారా స్మిత్ వ్యాసంలో భర్తృవియోగంలో ఏర్పడే శూన్యస్థితిని గురించి రాస్తూ ఆమె ఎంతో ధైర్యంగా వున్నానని సమాధాన పరుచుకోబోయినా, ప్రతిదానిలో ఏదో వెలితి కనిపిస్తూనే వుందన్నారు. ఒక్క తోడు లేదన్న లోటు తప్పితే, ఇంటా, బయటా ఏ ఆంక్షలు లేని అమెరికన్ మహిళల సంగతే అలా వుంటే, ఆ బాధే దుస్సహం కాగా, దానికి తోడు, సమాజం విధించే ఘోరశిక్షలు తలుచుకుని ప్రతి హిందూ స్త్రీ ఎంత తల్లడిల్లిపోతుందో వేరే చెప్పాలా?

అసలు ఈ కేశఖండన మనేది, మన కి ప్రమాణమైన వేదాలలో రాసివున్నదా అని? అమధ్యనే మీమాంస వస్తే వేదాలలో లేదు అన్నారు అవి చదివినవారు. ఇది మధ్య కాలంలో తన స్త్రీని, ఇంకెవరూ చూడకుండా చేసేందుకు చేసిన ప్రయత్నమే. ఏమైనా ఇప్పుడు ఈ ఆచారాలు కొంత వరకైనా తగాయనే చెప్పాలి. వీరేశలింగం పంతులుగారి ధర్మమా అంటూ ఆయన చేసిన వితంతూద్వాహాలవల్ల, ఆయన రచనలవల్ల సంఘంలో ఈ విషయాలలో చాలా మార్పులు వచ్చాయి. 25 ఏళ్ళక్రితం అవుతే ఎంత చిన్నపిల్ల అయినాసరే శుభ్రంగా జుట్టు తీయించి గాజులు పగలగొట్టి సైను పంచ ఒకటి ఇచ్చి ఇంటెడు చాకిరీ చేయించికుని రాత్రిళ్లు కూడా భోజనం మాన్పించి, మధ్య మధ్య, ఏకాదశీవ్రతాలు చేయిస్తూ ఆమెను బ్రతికివున్నా, రోజూ చావుకోసం, ఎదురు తెన్నులు చూసేదానిలా చేశారు. ఈమధ్య ఎక్కడో మరీ పల్లెటూరి వైదిక కుటుంబాలలో తప్ప ముప్పాతిక మూడు వంతులు ఈ ఆచారాలు నశించాయనే చెప్పవచ్చు.

పోతే, సనాతనులవాదన ప్రకారం స్త్రీని ఇలా అందవికారంగా చేస్తే చెడిపోయేందుకు వీలులేదు. తద్వారా సమాజానికి రక్ష అనేకదా! సాధారణంగా, పురుషుడు తన భార్యను మరిచినంత తేలికగా స్త్రీ తన భర్తను మరవలేదు. ఒక పని మనం మంచి వుద్దేశంలో చేసినా దానివల్ల లాభం ఎక్కువా, నష్టం ఎక్కువా అని ఆలోచించాలి. ఎవరో ఒకరిద్దరు కాలుజారవచ్చుననే భయంకొద్దీ పిల్లలు మొదలుకొని వృద్ధుల దాకా ఒకటే ఆచారమేనా? మానవత్వం మీద అంత నమ్మకంలేక, స్త్రీ విషయంలో ఇన్ని ఆంక్షలు విధించే సంఘం పురుషుని విషయంలో మాట్లాడదేమి?

నిజంగా శాస్త్రాలు పురాణాలు పరిశీలిస్తే, పురుషున కొక ధర్మం, స్త్రీకి ఒక ధర్మం విధించలేదు. దీనికి తార్కాణం, ప్రత్యక్షంగా ఏకపత్నీవ్రతం ఆదరించిన రామచంద్రుడే స్త్రీకి, పాతివ్రత్యం, ఎంత అవసరమో, అంత అవసరము, పురుషునికి ఏకపత్నీవ్రతమని నిరూపించారు.

[illegible]

ఒక కాలంలో మంచివుద్దేశంతోనే ఏర్పడినా కాలం మారిన కొద్ది ఆచారాలుకూడా మారుతాయి. ఇప్పటికాలం ప్రకారం చిన్నతనంలో భర్తపోతే చాలామంది వివాహాలు చూస్తే జుట్టువున్న స్త్రీ గనక, స్నానంచేసినప్పుడు ఆ కొనలనుంచి నీళ్లుకారితే ఎన్ని వెంట్రుకలు వున్నాయో అన్ని ఏళ్లు ఆ భర్త నరకం అనుభవించవలసి వుంటుంది అని చెప్తారు. తనుచేసిన చెడ్డపనులవల్ల కాక కేవలం జుట్టుమీదే ఆధారపడి వుంది నరకం అవడం అది ఏరకంధర్మం అవుతుంది? వీటిని గురించి నిజంగా ఆలోచిస్తే న్యాయానికి ధర్మానికి, వాదానికీ, కుదరవు. భర్తపోయిన బాధకన్నా కేపటినుంచి తనకు పట్టబోయే, నీచస్థితినిగురించి ఎక్కువగా విచారిస్తారు. పెళ్లికిగాని, పేరంటానికిగాని వెళ్ళటానికి లేదుకదా! ఆమెఎదురవుతేనే అశుభకరంగా భావిస్తారు. అప్పటిదాకే నలుగురితో కూచుని మాట్లాడుతున్నామే ఎవరైనా బొట్టుపెటడానికి ఇంటికివస్తే పక్కకి తొలగిపోవలసిందేకదా!

ప్రతిస్త్రీ తన ప్రాణసమానంగా ప్రేమించే చేసుకుంటున్నారు. సాధారణంగా, మధ్య వయస్సులోవుండి ముగురు నలుగురు పిల్లలున్న స్త్రీలు, ఎలాగు తప్పుదారిన పడడానికి ఇష్టపడరు. వృద్ధులైన స్త్రీల విషయంలో, ఎలాగూ భయం అక్కర్లేదు కదా! అందుకని, ఈ ఆచారాలు లేకపోతే సంఘం తలక్రిందులయిపోతుందనేభయంఅక్కర్లేదు.

కాగా, మతంమీద నమ్మకల ప్రకారం పువ్వులను కంటితో చూడవలసిందేకాని పెట్టుకు నేందుకు వీలులేదుకదా! అథవా జుట్టువున్నా జడ వేసుకోకూడదు. సృష్టిలో భగవంతుడు ప్రసాదించిన జుట్టును తీయించడం, అన్యాయం. మనిషిపోయి బాధలో వున్న వారినిదయగాచూసి వాళ్ళని సంతోష పరచాలేగాని మనంకూడా వాళ్ళను తిన బాధలు పెట్టిఅవమానించడం అన్యాయం. ★

# వంటలు

## బంగాళాదుంపలతో కొన్ని పిండివంటలు

బంగాళాదుంపలని ఈ ప్రక్క ఆలుగడ్డలని అంటాము. ఈ దుంపలు అన్ని కాలములలోను దొరుకుతాయి. దుంపలన్నిటిలో బంగాళాదుంపలతో అన్ని రకముల రుచిగల పదార్థములను తయారుచేయవచ్చు. అన్నములో ఆదరువుగా కూరలేగాక, తీపి కారం పిండివంటలు, నిలవ పదార్థములగు వడియాలు, వరుగులు పెట్టవచ్చు.

### ఆలుగడ్డ హల్వా

అర్ధశేరు ఆలుగడలు, పావుశేరు చక్కెర, అర్ధపావు నెయ్యి, ఇలాచీపొడి, జీడిపప్పు, బాదం, కిస్‌మిస్ కూడ వేసుకోవచ్చు.

చేయువిధము:—ఆలుగడ్డలు మంచివి తీసుకుని, నాలుగుముక్కలుగ కోసి ఉడక బెట్టి, తొక్కుతీయాలి. ఒల్చిన ముక్కలు రోటిలోవేసి పలుకులు లేకుండా, మెత్తగా రుబ్బి తీసుకోవాలి. చక్కెర లేతపాకం పట్టుకుని అందులో రుబ్బిన ముద్దవేసి బాగా కలపాలి. సన్నని సెగమీద, కలియబెడుతూ నెమ్మదిగా ఉడకనివ్వాలి. కలుపుతూ నెయ్యి పోయాలి. ఒక పళ్ళెమునకు నెయ్యి రాసి, హల్వా ఉడికి గట్టిపడుతున్నపుడు దించి, ఈ పళ్ళెములో పరవాలి. పైన యిలాచీపొడి చల్లాలి. బాదం జీడిపప్పు ముక్కలు పొడవుగాకోసి, హల్వాపైన పరుస్తే అందముగా కనబడుతుంది. చల్లారిన తర్వాత ముక్కలుకోసి, తింటే రుచిగా ఉంటుంది. నెయ్యిమంచిదైతే హల్వా రుచిగా ఉంటుంది.

బంగాళా దుంపలతో కారం పిండి వంటలు చాలా రకములుగా చేయవచ్చు. ఇప్పుడు కొన్ని క్రొత్త రకాలు చెప్తాను. అంటే మరాఠీ ఫాళు చేసేవి.

### మసాలవడలు

ఒక పావు ఆలుగడ్డలు, అర్ధపావు శెనగపప్పు, పది పచ్చిమిరపకాయలు, రెండు చిన్న ఉల్లిపాయలు, అల్లం కొత్తిమిర మసాలపొడి, చిన్న (ఎండు) కొబ్బరి ముక్క, ఉప్పు, 1 పావు డాల్డా లేకనూనె

ఆలుగడ్డలు ముక్కలుగ కోసి, కడిగి, ఉప్పు, చిటికెడు కారం, పసుపువేసి ఉడకబెట్టాలి. నీళ్ళు ఇగిరిన తర్వాత దించి తొక్కు తీయాలి. శెనగపప్పు వేయించిగాని అర్ధగంట నీటిలో నానబెట్టిగాని, మెత్తగా రుబ్బుకోవాలి. ఆలుగడ్డముక్కలు మెత్తగా కాటుకలానూరి తీసుకోవాలి. పచ్చిమిరపకాయలు, అల్లం, కొబ్బరిమెత్తగానూరి, ఉల్లిపాయలు సన్నని ముక్కలుగాకోసి కచ్చాపచ్చాగా నూరాలి. పప్పులోతప్ప దేనిలోగాని నీళ్ళు చల్లకూడదు. అన్ని ఒక గిన్నెలో తీసుకుని, తగినంత ఉప్పు, మసాలాపొడి, కొత్తిమీర, ఒక గరిటెడు నెయ్యివేసి బాగా కలపాలి. మసాలవడలు మాదిరిచేసి, డాల్డాలో వేయించితీస్తే కరకరలాడుతూ బావుంటాయి.

### బటాటపోళి

అర్ధశేరు ఆలుగడ్డ, పావుశేరు తెల్లని గోధుమపిండిగాని, మైదాపిండిగాని, పచ్చిమిర్చి, అలం, మసాల, కొత్తిమీర.

పిండిలో చిటికెడు ఉప్పు, కొద్దిగా నెయ్యివేసి పూరీల పిండిమాదిరి తడిపి ఒక గంట నాననివ్వాలి. ఆలుగడ్డలు ముక్కలుగాకోసి, కడిగి, ఉప్పు, కారం, పసుపు పచ్చిమిర్చి, అల్లంనూరిన ముదవేసి, నీళ్ళు చల్లి, ఉడకనివ్వాలి. తొక్కుతీసి, పలుకు లేకుండా మెత్తగా పిసికి, బాణలిలో కొద్దిగా నెయ్యివేసి, వేయించాలి. కొత్తిమీర, మసాలవేసి దించాలి.

పిండి చిన్నముద్దలుగాచేసి, అరచేతి వెడల్పు పూరి వత్తిమధ్యలో ఆలుగడవేపుడు కొంచెము పరచి, ఇంకొక పూరీ, పైనవేసి, చుట్టూ వత్తి పీటమీదవేసిపూరీమాదిచేయాలి. ఒకళ్ళు చేస్తూ ఉంటే, ఒకళ్ళు బాణలిలో డాల్డావేసి ఒక్కొక్కటి కాల్చాలి.

లేదా ఈ పూరీలను కాస్త పెద్దగావత్తి, రొట్టెమాదిరి పెనంమీద కాల్చవచ్చు. కాని డాల్డాలో వేయిస్తేనే రుచిగా ఉంటుంది.

### కట్‌లెట్

శేరు ఆలుగడ్డలు, పావు బీన్సు, పావు టొమాటో, పచ్చిబటాణీ, (కాలీఫ్లవరు, క్యాబేజీ ఉన్నా వేయవచ్చు) నెయ్యి, మసాల, అల్లంవెల్లుల్లి, గసాలు కొబ్బరి.

ఆలుగడ్డలు ఉడికించి జిగురు వచ్చేవరకు కాటుకలా రుబ్బాలి. టొమాటో పైతోలు తీసి, బీన్సు అన్నీ సన్నని ముక్కలుకోసుకుని, తాళింపువేసి మసాలకూర తయారు చేయాలి.

ఆలుగడ్డ రుబ్బుతున్నప్పుడే కాస్త ఉప్పు వేసి రుబ్బాలి. నిమ్మకాయంత ముద్దతీసుకుని, అరచేతిలో పూరీమాదిరిచేసి, మధ్యన మసాలకూర పెట్టి మడవాలి. లేదాగుండ్రంగా మూసి డాల్డాలో కాల్చాలి. ఆలుగడ్డలు కాటుకలా రుబ్బనియెడల నెయ్యిలో విచ్చిపోతాయి. కొందరు పెనంమీదకూడ కాల్చుతారు. ఎట్లా చేసినా బావుంటాయి.

సి. రాధ, (హైదరాబాద్.)

## గోరుచిక్కుడుకాయతో... వడియాలు, వరుగులు

ఇవి బాగా గోరుచిక్కుడుకాయలు వచ్చేరోజులు. ఈ కాయను రకరకాలుగా కూరలు వండుకుంటారు. గోరుచిక్కుడు కాయలతో వడియాలు, వరుగులు చేసుకుంటే కొన్నాళ్ళు నిలవా వుంటై, చాలా రుచిగాకూడా వుంటై.

### వడియాలు

కావలసిన వస్తువులు: అర్ధశేరు మినపపప్పు, అరవీశె గోరుచిక్కుడుకాయలు, పచ్చిమిరపకాయల కారం, ఉప్పు, చిన్న ఇంగువపలుకు.

మినపపప్పు రెండు మూడు గంటలు నీళ్ళలో నాననిచ్చి ఆపైన దానిని మెత్తగా రుబ్బుకోవాలి. గోరుచిక్కుడుకాయలు పీచులేకుండా చిన్న చిన్న ముక్కలుగా తుంపుకుని కూరకు ఉడకేసినట్లు ఉడకబెట్టాలి. దింపి నీరు ఓడిన తరువాత వాటిని ఒక చిన్న ఇంగువపలుకు గూడా వేసి మెత్తగా రుబ్బాలి. రుబ్బి వుంచుకున్న పిండిలో గోరుచిక్కుడుకాయలముద్ద, పచ్చిమిరపకాయల కారం వేసి బాగా కలపాలి. దీన్ని వడియాలుపెట్టుకుని ఎండిన తరువాత వేయించుకుంటే కరకరలాడుతూ బాగుంటై. ఉప్పు, పప్పురుబ్బేటప్పుడే వేసి రుబ్బవచ్చు. పచ్చిగోరుచిక్కుడుకాయలు కూడా రుబ్బి కలపవచ్చుకానీ ఉడకబెట్టి వార్చినవే బాగా గుల్లవిడుస్తయి.

### వరుగులు

మనకు కావలసినన్ని గోరుచిక్కుడు కాయలు చిన్న చిన్న ముక్కలుగా తుంపి ఉడకబెట్టి వార్చి, ఎండబొయ్యాలి. పెళపెళ ఎండిన తరువాత డబ్బాలో ఎత్తిపెట్టుకోవాలి. వీటిని నూనెలో వేయించి ఉప్పు, కారం చల్లితే చాలా రుచిగావుంటై. అన్నంలోకి ఆధరువుగా పనికొస్తయి.

—తెన్నేటి అహల్యాదేవి,
హనుమకొండ.

# వనితా వాణి



## కోపదారి మనుష్యులు

రుక్మిణిగారు కోపముగూర్చి వ్రాశారు. వారు అన్నిరకాల కోపాలగురించి బాగానే వ్రాశారుకాని 'ఒకరకము కోపము' మాత్రము వ్రాయలేదు. దానినిగూర్చి నేను వ్రాస్తున్నాను. ఈ కోపము వచ్చినప్పుడు కొంతమంది (వారు వీరుకూడా) ఇంట్లో సామానులు విసిరేస్తుంటారు. మా బంధువు ఒకతనున్నాడు. అతను ఎప్పుడు నవ్వుతూ వుంటాడు. అతనిని చూస్తే అసలు కోపము ఎప్పుడు రాదేమో ననిపిస్తుంది. అతనికి కోపము వచ్చినప్పుడు చూడాలి, ఆ కోపములో ఏమిచేస్తారో అతనికే తెలియదు. అసలు ఆకోపము ఎంతోసేపుండదు రెండు, మూడు నిముషాలుంటుంది. ఒకసారి అతనిభార్య కాఫీ యిచ్చిందట, అది బాగోలేదట. 'నీ మొహములాగానే వుంది ఈ కాఫీ' అని కోపము వచ్చి ఆగ్లాసు విసిరివేశారట. మరియొకసారి అన్నం వడ్డిస్తూ కొంచమన్నం వేయమంటారా అని అంది: ఆయన వద్దన్నాడు. మరీ అంత తక్కువ తింటే ఎట్లా అని కొంచెమన్న మొడ్డించిందట. దానితో ఆయనకు కోపమువచ్చి అన్నముతినే కంచం విసిరివేశారట. ఇటువంటి కోపాలను అర్థంలేని కోపమంటారు. ఈ అర్థంలేని కోపానికి పెద్దకారణం ఏముండదు. చిన్న, చిన్న విషయాలకు కోపమువస్తుంది. ఈ కోపము వచ్చినప్పుడు వారు ఏ పనిచేస్తుంది వారికే తెలియదు అదిగాక దానివల్ల ఏమినష్టమో గుర్తించరు. ఆకోపము తగ్గినతరువాత ఆ వస్తువు పాడైపోయినదని బాధపడతారు. ఆ కోపములో సామానులు పాడైపోవటమే కాకుండా సంసారాలు కూడ పాడైపోతూవుంటవి. ఇలాగే అనేకకోపాలు చిన్న కారణాలవల్ల వస్తుంటవి. ఇదికాక ఒకరిమీద కోపము మరియొకరిమీద చూపుటవల్ల నిరపరాధులైన వారు బాధపడవలసి వస్తుంది. కొంతమంది మాస్టార్లు ఇంట్లో కోపము స్కూల్లో పిల్లలమీద చూపిస్తూ వుంటారు. ఏదో ఒకవంక పెట్టి పిల్లలను మాస్టార్లు కొట్టుతూవుంటారు. ఇట్లాగా ఒకసారి మా అక్కయ్య వంట చేయుట ఆలస్యమైనది. మా బావగారు ఆఫీసు టైము అయిపోయిందని కేకలువేసి వెళ్ళినారు. ఆ సమయానికి చాకలి బట్టలకోసం వచ్చింది. అప్పుడు మా అక్కయ్య బావగారిమీద కోపమంతా చాకలిదానిమీద చూపించింది. నీకు బట్టలు తీసుకెళ్ళడానికి వేళా పాళా లేదు. ఎప్పుడుపడితే అప్పుడే వస్తావు అని అంటుంటే పాపం చాకలిది మాట్లాడలేక వెఱ్ఱి చూపులు చూసింది.

—శ్రీహరి, విజయవాడ.]

* * *

## సహించరాని హింస

శ్రీమతి విద్యగారు వ్రాసిన భర్తృవిహీన దుర్భరస్థితి చదివి చాల దుఃఖించినాను. క్రిందటి సంవత్సరమే మావారు పోయినారు. ఆయన పోయిన 10వ రోజు గురువారం అయినది. ఏవో లాంఛనాలు జరిపిన తరువాత నన్ను గురువారం, శుక్రవారం ఎవరూ చూడకూడదని ఒకమూలగదిలో వుంచమని మా బంధువు ఒకావిడ అన్నారు. నాకు 30 సం. ఇద్దరు ఆడపిల్లలు. పెద్దపిల్ల వయస్సు 12 సం॥ చిన్నపిల్లకి 8 నెలలు. చిన్నపిల్ల నన్ను వదలి వుండలేదుకదా! పెద్దపిల్లకూడ నన్ను చూడందే వుండనని ఒకటే ఏడుపు. ఇలాంటప్పుడు నేను ఆ రెండురోజులు మూలగదిలో ఎలాగు వుండగలను. మా అమ్మ, నాన్నగారు అలాగు రెండు రోజులు కనబడకుండా వుంచలేమని అన్నారు. 12 రోజు శనివారం ఆ లాంఛనాలు జరిపించినారు. ఇలాగు మా అమ్మ, నాన్నగారు చేసినందుకు మా పొరుగు ఆవిడ ఎన్ని తిట్టిందో తెలియదు. అసలే వారు పోయినందుకు సగం కృంగిపోయివుంటే ఇంకా ఈ లాంఛనాల కోసం బంధువులు ప్రాణాలు తీసేసారు. ఈ వనితావాణిలో "భర్తృవిహీనల దుస్థితి" వ్రాసి ఈ "అమ్మలక్కల" కళ్ళు తెరిపిస్తారని ఆశిస్తున్నారు.

—ఒరిస్సా సోదరి]

* * *

కొత్తపల్లి రాజ్యలక్ష్మిగారు వ్రాసిన వ్యాసాన్ని ఆమూలాగ్రంగా చదివాను. ఇంత గొప్పవ్యాసం వ్రాసిన భారత నారీమణులలో వీరే మొదటివారని ఘంటాపథంగా చెప్పవచ్చు. బహుశా వీరు పూర్వ పతివ్రతామతల్లుల గాథలను మరచిపోయారనుకుంటాను. భర్త చనిపోయినా భార్య తన మంగళసూత్రాన్ని చూచి తన బాధ కొంతవరకు మరచిపోగలరని వ్రాశారు. మంగళసూత్రాన్ని చూచినంత మాత్రాన వారిబాధ ఉపశమిస్తుందా? మనస్సులో ప్రేమలేందే కౌగిలించుకుంటె వస్తుందా? సావిత్రీదేవి, అనసూయ మొదలైన పతివ్రతలు కష్టసమయాల్లో "స్వామీ నా మంగళసూత్రాన్ని కాపాడి పసుపుకుంకుమ నిలబెట్టు"మని దైవాన్ని ప్రార్థించేవారు. స్త్రీ అయికూడా రాజ్యలక్ష్మిగారు ఇంత చిన్నవిషయాన్ని ఎలా మరచిపోగలిగారో అర్థం కావటం లేదు. ఇకమీద నిలాటి వ్యాసాలు వ్రాసి మీ సోదరీమణులే మిమ్మల్ని దూషించకుండా చేసుకుంటారని ఆశిస్తూ వున్నాను.

—మురళీధరరావు, (సంగం) వుంటపల్లి]

* * *

## మలబారు అప్పడాలు

మేము నాగార్జునసాగర్ వచ్చిన కొత్తలో మా అబ్బాయి ఒక అప్పడాల ప్యాకెట్టు తీసుకువచ్చాడు. నేను మొదట బజారుసరకు బాగుండదని అన్నానేకాని అవి వాడిన తరువాత నా అభిప్రాయాన్ని మార్చుకోవలసి వచ్చింది. ఒకసారి నిప్పుమీద వుంచగానే అవి వెంటనే వేగిపోయాయి. రుచికి చాలా బాగున్నాయి. అవి ఎలా చెయ్యాలా అని ఆలోచించి రెండుమూడుసార్లు ప్రయత్నించి చివరికి విజయాన్ని సాధించాను. ఇది సునాయాసమైన పని.

దీనికి కావలసిన పదార్థాలు.

పెసలు 1/4 శేరు, కారం – రెండు చెంచాలు, బియ్యం 1/8 శేరు, ఉప్పు.

పెసలు మెత్తగా పిండిగా విసురుకోవాలి. తరువాత బియ్యంకూడ విసురుకొని, రెండూ కలిపి కారం బాగా తినేవారు మూడు చెంచాల కారము, తక్కువగా తినేవారు ఒకటి రెండు చెంచాల కారము, తగినంత ఉప్పు, వేసుకుని, పిండి, పప్పు నూనెలో కలిపి, బాగా పిదించి చిన్న ఉండలుగా చేసుకోవాలి. ఒక పీటమీదగాని చెక్కమీదగాని



# వనితావాణి



కొంచెము నూనెరాసి కొంచెం వరిపిండి చల్లి అప్పడాల కర్రతో అరిసెలంతగా ఒత్తి ఎండలో వుంచాలి. ఇవి బాగా ఎండిన తరువాత డబ్బాలో వుంచుకొని అవసరం వచ్చినప్పుడు వేయించుకోవచ్చును. ఒకసారి చేసి చూడండి!

—కె. యల్. కాంతం, విజయపురి]

* * *







## చాలా తక్కువ

కె. వి. శకుంతలగారు రాసిన "స్నేహం" వ్యాసంలో అభిప్రాయాలు నా కెక్కువగా నచ్చలేదు. సాధారణంగా ఓ యువతి తన స్నేహితురాలిని మరో స్నేహితురాలికి పరిచయం చేసినప్పుడు కొత్తగా స్నేహమైన ఆ స్నేహితురాళ్లు కాస్సేపైనా సరదాగా మాట్లాడుకోకుండా ఊరొక్కరు. తను యిద్దర్నీ పరిచయం చేసిన ఆ యువతిని మరిచేపోయి వాళ్ళిద్దరే మాట్లాడుకుంటారు. కాని కొత్త స్నేహితురాలితో పరిచయమై మాట్లాడక పోవడమే గాక అసలు స్నేహితురాలితో కూడా మాట్లాడకుండా ఉండే వారు చాల తక్కువ. కావున శకుంతలగారి అభిప్రాయం చాలా తక్కువ మందికే వర్తిస్తుందని భావిస్తున్నాను.

—"కళ", మంచెరియాల్]

* * *







## ఉపాయం

ఈ మధ్య మా యింటికి ఒకరువచ్చి డిజైన్సు ఏవైనా ఉంటే యిమ్మని అడిగినారు. మా యింట్లో అన్నీ టేబుల్ క్లాత్స్ మీద, పిల్లోకవర్స్ మీద కుట్టినవే ఉన్నవే కాని కాగితములమీద లేవని చెప్పినాను. అప్పుడు ఆవిడ పోనీండి ఆ కుట్టిన గుడ్డలే యిమ్మన్నారు. పోనీ ఆవిడ చూస్తారేమోనని ఒక అరడజను పిల్లోకవర్సు అరడజను టేబుల్ క్లాత్స్ ఎంబ్రాయిడరీ కుట్టినవి తీసుకునివచ్చి ఆవిడముందు పడేశాను. ఆవిడ అవి అన్నీ చూసి "మీ గుడ్డలేవీ పాడవకుండా వీటిమీదనున్న డిజైన్సు తీసుకుంటానని చెప్పారు. గుడ్డలు పాడవకుండా ఉంటే నాకేమి అభ్యంతరం లేదని చెప్పాను. ఆవిడ కార్బను పేపరు తీసుకుని నల్లగా ఉన్నవైపు పైకి వచ్చేటట్లు బాగా నలిపి ఉండక్రింద వచ్చేటట్లుచేసి డిజైను కుట్టిన గుడ్డమీద తెల్లకాగితము పరచి ఈ కార్బనే ఉండతో బాగా నల్లగా ఉంటేటట్లు చేశారు. వెంటనే గుడ్డమీద ఉన్న డిజైను కాగితముమీద అచ్చుగుద్దినట్లు పడినది. చాల తేలికగూడను. మా గుడ్డలేమియూ పాడవలేదు. అందరిండ్లల్లోను కాగితముల మీదే డిజైన్సు ఉండుట అరుదు. కుట్టినవి ఉంటే ఈ విధముగా తీసికొనుట చాల సులభము. ఆవిడ నా దగ్గరనున్న డిజైన్సు అన్నియు ఒక్క అరగంటలో తీసుకుని వెళ్ళినారు. ఈ పద్ధతి చాల బాగున్నదని పదిమందీ నేర్చుకుంటారని పత్రికకు పంపాను. ★

—కె. సత్యవతీదేవి, ఏలూరు]

# ★ దగాపడిన తమ్ముడు ★

(31-వ పేజీ తరువాయి)

కళ్ళల్లో నీరు అలుముకుంది... ఆ శోకంతో మనసులో "అమ్మా నీలమ్మతల్లీ ... కనికరించుతల్లీ... ఈ పనిసెయ్యలేను...నాకేదో న్యాయంగా బతికే బతుకు తెరువు చూపించు."

"ఏడుస్తున్నాడురా" అన్నాడా చంద్రయ్య! "అలాగే మొదటి రోజున మనకి తెలుసురా! ఆ బురదలో దిగకముందు మనుషులుగా వుంటాం...బురదలో గెంతితేగాని మనకి జరగదు. ఒకసారి బురదలో గెంతాక యేమైనాం? పందులమైనాం కదా!"

కొంతసేపు మౌనం ముగ్గురినీ ఆవరించింది. తరవాత అన్న లేచి నిల్చొని "లే అన్నా! నివ్వు దొంగతనం సెయ్యక! మా యిద్దరమే సేస్తాం. నివ్వు దూరాన్న వుండు. నీకు పని దొరికినంతదాక సచ్చిపోకండా బతకడానికి మాదగ్గర యెంతో కొంత తీసుకో—అయితే యిదిగో" "అంటూ అన్న చంద్రయ్య అరచేతిని తన అరచేతిమీద వేసుకొని పుల్లయ్య చేతిని ఆ పైనవేసి అనండి "తేముడు తోడుగా, మాలో యే ఒక్కరం దినాలు బాగులేక దొరికిపోయినా మిగతా యిద్దరి గుటూ యెంతమాత్రం సెప్పము" మళ్ళీ రెండుసార్లు ఈ ప్రమాణ స్వీకరణ చెయ్యించాడు. పుల్లయ్య తొలిసారి బెణుకుతూ వణుకుతూ అన్నాడు. రెండోసారి బెణుకు తగ్గి మూడోసారి స్పష్టంగా అన్నాడు

ఈ తంతు అయ్యాక ముగ్గురూ కలిసి బయలుదేరారు. చంద్రయ్య యిదివరకే ఆ రాత్రి యెక్కడ కన్నం వెయ్యాలో తేల్చుకొనే వున్నాడు. ఆ సందులోనికి వెళ్ళి వున్న ఒకే ఒక మ్యునిసిపల్ యెలక్ట్రిక్ దీపం రాయితో బల్బు బ్రద్దలు చేసాడు. చీకటి. అన్న పుల్లయ్యను సందు మొదట్లో ఒక చెత్తల డొక్కు చాటులో కూర్చోబెట్టి గస్తీ పోలీసులుగాని యింకెవరివల్లగాని వచ్చే అపాయాన్ని రాకుండా తను యెటువంటి సైగ చెయ్యాలో యెలా పారిపోవాలో చెప్పాడు.

ఇందులో చంద్రయ్య ఆరితేరిన మనిషి-పుల్లయ్య ఆ మూల కూర్చున్నాడే కాని కాళ్ళు గజగజ వణకిపోతున్నాయ్. శరీరమంతా ఆ వణుకు ఆవరించింది. తనకు యెక్కడలేని ఆవేశం, బెంగా ఆవరించాయి. దొంగలు పడే తన వూరో యిలా వూరుకొనేవాడా? ఎలాగస్తీ తిరిగి మరీ పట్టుకొనేవాడు? అలాంటిది తను కళ్లారా చూస్తూ వూరకుంటాడా? గట్టిగా "దొంగలు...దొంగలు" అని అరవాలనుకున్నాడు. నాలిక చివరివరకూ వచ్చింది. కానీ తన ఒట్టు అన్నమంచితనం బాధలు అన్నీ ఒక్కసారికూడి నోటిని నొక్కేసాయి.

వీళ్ళిద్దరూ తిరిగి రావడానికి యెంతసేపో పట్టలేదు. ముగ్గురూ మళ్లీ పక్క పక్క మొదటి కాలువగట్టుకు వచ్చారు. చంద్రయ్యకు యీవేళ పనియేం సంతోషంగా లేగు. బనియాను లోపలిజేబూనించి యేదో బంగారం వస్తువు. ఇంకా యేదో వుంది బరువుగా జేబులో. అది కూడా తీసాడు కత్తి...పుల్లయ్యకు భయంవేసింది. దొంగలకు దొరికిపోయినట్లుగా అనిపించింది.

తెల్లవారుఝాముకావడానికి యింకా రెండు గంటలు పోవాలి...అన్నీ రేత్తిపొద్దున్న కలుసుకుందాం అన్నాడు. పుల్లయ్య ఇంటివేపు బయలుదేరాడు.

త్రోవలో యెన్నో అనుకున్నాడు. రేపు యీడబ్బు తీసికెళ్ళి దాని సేతిలో యెలాగ పెట్టాను? అది యెలాగొచ్చిందని అడగదా? పెళ్లిరోజు జ్ఞాపకం వచ్చింది. తను ఆరించుకున్నదాంట్లో పెళ్లాంకి సగం యిచ్చి తీరాల—అది పాటించకపోతే పెళ్లినాటి ప్రమాణం జవదాటాడన్న మాట! మరి రేపు యీ పాపిష్టి డబ్బు కురావను కున్నాడు.

## 36

ఉదయం అయ్యవేపు చూసి మల్లు అలక సాగించాడు. అయ్య పిలిచినా మాటాడ

# ★ దగాపడిన తమ్ముడు ★

లేదు. నీలి యెంత కూలిచ్చారని అడిగింది. వెంటనే జవాబు చెప్పకపోతే చిక్కని "మూడు రూపాయాలు" అన్నాడు. ఆమె సంతోషంగా "రోజూ వుంటూదాపని" అని అడిగింది. "ఏ పా లే—దొరికిన్నాడు సేస్తాను—లేనివాడు లేద" న్నాడు.

ఈ అబద్ధాలు యెంతో బలవంతాన అన్నాడు. అన్నాక భయం వేసింది. ఇప్పటికీ అప్పటికీ డబ్బు చేతపెట్టక పోవటంవల్ల నీలి "కూలివ్వనేదా?" అని ప్రశ్నించింది.

"ఇస్తారు!"

"ఎప్పుడు?"

"ఈ వేళే—"

అలా కాస్సేపు నిద్దర పోవాలనిపించింది. ఇంట్లోనే చాపవేస్తూ మలుని పిలిచాడు. కొడుకు రాలేదు. కూతురు దగ్గరగానే ఆడుకుంటోంది.

"అయ్యో! యీ వేళ తీసికెళ్తానులేరా... రా" అన్నాడు.

కొడుకు వచ్చేడేగానీ నవ్వలేదు. కాస్సేపు నవ్వించడానికి ప్రయత్నించాడు ఇంతలో పొరుగమ్మ పెరటినుంచే నీలిని కేక వేసి నోరు పెట్టుబిషయమై దాటీగా విడిచి పెట్టింది. మూడు రూపాయలూ ఆ వేళ యివ్వాలని పోరు. అగొంతుకవిని పుల్లయ్యకు పౌరుషం వచ్చి గప్పున లేచి.

"ఎక్కడ పారిపోయినోళ్ళలాగ మాటాడతన్నావు"

"అంత పౌరుషం అయితే పారీ కూడదా?'

"పారీకండా వుంచుకుంటా మేంటి?"

"ఎప్పుడోయిస్తే యేలాగౌతాది? ఎందరో యింటికోసం వస్తన్నారు—పౌరుషం యేనోడివైతే నెల అవగానే అది పారీ కూడదా?"

నీలి జోక్యంచేసుకొని భరను వారించి లోనికి పంపించింది. ఆవిడ గొంతుకమాత్రం ఆగలేదు. పుల్లయ్యకు యెక్కడలేని అభిమానం కలిగి గబగబ అన్న యింటికి పరుగెత్తి "మూడురూపాయలు కావాలన్నా" అన్నాడు. అంతా విని చంద్రయ్య దగరకు వెళ్ళి తెచ్చియిస్తూ చాటుగా మెల్లగా "రాతిరిది యింకా అమ్మలేదు దొంగ వస్తువు సగానికి సగం - ఆ కంసాలోడికి అశ - అడి బయం అడిది - నీ వాటాకి పది రూపాయలు వస్తాయని సెంద్రయ్య సెప్పేవాడు."

"ఇది సెయ్యి బగులు - ఆ డబ్బు మాటెందుక" న్నాడు పుల్లయ్య

ఇంటికి వచ్చి నీలి చేతికిచ్చి "దాని ముకం మీదకొట్టే" అన్నాడు. ఆవిడ ఆ మాటవిని నానాగోడుబ చేసింది నీలి బ్రతిమాలింది. "ఎందుకమ్మా - ఎవురు యెన్నాళ్ళుండిపోతాం - ఈమాత్రం దానికి నోరు పాడు సేసుకుంటాం. ఇరుగూ పొరుగూ మంచీ సెడ్డకి కాకపోతే సురవురవుతారని" కొంతసేపటికి ఆమె ప్రవాహాన్ని అరికట్టగలిగింది.

ఆవేళ సాయంత్రం అన్న దగ్గరకి మల్లుతో సహా వెళ్ళాడు. అన్న సినీమాకి బలవంతాన తీసుకవెళ్ళాడు. ఆ బొమ్మలు చూసి మల్లు సరదా అంతా యింతా కాదు. ఒకోసారి కేకలువేసి గెంతుతుంటే ప్రక్కనున్నవాళ్ళు పుల్లయ్యను కోపగించారు. పుల్లయ్యకు సినీమా చూస్తున్నంతసేపూ అంతా అలాంటి ఆలోచనలే. ఆ మేడలూ మిద్దెలూ, ఆ డబ్బూ బటలూ అంతా వుంటే సుకంగా బ్రతకరా అనుకున్నాడు. ఒకసారి చూసాక ఆ సినీమా మళ్ళీ మళ్ళీ చూడాలనిపించింది. పాటలు యెంత యింపుగా వున్నాయి. ఆ మూడు గంటలు యీ కష్టాలన్నీ మరిచిపోయి సంతోషంగా వున్నానే అనుకున్నాడు.

ఇంటికి వచ్చాక నీలి "యీ రాత్రికి పనికెళ్ళవా" అని అడిగింది - "ఈయేళ లేదట" అన్నాడు మలు సినీమా సంగతులు వుత్సాహంగా చెప్తున్నాడు. ఆ మరుచటిరోజు వీధిలో చంద్రయ్య కనిపించాడు. ఒక దగ్గరకు తీసుకవెళ్ళాడు. సందుగొందులు తిరిగి అక్కడకు వెళ్తే పదిమంది ఆ పాకలో కూర్చొని పేకాట ఆడుతున్నారు. "కూర్చోచూడు..." అని చంద్రయ్య కూడా డబ్బుకట్టి ఆడుతున్నాడు. పుల్లయ్యకు అంతా ఆశ్చర్యంగా వుంది. మలు కూడా వుత్సాహంగా వుంది. మధ్యాహ్నం అయినా చంద్రయ్య కదలేదు. పుల్లయ్య వెళిపోతానని లేచాడు. చంద్రయ్య ఒక్కసారి బయటకువచ్చి 'ఈ రాతిరికి రావాల—ఇప్పుడే యెళ్ళి అన్నను కలుసుకో" అన్నాడు.

పుల్లయ్య తలవూపాడేగాని యింటికెళ్ళే కాలు కదిపాడు ఇంటికి వెళ్ళేసరికి యింట్లో యేమీ లేదు. "ఎందుకని వడ్డీ అప్పులు—వాళ్ళువచ్చి యింటిమీద పడుతున్నారు—" అని నీలి అన్నది. అలా వాకిట కూలబడిపోయాడు. చిన్నపిల బువ్వకు యేడుస్తోంది. నీలి మాటాడకుండా పెరట కూర్చుంది.

అలా ఆ యేడుపులోనె పుల్లయ్య యెన్నో విధాలుగా ఆలోచించాడు. "తనకు పని యెక్కడ దొరుకుతాది? ఎలాగ ఒకసారి బురదలో దిగాను—బాగా దిగిపోతాను. నేను మునిగిపోయేముందు యీలెక్కే యేదో దారి చూపిస్తాను" అనుకున్నాడు— "ఈ లోకంలో కడుపుమండిన నీతీ గతీ యేమిటి? అలాంటి విశ్వామిత్రుడు లాంటోడు మాలపేటలోన కుక్కమాంసం దొంగలాడాడని పదంలో యిన్నానుకదా-నీలాంటోడికేంటి? ఇదంతా దనికొచ్చిందో వచ్చింది—దీనితో నా కష్టాలన్నీ పోవాల-ఈ ఒక్క తప్పునే ఆయమదర్మరాజు యినప కొంకులుసేత పొడిపించనీ—పడాను—నాను సచ్చాక యే కొంకులు పొడిస్తే యెవురు సూడొచ్చారు—"

ఇలా వుద్రేకంతో లేచి అన్న దగ్గరకు

వెళ్ళాడు. అన్న యేడు రూపాయలు యిచ్చి అన్నాడు:

"ఎలాగొచ్చింది అలాగే యెళిపోతా దన్నా. ఇది వుండి పోతాదనుకోక. ఉన్నప్పుడే తిను. ఒళ్ళు గటిచేసుకో తరవాత యెవుడికో నంచుంకొస్తే పని దొరికిపోతాది" అన్నాడు. పుల్లయ్యకు యీ మాటలు నచ్చాయి.

"చంద్రయ్య యీ రాతిరికి రమ్మన్నాడు" అని గొణిగాడు "అడు లేకపోతే మనకేం సేతనాతాది! అందుకే ఆడు యేమిచ్చినా కబోలనుకుంటున్నాం. ఆ యెదవకి యిద్దరు పెళ్ళాలు—పేకాట ప్రేకట్లు ఆడక వుండలేడు. అందులో తాగుతాడు—ఆడితో కూడావుంటే యీడు రోజుల్లో నిన్ను మార్చేస్తాడు. మన పనితో తే వాడికి సమ్మంధం" అన్నాడు.

పుల్లయ్య కొడుకు వేపు చూపించి మెలగా "ఈడు ఒకంతట కదలనివ్వడు—సెంద్రయ్య మాత్తర యిచ్చినాడు నిద్దరికి- ఏసేస్తాను." "ముందు మా వోడుకీ అది యేసినాను. నిద్దర శేవస్తాది" అని చెప్పాడు.

త్రోవలో యీ డబ్బు అంతా పెళ్ళంకి యిస్తే పోల్చుతుందని ఆమెతో అప్పు తెచ్చానని రెండు రూపాయలు యిద్దామని నిర్ధారించుకున్నాడు. ★

—ఇంకా వుంది.]

# నిజానిజాలు

(16-వ పేజీ తరువాయి)

అన్నాను. అతడు ఒళ్ళువంచి పని చేయకుండా కేవలం హస్తలాఘవం వల్లనే బ్రతుకుతున్నాడేమో అని నా అనుమానం.

"ఇక్కడ మెటల్ ఫ్యాక్టరీ లున్నాయి గదండీ! ఎక్కడ కూలీ దొరికితే అక్కడ పనిచేస్తాను. రోజుకు రూపాయి కూలీ దొరుకుతుంది. ఆ కూలీ డబ్బులు నాకే చాలవు. అందుకని రెండు నెలలుగా ఓ టాకీసులో గేటుదగ్గర వుంటున్నాను. వాళ్ళు నెలకు పదిహేను రూపాయ లిస్తున్నారు. రాత్రుల్లో నిద్రలేక ఆరోగ్యం బాగా చెడిపోయింది. రెండు రోజులు వూళ్ళోవుండి, తలంటుకుని కళ్ళారా నిద్రపోయి వద్దామనుకున్నాను...."

"ఆగు తావెందుకు, చెప్పు" అన్నాను యింకా ఆసక్తిని కనబరుస్తూ.

"రెండో ఆట విడిచేసరికి అర్ధరాత్రి దాటింది. ఆ తరువాత పడుకున్నా సరిగ్గా నిద్ర పట్టిందికాదు. నాలుగున్నర కంతా బస్సుస్టాండుకు వచ్చేశాను. బస్సు కదలగానే నిద్రపట్టింది. కండక్టరు కేకలు వేసి నాలుగురోడ్ల కూడలిదగ్గర దింపేశాడు. దిగిందొకటి మాత్రమే నాకు జ్ఞాపకం. ఆ నిద్రమత్తులో నా చేతికి దొరికిన లెదరు బ్యాగు నా దానో కాదో నేను చూసుకోలేదు. బస్సు రావడాని కింకా ఓ గంట సేపు పడుతుంది. అందాకా కూచోడమెందుకని బండపైన పడుకున్నాను...."

"ఐతే ఈ బస్సు కడంగా చేయి చాపావెందుకూ?" అతని కథకూ ఈ సంఘటనకూ పొత్తు కుదరగలదని నేననుకోలేదు. కేవలం కట్టు కథయితే అతడిక్కడ బోల్తా పడక తప్పదనుకున్నాను.

"తీరా దగరికి వచ్చేదాకా బస్సుశబ్దం వినిపించింది గాదు. ఉలికిపడిలేచాను ఇదే బొమ్మసముద్రం బస్సనుకుని అడ్డంగా చేయి చాపాను." అతడు కాసేపు మౌనంగా వుండి "ఆ తరువాత జరిగిన కథ మీకు తెలుసు" అన్నాడు.

కాసేపక్కడే నిల్చుని ఆలోచించాను. ఆలోచిస్తూనే బస్సుస్టాండునుంచీ ఈవలికి వచ్చారు. హోటలు వరండాలో నిల్చుని గూడా ఆలోచించాను. ఈ కథ ఈ విధంగా గూడా జరిగివుండడానికి అవకాశం వుందా అన్న ప్రశ్నకు ఎంత సేపాలోచించినా సమాధానం స్ఫురించిందికాదు. ఎందుకో గానీ నాకా యువకుడి నిర్దోషిత్వంమీద హఠాత్తుగా నమ్మకం కలిగింది. ఎందుకు కలిగింది? అకారణంగా కలిగివుండదుకదా!

ఆఖరుకు కారణం వేడివేడిగా కాఫీ త్రాగిన తర్వాత స్ఫురించింది. అవును. అతడి నిర్దోషిత్వానికీ దీన్ని బుజువుగా అంగీకరించవచ్చు. అతడు నిజంగా దొంగే అయితే బస్సు దిగగానే పారిపోకుండా ఆ నాలుగురోడ్ల కూడలిలో ఎందుకు తామసిస్తాడు?

బురద నీటిలో సూర్య బింబం ఏలాగైతే ప్రతిఫలించదో, అలాగే విభ్రాంతచేతస్కులకు ముంజేతి కంకణంలాంటి సత్యం గూడా స్ఫురించదు గాబోలు!

కాఫిగ్లాసును టేబిలుపైన వుంచి బిల్లు తీసుకుని పైకి లేచాను.

అరవ పత్రిక చదువుకుంటున్న అయ్యరు డబ్బుకోసం చేయి చాపాడు.

జేబులో నుంచీ చిల్లర తీస్తుండగా బిల్లులు, రసీదుల్లాంటి కాగితాలతో బాటు ఓ అయిదు రూపాయలనోటు క్రిందికి జారింది.

"డబ్బు విషయంలో జాగ్రత్తగా వుండాలి సార్! కాలం బొత్తిగా చెడిపోతూ వుంది" అన్నాడు అయ్యరు.

"చెడిపోతున్నది కాలమా, మనుషులా?" అన్నాను.

"రెండూ ఒక దానితో ఒకటి పందెం వేసుకుని చెడిపోతున్నాయనుకోండి. అంతెందుకు? నిన్నటికి నిన్న వరమానం వినండి ఓ పొరుగూరి ఆసామి మండీలో బాకీ చెల్లించడానికి వెయ్యి రూపాయలు తీసుకొచ్చాడు. అతడు నేరుగా మండీకె వెళ్లిపోయివుంటే బాగుండేది. మధ్యలో హోటలుకు వెళ్ళాడు. లెదర్ బ్యాగు ఒడిలోనే వుంచుకొని టిఫిన్ చేశాడు. చేతులు కడుక్కోడానికి టబ్ దగ్గరికి వెళ్తూ బ్యాగును కుర్చీపైన వుంచాడు. అతడు ఒక్క నిమిషం ఆద మరచాడేమో, అంతే సంచీకి సంచే మాయమైపోయింది!"

అయ్యరుమాటల్ని వింటూ నేను చేష్టలు దక్కి విగ్రహంలా నిల్చుండిపోయాను.

అలా ఒకటి రెండు నిమిషాలు నిల్చుండిపోయిన తర్వాత నా బుర్రలో ఓ మెరపు మెరిసింది. బస్సులో తాత్కాలికంగా డబ్బు దారబోసుకున్న పెద్దమనిషి కేసును పోలీసుల దాకా తీసుకెళ్ళడానికి నిరాకరించినందుకు కారణమిదినేమో!

ఏమో! నిజం దేవుడికి తెలుసు. నీటికి పల్లం తెలుసు. ఆలోచించినకొద్దీ మనకు కలిగేవి సందేహాలు మాత్రమే!



# బాల సాహితి

నడివీధిని పడియుండెను,
బరువైనది బండరాయి;
బాటసారులకు, బండ్లకు,
బలే పెద్ద అవరోధం.

త్రోవలోన అడ్డంటూ
తిట్టుకునే వారె గాని,
రాయి ప్రక్క త్రోసి దారి
చేయువారు లేరెవ్వరు!

కొంత వడికి వీధివెంట
ఏతెంచె బాలు డొకడు,
తానొక్కడె ఆ బండను
తొలగించగ నిశ్చయించె.

వెక్కిరించు చూపరులను
లెక్క చేయకుండానే,
దీక్షతోడ బండరాయి
త్రోయ మొదలుపెట్టెనతడు.

మెల్ల మెల్ల కదిలి కదిలి
దొర్లిపోయె రాయి తుదకు;
దాని క్రింద కానవచ్చె,
డబ్బు సంచితో చీటి!

"పరుల మేలు తలచువారి-
కి కానుక" యను చీటి
చదివి వాడు సంతసించె;
జను లెల్లరు సిగ్గుపడిరి! ★

"శివానంద"

# రాజు, భటులు

[illegible] సైన్యాలు వచ్చి నగరాన్ని [illegible]డించాయని తెలియగానే సింహ[illegible] రాజు వీరకేసరికి ముచ్చెమటలు [illegible]యి. ఏం చేయటానికీ తోచ[illegible] నగరాన్ని ముట్టడించినది [illegible] చక్రవర్తి అని తెలియగానే [illegible]కు పై ప్రాణాలు పైనే పోయా[illegible] విక్రమచక్రవర్తి అంతటి [illegible]చక్రవర్తికి తనలాంటి చిన్న [illegible] నాశనం చేయాలనే తలంపు [illegible]దుకు కలిగింది? తన రాజ్య[illegible] ఆయన రాజ్యంలో మూడో [illegible] వుండదు. తను ఆయనతో [illegible]గానే వుంటున్నాడు. వారి [illegible]స్థానంలో ఏ ఉత్సవం జరిగినప్పు[illegible] తను గొప్ప గొప్ప కానుకలతో [illegible] ప్రతినిధుల్ని పంపుతూనే [illegible]. వారి కక్కడ తగిన [illegible]న జరుగుతూనే వచ్చింది. [illegible]తవరకూ తమ మధ్య ఎలాంటి [illegible]ధమూ పొడసూపలేదు.

ఇదంతా తన దగ్గర ఇదివరకు [illegible]గా వుండి హఠాత్తుగా ఖజా[illegible] డబ్బు దోచుకొని పారిపోయిన [illegible]డి పన్నాగమే అయివుంధాలి. [illegible] తను సుధీరుడికి ఎలాంటి [illegible]యమూ చేయలేదు. తన [illegible]లో వున్నన్నాళ్లు ఎంతో [illegible]గా చూసేవాడు. మంచి [illegible]చ్చేవాడు. కావలిసిన సహా[illegible]వాడు. ఆయన మాటలకు [illegible]వ ఇచ్చేవాడు. అలాంటి [illegible] ద్రోహం చేశాడు.

[illegible] చక్రవర్తి సైన్యాలు, తన [illegible]ను మించి వున్నాయి. అదీ గాక చక్రవర్తి సైన్యాలకు మంచి ఆయుధాలున్నాయి. యుద్ధం చేయడానికి సిద్ధపడి వచ్చారు. తమ సైనికులు విశ్రాంతిలో వున్నారు.

పారిపోయి ఏదైనా ఆలోచించుకోవడం కన్న మరోదారి కనిపించలేదు వీరకేసరికి. ఆయన ఈ ఆలోచనలో వుండగానే ఆయన అనుచరులు చెక్కుమంది అప్పుడే శత్రుపక్షంలో చేరిపోయి ప్రాణాలు నిలుపుకొన్నారు.

ఆరుగురు భటుల్ని మాత్రం తనతో తీసుకొని కొంత డబ్బుతో ముందు నగరం దాటుకోవాలనుకొన్నారు రాజుగారు. భార్యాపిల్లలు అదృష్టవశాత్తు నగరంలో లేరు. ఇక్కడికి చాల దూరంలో వున్న ప్రతాపగిరి రాజు కూతురే ఆయన భార్య. ప్రతాపగిరి రాజు ప్రతి సంక్రాంతికీ గొప్పఉత్సవాలు చేయిస్తాడు. ఆ ఉత్సవాలకని ఆయన కూతుర్ని తీసుకొని వెళ్లారు.

వీరకేసరి భటులతో ఎలాగో నగరం దాటి ఆ పగలంతా నడిచి ప్రొద్దుగుంకే నరికి ఒక అడవి ప్రాంతం చేరుకొన్నారు.

ఈ భటులుకూడా నిజానికి నమ్మదగినవారు కారు. కానీ వీరు సుధీరుడికి 'ఇష్టంలేని' వర్గంలోనివారు. వీరికి ఎలా విక్రమ చక్రవర్తి దగ్గర ఉద్యోగం దొరకదు, హతమార్చినా హతమార్చవచ్చు. అందుకని వీర రాజుగారు బాగా అలసిపోయారు. అడవిలో దొరికిన పళ్లుతిని, ఒక 'దొన'లో నీళ్లు త్రాగి ఒక పెద్ద ఎత్తైన బండమీద అందరూ విశ్ర మించారు. వేకువజామువరకు అక్కడ పడుకొని, ప్రయాణం సాగించాలని రాజుగారి ఉద్దేశం.

పడుకొనేముందు 'హనుమంతు' డనే భటుని పిలిచి: "హనుమంతుడూ అందరం పడుకొందాం. నువ్వుమటుకు కొంచెం మెళకువగా వుండు. నాకు వేకువన మంచి నిద్ర పట్టవచ్చు. అప్పుడు నువ్వు నన్ను లేపాలి," అన్నారు రాజుగారు. అందరూ పడుకొన్నారు.

హనుమంతుడు ఆలోచించాడు: "వేకువజామున నేనూ నిద్రలోనే వుండొచ్చు. బాగా అలసిపోయాను. హాయిగా నిద్రపోకుండా, రాత్రంతా ఎవరు మేలుకొంటారు? వేకువన ఆయన్ను లేపాలనే భయముంటే అసలు రాత్రంతా నిద్దేరాదు! ఈ బాధ్యత వొదులుకోవడంమంచిది,"



ఎత్తిపోతల జలపాతము (మాచర్ల వద్ద)

—ఫోటో: ఎస్. వి. లీలాప్రసాద్]

## రాజుభటులు

అనుకొన్నాడు.

అప్పటికే అందరూ నిద్రపోతున్నారు. రాజుగారికి మటుకు మనసు కలతగా వుండటంచేత నిద్ర రాలేదు, మేలుకొనే పడుకుని వున్నారు.

హనుమంతుడు మెల్లగా తన ప్రక్కనే పడుకొన్న మరొకభటుని లేపాడు.

"ఒరేయ్! రాజుగారు నన్ను వేకువజామున లేపాలని చెప్పారు. అప్పుడు నాకు మెలకువగా వుండదేమో. అప్పుడు నువ్వు కాస్త మెలకువగా వుండి నన్ను నిద్ర లేపు, నేను రాజుగార్ని లేపుతాను. సరేనా" అని అతని జవాబుకోసమైనా చూడకుండా పడుకొని నిద్రపోయాడు.

రెండోభటుడు ఆలోచించాడు. ఈ బాధ్యత తనమీద వేసుకోవడం అతనికీ ఇష్టంలేదు. మెల్లగా మూడో వాణ్ణి లేపాడు. హనుమంతుడు తనకు చెప్పినట్లే తనూ అతనికి చెప్పేసి అతడుకూడా పడుకొన్నాడు.

మూడోవాడు ఆలోచించాడు. ఆ బాధ్యత మీద వేసుకొని నిద్ర చెరుచుకోవటం అతనికి ఇష్టంలేదు. అందుకని అతడు నాలుగోవాడిని లేపి చెప్పేసి పడుకొన్నాడు.

నాలుగోవాడు అయిదోవాడిని లేపి చెప్పేసి పడుకొన్నాడు. ఐదోవాడు ఆరోవాణ్ణి లేపి చెప్పేసి పడుకొన్నాడు

ఆరోవాడు ఆలోచించాడు. హాయిగా పడుకోకుండా ఇదేమిటనుకొన్నాడు మెల్లగా హనుమంతుణ్ణే లేపాడు. లేపి, రాజుగారిని వేకువఝామున మేలు కొల్పమని చెప్పి, పడుకొన్నాడు హనుమంతుడు నిద్ర



# మల్లెపువ్వు



[23 వ పేజీ తరువాయి]

ఈసారి వెంకటరత్నానికి.

వెంటనే వ్యాపారం ప్రారంభించాడు. ఎన్నో చెట్లు కొనేశాడు కాయలు పండగానే కోయించి, కొట్టించి పండుచేశాడు. విక్రయం ప్రారంభించాడు

హఠాత్తుగా దేశంలో వర్షాలు ఎక్కువయ్యాయి తత్ఫలితంగా చెరువులు గట్లు తెగి, నదులకు వరదలొచ్చి, చేపలన్నీ పోయాయి అదీగాక చాలవిళ్ళ తర్వాత అదే మొదటి వర్షం గనక రైతులు గత అనుభవాన్ని పురస్కరించుకొని, రకరకాల పంటలు వేశారు అందులో ఆప్రాంతంలో టొమేటోలు ఎక్కువగా వేశారు. ఎక్కడ చూసినా ఆపళే! చింతపండు వాడకం పూర్తిగా తగ్గిపోయింది

ఇంకా చాల కారణాలవల్ల, ఆ యేడు వెంకటరత్నం వ్యాపారం పూర్తిగా దెబ్బతిన్నది పెట్టుబడి పెట్టిన డబ్బు తిరిగిరాలేదు పైగా అతనిదగ్గర సహాయకుడుగా పనిచేస్తూవుండినతను కొన్ని వేల రూపాయలతో పలాయనమైపోయాడు ఆ ఏడు చింతచెట్లు కొన్నందుకుగాను రైతులకు ఇవ్వవలసిన డబ్బుకోసం అదనంగా చాలడబ్బువ్యయమైంది చింతపండు తర్వాత, బెల్లం వ్యాపారం చేశాడు అదీ దెబ్బతిన్నది ఉన్నడబ్బంతా పెట్టి వ్యాపారం చేశాడు. పెట్టిన డబ్బు చేతికిరాలేదు బెల్లం విదేశాలకు పంపడానికి ప్రభుత్వం నిరాకరించిన ఫలితంగా ఆ వ్యాపారం ఘోరంగా దెబ్బతిన్నది

* * *

పరీక్షా ఫలితాలు పత్రికలలో ప్రకటింపబడినాయి శంకరం యూనివర్సిటీలో ఫస్టొచ్చాడు.

ప్రభుత్వం అతడు ఒకప్రత్యేకవిషయం మీద పరిశోధించడానికిగాను మాసానికి రెండువందల ఏభైరూపాయల విద్యార్థివేతనం ఇవ్వదలచినట్లు ప్రకటించింది

ఆ విషయం తెలిసిన వెంకటరత్నం చాల సంతోషించాడు. తన అల్లుడు దరిద్రుడు కానేకాదు! కాబోయే పెద్దఉద్యోగి! ఆర్జించబోయే సమరుడయిన, తెలివైన, చురుకయిన యువకుడు!

ఆ సాయంకాలం అతను శంకరం ఇంటికి వచ్చాడు. సరస్వతమ్మను ఎంతో ఆప్యాయముతో పలకరించి, మాట్లాడాడు ఆమె కూడా ఎంతో గౌరవంగా చూసింది

"నేనిప్పుడు అర్జెంటుగా ఒకవిషయం చెప్పాలని వచ్చాను ఈ విషయం ముందే చెప్పివుంటే, శంకరం ఎందుకూ పనికిరానివాడైపోయివుండేవాడు అసలు ఆనర్స్ పాసయివుండేవాడే కాదు. నేనలా నిర్దయగా ప్రవర్తించడంవల్ల, తన వ్యక్తిత్వమంటూ ఏర్పరచుకోవలసిన అవసరాన్ని అతడు గుర్తించాడు. పైగా నామీద పగ తీర్చుకోవాలనే పట్టుదల కలిగింది నేను పద్మను ఇంకెవరికయినా ఇచ్చి పెళ్ళిచేస్తానేమోననే శంక కలిగింది అది కేవలం తన అసమర్థతవల్ల జరుగుతున్న అన్యాయమని భావించాడు 'ఎలా అయినా సరే తను సామర్థ్యం కలిగినవాడు కావాలి, పద్మ మనసు పూర్తిగా తనదిచేసుకొని మామయ్యకు అవమానం చేయాలి' అనే బలమైన సంకల్పం కలిగింది అతని కీ సంకల్పం కలగకుండా వుంటే, ఇంత ఉన్నతికి రాగలిగేవాడే కాగు. మనపద్మ అతణ్ణి ఇష్టపడేదికూడా కాదు అతడు పద్మ అంటే ఇంత పడిచచ్చేవాడూ కాదు అంతా నే ననుకొన్నట్లే జరిగింది నాకు తెలుసు నా ఊహలు ఎప్పుడూ తప్పుకావు ఇప్పుడు నాప్లాను పూర్తయింది కాబట్టి చెప్పేశాను ఇంక ఫరవాలేదు నాకు చాల సంతోషంగా వుంది," అన్నాడు.

"మీ ఉపన్యాసం చాలేనా నాన్నా! అదంతా రాసి అచ్చువేయించండి మిమ్మల్ని ప్రపంచం గొప్ప మేధావిగా గుర్తిస్తుంది. మీ వ్యాపారం దెబ్బతినకుండావుండి, శంకరానికి స్కాలర్ షిప్ రాకుండావుంటే మీరు ఎంత కసాయివాడిలా ప్రవర్తించేవారో అందరికీ తెలుసు. ఇప్పుడీ మేకపోతు గాంభీర్యం ఎందుకు?! అత్తయ్యను క్షమించమంటే సరిపోదూ!" అంది వెనక

---

మత్తులో ఇదేమీ వినిపించుకోలేదు. "అలాగే' అనేసి పడుకొన్నాడు.

రాజుగారు ఇదంతా గమనిస్తూనే వున్నారు. ఇలాంటి భటుల్ని వెంట బెట్టుకొని వెళ్ళడంవల్ల పెద్ద నష్టమేగాని లాభం వుండదనుకొన్నారు.

అందరూ మంచినిద్రలోవుండటం గమనించి, తన డబ్బు సంచీ తీసి భుజాన వేసుకొని, తిన్నగా ప్రతాపగిరి దారిపట్టారు.

మామగారి సహాయంతో మళ్లీ రాజ్యం సంపాయించుకొని, ఈసారి ఇలాంటి ద్రోహుల్ని దగ్గర చేర్చకుండ జాగ్రతపడాలని ఆ అర్ధరాత్రి వేళ నిశ్చయించుకొని, ఆ వేశంతో ముందుకు నడిచారు. ★

# మల్లెపువ్వు

మంచి పద్మ!

వెంకటరత్నం చకితుడై కళ్ళెరిమి కూతుర్ని చూసి, వెంటనే కృంగిపోయాడు. కొన్ని నిముషాల్లో శక్తిని కూడదీసుకొన్నాడు.

“మీరు చిన్నపిల్లలు. మీకు తెలీదులే! నా ఊహాశక్తికి మీ క్షేమం తెలుసు. పోనీలే మీరు బాగుపడ్డారు. నా కంతేచాలు” అంటూ లేచి వెళ్ళిపోయాడు.

శంకరం మరో ప్రక్క ఆశ్చర్యంతో చూస్తున్నాడు. పద్మ అలా అంటుందని అతను ఊహించలేదు. గోడకానుకొని నిల్చున్న సరస్వతమ్మ కళ్ళవెంబడి నీళ్ళు, అవి ఆనందబాష్పాలా?

ఆ ఇదరి స్పందించే హృదయాలు తమ శరీరాల్ని దూరాన్నేవుంచి, ఆ క్షణాన ఏకమై సరస్వతమ్మ పాదాలను అభిషేకం చేశాయి. ★

# విశాల హృదయాలు

(36-వ పేజీ తరువాయి)

సాగిడే టప్పటికి ఆయనగారు ఆవేశం పట్టలేక నానాదుర్భాషలూ ఆడి చెంపకుచేయి ప్రయోగించారుట మన పిల్లా తక్కువది కాదనుకోండి ఏదో అనే వుంటుంది— “మీరుమటుకు సాల్గని ఆరాధించటం లేదా? ఫోటో పెట్టి గుప్తం మనతల్లో పెట్టుకో లేదా? రీటాహేవర్ బొమ్మపట్టే మంచానికి పైన్నే తగిలించలేదా?” .. ఇట్లాగే, కాని వాళ్లేమని తగవులాడుకుంది మన కవిత్వపరం అసలు అతనికి ముందట కోపం రావడానికి కారణమేముంది అంటాను. అవును. మా ఫ్రెండ్ చెప్పినమాటా నిజం. ఆ రూమ్ కాస్త పరీక్షించిచూస్తే తెలుస్తుంది, అతనికి సినీయాక్టర్సు (ఆడవాళ్ళే!) అంటే ఎంత అభిమానమో, తను అట్లా పెట్టెల్లో, దిండు కిందా, గోడలమీదా, తలతట్టూ కాళ్ళతట్టు అర్ధనగ్నంగావున్న సినిమా తారల ఫోటోలు తగిలించుకున్నా భార్య ఆక్షేపించకుండా వూరుకుండికదా. అదే ఆమె ఒక్క సినీయాక్టరును మెచ్చుకుందని ఓర్చుకోలేక పోయాడా భర్త.

అలాగని మగవాళ్ళంతా ఇటువంటి వారేనని నా అభిప్రాయంకాదు. “మావారిటువంటివారు కారండోయ్” అంటూ సోదరీమణులు వుత్తరాలు వ్రాసేరు కొంతమంది మగవాళ్ళ స్వభావాలు పరిశీలించే వేసే వ్యాసం వ్రాశాను తామేదో పెద్ద ఘనుల మనుకొని, ఎంతసేపటికి ఆడవాళ్ళో అనుమానస్తులు ఛాందసులు అంటూ ఆడిపోసుకునే మగవాళ్ళను గురించి వ్రాశాను.



# సినిమా

"ఎందుకయ్యా ఈ కథ రాసింది. కలా కాలేదు. ఏం బాగులేదు. బాగు నచ్చలేదు" అంది హీరోయిన్ స్క్రిప్ట్ మీద ఫైనల్ షాట్ దయాయించి.

"అది కాదు" అన్నాడు నిర్మాత లాలసగా.

"కాదూ లేదు, గీదూ లేదు. కథ ఇలా నడవదు. ఇక్కడ మార్చాలి" అన్నదామె.

ఇదేం బాగులేదని వాదించాడు డైరెక్టరు; కథ బాగులేదని కాదు; హీరోయిన్ కథని కొట్టివేయడం.

చుట్టూరా ఉన్న చిన్న ఆర్టిస్టులంతా వినుగోయి చూస్తున్నారు; ఈ డైరెక్టరు కింక పుటగతు లుండవన్నట్టు. ప్రొడ్యూసరు తటపటాయించి గుటక మింగుతున్నాడు మొహమాటం కొద్దీ.

## బొంబాయి సినిమా లేఖ

ఈ కుచీలు ముందర పడితే బాగుండేది కాని ముందర కథ సాంతం చెప్పే అలవాటు ప్రొడ్యూసర్లకి, వినే తీరు బాటు వాళ్లకి లేదు. ఇప్పుడతర, ఇన్నిరీళ్ల షూటింగైపోయాక, కథ నచ్చలేదంటుంది. ఎలాగ?

"ఎలాగేముంది. కావాలంటే తారని మార్చేసాము గాని, కథని అక్షరం సర్దేందుకు వీల్లేదు" అన్నాడు డైరెక్టరు.

ఈ డైరెక్టరవడో పెద్దవాడై ఉండాలి. అతనికి ప్రొడక్షన్లోనో డిస్ట్రిబ్యూషన్ లోనో షేరుకూడా ఉండిఉండాలి. కాకపోతే బొత్తిగా ఇంత ధైర్యం ఎక్కడిదిట.

ఎక్కడిదైతేనేంగాక, అది పనిచేసింది. 'ధైర్యే సాహసే లక్ష్మీ' (డబ్బున్న వాడికే ధైర్య సాహసము లుండగలవు అని తాత్పర్యం చెప్పుకోవడం బాగుంటుంది ప్రస్తుతానికి) అన్న సామెతను ఋజువు చేసింది.

* * *

ఇంతకీ, ఈ వాగ్వాదంలో డైరెక్టరు గెల్చాడా, తారదే గెలుపా అన్న జవాబు వెండితెరమీద చూడవలసి ఉంది. ఎందుకంటే ఈ ఘర్షణ, గురుదత్ తీస్తున్న 'కాగజ్ కె ఫూల్' చిత్రంలో ఒక సన్నివేశం. అందులో గురుదత్, వహీదా రెహమాన్ ముఖ్యనటులు.

ఈ సమస్యని ఈ చిత్రంలో గురుదత్ ఎలా పరిష్కరించబోతున్నాడో తెలియదు కాని, ఈ నాడిది రకరకాల వేషాలతో చాలాచోట్ల ఎదురై కళాకారులను చీకాకు చేయగలుగుతున్న సమస్య.

చలనచిత్రకళ పదిమందికలసి పనిచేయగా రూపొందేదే అయినా, వివిధశాఖలూ కలవడానికి ముందర, సృజనాత్మకమైన కృషి జరగవలసి ఉన్న ఘట్టాలలో వ్యక్తి శక్తే ప్రధానం, దానిని కలిపినపుడు మార్పులూ చేర్పులూ అవసరం అయితే కావచ్చుగాని, అప్పుడుకూడా ఆయాకళాకారుల అభిప్రాయాలనూ వాదాలను మన్నించడం ముఖ్యం. కాని అదే ఈనాడు దృశ్యం అయిపోతున్నట్లు కనిపిస్తుంది. ఏ శాఖలో పని వాడిని అడిగినా, అతని జవాబు ఫిర్యాదులాగే కనిపిస్తుంది. మీరు చేసిన పాటో, రాసినమాటో బాగుంది

జలరుహా వారి 'రాజనందిని'లో అంజలీదేవి





శ్రీ రామా పిక్చర్సువారి "భక్త అంబరీష" చిత్రానికి రేవతీస్టుడియోలో యన్. టి. రామారావు ప్రారంభోత్సవం జరిపారు. ఈ చిత్రంలో దర్శక నిర్మాత బోళ్ళ సుబ్బారావు, వేణీ, ఎన్. ఏ. టి. అధిపతి త్రివిక్రమరావు, రామశర్మ, ఎన్. టి. రామారావు, [illegible] ఆచార్య, సౌండు రికార్డిస్టు కన్నన్‌లను చూడవచ్చు.

## [illegible] సినిమాల్లో

అంటే, ఏముందిలెండి అని అసంతృప్తిగా, పెదవులు చప్పరించి నవ్వేస్తాడు. అంటే, తానుచేసినపని తనకే తృప్తి కలగలేదన్న మాట. దానికి కారణం అశక్తత కాదు. అధికార ప్రాబల్యం ఎక్కువై శాసించినప్పుడు ఎదిరించే శక్తిలేక, సర్దుకోవలసి రావడంవల్ల. సంగీత దర్శకుడు, ప్రొడ్యూసరు [illegible]ని తెచ్చిన విదేశీ రికార్డులనే అనుకరించాలి. రచయిత ఫలానా విధమైన డైలాగులనే, అవసరం ఉన్నా లేకపోయినా రాయాలి. ఒకొక్కసారి ఫలానా పెద్దమాటని ఎలాగో అలా ఎక్కడో అక్కడ దూర్చెయ్యాలి. నృత్య దర్శకుడు రాక్ ఎండ్ రోల్ డాన్స్యంగుని, భారతీయ నృత్యంగా తర్జుమా చెయ్యాలి. తారభారిగా ఉన్నా, డైరెక్టరు బాగుండ దనుకున్నా, పిడి చెరిస్ ఫలానా [illegible] పిక్చర్లో వేసుకున్న ఉంటినంటి [illegible] కాస్ట్యూమ్ నే తొడిగించాలి.

ఈ విధంగా నియంతలు అనిపించుకుంటున్నవాళ్లు డిస్ట్రిబ్యూటర్లు, ప్రొడ్యూసర్లకు పెట్టుబడి ఇచ్చే వ్యాపారస్థులు సార్ వాల్యూ ఉన్న తారలూ, (వాళ్ళకి కార్ వాల్యూ చేసేపాటి ప్రజ్ఞకూడా లేకపోయినా—అంటే వాళ్ళు కలగచేసుకు శాసించే ఇతర శాఖలలో) ఎప్పుడూ అమెరికన్ సినిమాలేదూనే ప్రొడ్యూసర్ల ప్రవరిన్ లాలూ తగ రాలూ చేరతారని ఆయాశాఖలలో బాధపడుతున్న కళాకారులే ఫిర్యాదు చేస్తున్నారు.

ఈ దుస్థితి "దుష్ఫలితాలు" (డబ్బు రావడం వంటివి) ఇవాళ రేపూ ఎలా ఉన్నా, దుష్ఫలితాలు, నుటుకు-రేపో మాపో రాకపోయినా అచిరకాలంలో [illegible] కళాకారుల సృజనాత్మక ప్రజ్ఞకు చెప్పరాని హాని చేయగలవనడానికి సందేహం లేదు. అటువంటిసూచనలు ఇప్పుడే కనిపిస్తున్నాయి. ఈనాడు చాల మంది "కింగ్ ఆఫ్ ప్లేగరైజింగ్" (అనుకరణ ప్రవీణ) అని సొంతానికి బిరుదులు తగిలించుకుని బడాయిగా ఊరేగే స్థితికి వచ్చారు. కొందర్లు, 'గోడమీద రేపు' నుండి ఇక ఇలాటివి చెయ్యము అని సరసాలు ఆడుతున్నారు. కొందరు, "[illegible] స్వతంత్రం ఉంటేనా" అంటున్నారు.

...రేప్పొద్దున్న ఉన్నా, ఏమీ [illegible] లేని పరిస్థితికివస్తారని నేటి గతిని గమనించిన వారు అనుకుంటున్నారు. ఎందుకంటే, 'సినీనియంతల' బాక్సాఫీస్ మూ[illegible] బలంవల్ల నైతే నేమి, కారూ [illegible] అర్జెంటుగా గడించి స్థాయి కావచ్చునన్న పరదావల్ల నైతే నేమి, చాల మంది దూరపు చూపు లేకుండా ఒరులనూ, తమనూ అనుకరించి కాలక్షేపం చేయుటం అలవాటైపోయి క్రమంగా స్వయంగా ఆలోచించి, సృష్టించే శక్తికి స్వస్తి చెబుతున్నట్లు [illegible] చిత్రాలు ఘోషిస్తున్నాయి.

పదికాలాలపాటు ఇందులో నిలబడి చిత్రాలు తీయాలనుకునే వారు ఇప్పటి చిత్రాల కృత్రిమ సరిహద్దులను దాటి, స్వచ్ఛమైన గాలి పీల్చి, సినిమాలో కొత్త చైతన్యం తీసుకురావడానికి పూనుకోవడం వాంఛనీయం. ★

# ★ వార్తావరణం ★

శోభాయమానంగా అలంకరించిన భరణీ స్టుడియో లాన్సులో మే 14 సాయంకాలం ఒక విందు జరిగింది. అంతకు వారం పది రోజుల క్రితమే జపాన్‌లో పర్యటించి వచ్చిన భరణీ స్టుడియో అధిపతి దక్షిణ భారత ఫిలిం వాణిజ్య మండలి కార్యదర్శి శ్రీ పి. ఎస్. రామకృష్ణరావు గౌరవార్థం శ్రీ ఎ. ఎల్. శ్రీనివాసన్, దర్శక నిర్మాత శ్రీ బి. ఆర్. పంతులు ఆరోజు ఈ విందు చేశారు. శ్రీనివాసన్ ఈ స్టుడియోను ఐదేళ్ల కాలంకు తీసుకొని చిత్రాలు తీస్తున్నారు.

విజయా స్టుడియో అధిపతి శ్రీ నాగిరెడ్డి సభకు అధ్యక్షత వహించారు. ఈ మన చలనచిత్ర పరిశ్రమ అభివృద్ధినీ, విదేశ వ్యాపార రంగంలో మనం చిత్రాలకు గల అర్జన అవకాశాలను, విస్తృతావధులనూ వివరిస్తూ, ఇందుకు ఈనాడు ముడిఫిలిం దిగుమతి సమస్య ఒకవిధంగా అవరోధం కలిగిస్తున్నదనీ, ఈ (దు)స్థితి మరో ఆరునెలల పాటు వుండేటట్టు కనిపిస్తున్నదనీ శ్రీ నాగిరెడ్డి అన్నారు.

అనంతరం శ్రీ రామకృష్ణరావు తమ జపాను పర్యటనానుభవాలను వివరించారు.

గతమాసం మనీలాలో జరిగిన అంతర్జాతీయ చలనచిత్రోత్సవానికి శ్రీ రామకృష్ణ భారతీయ ప్రతినిధిగా పరిశీలకుని హోదాలో వెళ్ళారు. ఆసియా చలనచిత్ర సంఘంలో మనదేశానికి సభ్యత్వం లేదు. ముఖ్యంగా ఆగ్నేయాసియా, మధ్యఆసియాలలో మన చిత్రాలు ప్రదర్శించడం, జరుగుతున్నా, మనం ఈ సంఘంలో సభ్యులం కాకపోవడానికి కారణం దురూహ్యం.

మొత్తానికి భారతీయ ప్రతినిధితో మాత్రం అక్కడివారంతా ఆప్యాయంగా మంచిచెడ్డలు చర్చించి, మనదేశం గురించిన వివరాలు అడిగి తెలుసుకున్నారట. మహబూబ్ చిత్రం 'మదరిండియా'ను అక్కడ ప్రదర్శించారు.

మనీలా ఉత్సవానంతరం శ్రీ రామకృష్ణరావు, జపాన్ చలనచిత్ర నిర్మాతలసంఘం అధ్యక్షుడు శ్రీ షిరోకిడో అతిథిగా ఆదేశంలో పర్యటించి, అక్కడి స్థితిగతులు, ముఖ్యంగా చలనచిత్ర పరిశ్రమ స్వరూప స్వభావాలు తెలుసుకునివచ్చారు.

## 15 రోజులకో చిత్రం

జపాన్‌లో ఈనాడు టెలివిజన్ లేని ఇలుగాని, హోటలుగాని అరుదుగా కనబడుతుందనీ అయినా అక్కడి చలనచిత్ర పరిశ్రమ ఉచ్ఛస్థితిలోనే ఉన్నదనీ, అక్కడ సాలుకు 800 చిత్రాలు తయారవుతున్నాయనీ ఆయన చెప్పారు. ఇవికాక విదేశాల నుండి నాలుగువందలు వస్తాయి. వీటికితగ్గట్టు అక్కడ థియేటర్లూ పుష్కలంగా ఉన్నాయి. అంత చిన్న దేశంలో థియేటర్లు నాలుగువేలున్నాయంటే, నలభైకోట్ల జనాభాగల మనదేశానికి మూడువేల సినిమాలున్నాయని మనం జ్ఞాపకం చేసుకున్నపుడు ఆశ్చర్యం కలుగుతుంది. ఒక్క టోక్యో నగరంలోనే 800 సినిమాలున్నాయి అని రామకృష్ణ చెప్పారు.



జపాన్‌లో రామకృష్ణ: ప్రక్కనున్న అమ్మాయి 1957లో మిస్ జపాన్.



సినీనటి జమున తమ్ముడికి గతివారం ఉపనయనం జరిగింది. జమున, గిరిధర్, దీవించవచ్చిన నాగేశ్వరరావు.

# వార్తావరణం

సభ అనంతరం విందు జరిగింది. తరువాత భరణీ ప్రీవ్యూ థియేటర్‌లో ఎ. ఎల్. ఎస్. వారి 'బడిపంతులు' చిత్రాన్ని ప్రదర్శించారు.

శ్రీరామ పిక్చర్సువారి తొలిచిత్రం 'భక్త అంబరీష' నిర్మాణానికి ప్రముఖ నటుడు ఎన్. టి. రామారావు మే 11న రేవతీ సౌండ్ స్టుడియోలో ప్రారంభోత్సవం చేశారు. దర్శకుడు, ఛాయాగ్రహణ దర్శకుడు బొళ్ళ సుబ్బారావు నిర్మిస్తున్న ఈ చిత్రంలో పి. సూరిబాబు, కె. రఘురామయ్య, ముక్కామల, పేకేటి, రామశర్మ, చంద్రశేఖర్, జలం నరసింహారావు, పి. శాంతకుమారి, మాలతి, కుసుమకుమారి మొదలగువారు పాల్గొంటున్నారు. మాటలు ఆచార్య, పాటలు ఆరుద్ర వ్రాస్తున్నారు. సంగీత దర్శకుడు మల్లేశ్వరరావు.

తొలిరోజున ఘంటసాల, లీల, రాజా, సుశీల పాడిన నాలుగు పాటలు రికార్డు చేశారు.

'ఉలగం పలవిధం' అనే తమిళచిత్రాన్ని నేషనల్ ప్రొడక్షన్స్ (కిల్పాక్) వారు తెలుగులోకి తర్జుమా చేసి విడుదల చేస్తున్నారు. దీనికి 12న ఎస్. ఎస్. ఎ. పి. అధిపతి శ్రీ జగన్మోహనరావు ప్రారంభోత్సవము జరిపారు. నిర్వాహకుడు సురటి దుర్గారావు. రచన బైరాగి. నిర్మాత దినషా టెహ్రాని. స్టుడియో న్యూటోన్.

# చీకట్లో మునిగిపోయిన చిన్నదీపం

బాల చలనచిత్ర సంఘానికి కొత్త కార్యవర్గం ఏర్పాటయింది. పండిత హృదయనాథ కుంజ్రూ స్థానే, బీహారీ మాజీగవర్నరు శ్రీ ఆర్. ఆర్. దివాకర్ అధ్యక్షులు అయ్యారు, ఉపాధ్యక్షురాలుగా శ్రీమతి ఇందిరా గాంధీ తిరిగి ఎన్నికఅయింది. సభ్యులు: శ్రీయుతులు ఆర్. కె. రామధ్యాని, కె. జి. సైయుద్దీన్, ఎ. కృష్ణమూర్తి, అధికార ప్రతినిధులు. పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి వలముత్తు రామమూర్తి, నిర్మాత శ్రీ హితేన్ చౌదరి, ఫిలింస్ డివిజన్ నిర్మాత శ్రీ ఎజ్రా మీర్, అనధికార సభ్యులు మరిద్దరిని తరువాత నియమిస్తారు.

బాలల చలన చిత్ర సంస్థ తీసిన 'లైట్ హౌస్' ప్రస్తుతం దేశాంతరవాసం చేస్తోంది. విదేశాలలోని భారత రాయబారి కార్యాలయాలలో చూపిస్తున్నారట. మనదేశంలో పిల్లలు ఇంకా దీని చూడనోచుకోలేదు. నిర్మాతలు మొహమాటపడుతున్నారో, థియేటర్ యజమానులు చోటులేదని పేచీ పెడుతున్నారో, లేక ఈ చిత్రం భారతదేశంలో పిల్లలకోసం తీసిందికాదో, ఇక్కడమాత్రం విలువలేదో, ఏదో ఓ కారణం ఉండాలని దీనిమీద ఆసక్తిగలవారు నచ్చచెప్పుకుంటున్నారు. ప్రస్తుతానికి, చీకట్లో దారిచూపవలసిన 'లైట్ హౌస్', అందులోనే మునిగిపోయిందేమోనని, ఒకాయన, కారం చమత్కారం కలిపి ధ్వనించారు.



ఉపనయనానికి వచ్చిన అతిథులు శ్రీమతి కన్నాంబను, శ్రీమతి సూర్యకాంతాన్ని పలుకరిస్తున్న జమున



నవశక్తి ఫిలింస్ (హైదరాబాద్) వారి తొలిచిత్రానికి ఆర్థికమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డిగారు ఇటీవల ప్రారంభోత్సవం జరిపారు. (ఎడమనుండి) దర్శకుడు రామినీడు, నిర్మాత గంగాధరరావు, సారధీ అధిపతి రామకృష్ణప్రసాద్, నటి జమున, మంత్రి బ్రహ్మానందరెడ్డి, ఛాయాగ్రహణ దర్శకుడు ఎం. కె. రాజు

జూన్ 7న తిరుపతి సంరంభంతో వెల్లివిరిసింది. చలనచిత్రనటీనటులు అంజలీదేవి, శేలంగి వెంకటరామయ్యగారలు శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి చెరొక పాతిక వేలూ విరాళం ఇస్తున్న సందర్భంగా, విశ్వవిద్యాలయంవారు, వారి గౌరవార్థం విందుచేసి, అభినందనలు తెలిపారు. ఈ ఇద్దరూ విశ్వవిద్యాలయం సెనెట్‌లో శాశ్వతసభ్యులు అయినట్లు ఉపాధ్యక్షుడు గోవిందరాజులు నాయుడుగారు ప్రకటించారు. విద్యామంత్రి పట్టాభి రామారావుగారు సభకు అధ్యక్షత వహించారు. శాస్త్రీ ధర్మారావుగారు మొదలగు పెద్దలు అభినందన పూర్వకంగా ప్రసంగించారు. రిజిస్ట్రార్ రామానుజరావు నాయుడుగారు స్వాగతం చెబుతూ, ఇతరనటులు కూడా ఇలాగే విశ్వవిద్యాలయానికి భూరి విరాళాలు ఇచ్చి విద్యాపీఠాలు వర్ధిల్లడానికి తోడ్పడాలన్నారు.

"'అక్కా నేను చదువుకోవాలి సాయం చెయ్యాలి మీరు' అని ఎందరో విద్యార్థులు నాకు ఉత్తరాలు రాసేవారు ఇంతమందికి సహాయం చేయగలరోజు రావాలని దేవుని ప్రార్థించేదాన్ని. ప్రజల ఆదరాభిమానాలతో ఈనాటికి వృద్ధికివచ్చాను ఇప్పుడు ఈ విద్యాపీఠానికి 25 వేలు సమర్పించ సంకల్పించుకొన్నాను ఇలా చేయగలుగుతున్నందుకు ఎంతో ఆనందంగా ఉంది" అని అంజలీదేవి అన్నది.

నా నూరవ చిత్రం విడుదల కాగానే ఈ పీఠానికి విరాళం ఇవ్వం సంకల్పించాను. ఇపుడు ఈసంగతి ప్రకటించగలగడంవల్ల ఇవాళ నాకు పండుగరోజు ఆంధ్ర విశ్వవిద్యాలయం గటిగా నిలబడింది ఇపుడు ఈపీఠాన్ని కాపాడుకుని, వృద్ధికి తెచ్చుకోవలసిన బాధ్యత మన అందరిమీదా ఉంది." అని రేలంగి అన్నారు

పన్నులభారం లేకపోతే, ఇలా ఎన్నిటికో ఇవ్వవచ్చు అని ఆయన నవ్వుతూ అన్నారు.



# బడిపంతులు

ఆయిన వాళ్ళు కాకుండా పోతే మనసు మహాబాధ పడుతుంది. అకాని వాళ్ళు కన్న కొడుకులే అయితే, ఎ. ఎల్. ఎస్. వారి 'బడిపంతులు' చిత్రంలో బి. ఆర్. పంతులు నటించినంత బాధా కలుగుతుంది. ఈ చిత్రంచూస్తే (గతవారం భరణిస్టుడియోలో పత్రికల వారికి చూపించారు. ఈ 19 నుండి ఆంధ్రలోని ముఖ్య కేంద్రాలలో అందరికీ చూపిస్తూన్నారు) వార్ధక్యపు వర్ష కాలంలో, కన్నబిడ్డలు కూడా తేలిక చేసిన తలిదండ్రుల క్షోభకు రూపకల్పన చేయడమే లక్ష్యమని అనిపిస్తుంది. నటుడు బి. ఆర్. పంతులు, ఆయన సతిగా ఎం. వి. రాజమ్మ అందులో కృత కృత్యులయారు కాని దీని కథాకమామీషూ గమనిస్తే, దర్శకుడు పంతులుకు, నటుడు పంతులుకు ఆదర్శ ప్రాయమైన అవినాభావమైన ఐకమత్యం ఉందని, ఇద్దరూ ఏకాభిప్రాయులని ఢంకామీద దెబ్బకొటి చెప్పకోలేము చిత్రం పేరు కథ ఆరంభించి నడిపిన తీరూ కథావస్తువుకు దగ్గర చుట్టాలుకావు. ఈ సంగతి మర్చిపోయి (లేదా దృష్టిలో ఉంచుకుని) చూస్తే ఈ చిత్రం, అందులోని ముఖ్యపాత్రల కథ ప్రశంసనీయంగా కనిపిస్తాయి. అప్పుడు అందులోని ఇతర భాగాలు అనేకం అనవసరం అనిపిస్తాయి. ఏమైనా ఊహామంచిది కాబట్టి గౌరవించ తగ్గది ఈచిత్రం. కన్నడంలో ఇది మొదట తయారైంది. ఇటీవల తమిళంలోకి, ఇపుడు రావూరి ('చక్రపాణి') సత్యనారాయణగారిచే తెలుగులోకి తర్జుమా అయింది

లంచములు ఇవ్వకుము, పుచ్చుకొనకుము, నీతిగా ఉండుము అన్న నీతి వాక్యాలను ఈ బడిపంతులు, బడినడిపే పంచాయతీ ప్రెసిడెంటు జీవితంలో స్థాపించబోవడంతో కథ ఆరంభం అవుతుంది. వారిద్దరికీ జరిగిన ఘర్షణ ఫలితంగా ఆదుష్టుడు పదవీభ్రష్టుడై పంతులు మీద పగపడతాడు. ఆయన ఇలు తగలపెడతాడు అప్పుడు ఆ ఎలిమెంటరీ బడిపిల్లలు చందాలువేసుకొని పది పదిహేను వేలరూ॥లు చేసే ఇల్లుసెట్టుకటి గురువుగారికి బహూకరిస్తారు. ఈలోగా ఆయన, ఊరివారూ నానా ప్రయాసపడి, బడికి భవనం కట్టడానికి ఐదు వేలు చందాలు పోగుచేస్తారు. ఆ డబ్బుని, దుష్టుడు పంచాయతీ ప్రెసిడెంటు దొంగిలించబోయి దొరికి పోతాడు. ఇక్కడితో బడిపంతులు కథ ముగిసి పంతులుకథ ముందుసాగుతుంది.

కొడుకులిద్దరూ పెరిగి పెద్దవాళ్ళూ, గొప్ప వాళ్ళూకూడా అవుతారు. కూతురూ అత్తారింటికి వెళుంది. అప్పటికి పంతులు రిటైరు అయి పింఛను తీసుకుంటాడు. అప్పులవాళ్ళు చుట్టుముడతారు. ఇల్లు, పిల్లలు కట్టిచ్చిన దన్నభావంతో, తాకట్టు పెట్టడానికీ, తెగనమ్మి అప్పుతీర్చడానికీ పంతులు ఇష్టపడడు. భోగభాగ్యాలతో తులతూగుతున్న [illegible]కులను పిలిపించి సంగతి [illegible]ంతాడు. డబ్బు అడగగానే, కన్నబిడ్డలు [illegible]నా మొహా మొహాలు చూసుకుని, చివరకు [illegible]కరూ, తండ్రికొకరూ ఆశ్రయం ఇవ్వ[illegible]డతారు. వృద్ధదంపతులు అలా చెరోటా ఉంటూ, అక్కడ నానాఅవస్థలూ [illegible]తారు. దొంగతనంవంటి నిందలుకూడా [illegible]నపడతాయి

గన్ అరిసు శివాజీగణేశన్ చివరకీ కథలో రపడి పోలీసు వేషంలో వచ్చి, అందర్నీ [illegible]చోట చేర్చి సంతోషకరంగా సమస్య [illegible]రిష్కరిస్తాడు. ఈ చిత్రంలో చూడతగ్గ భాగం అంతా, పైపేరా చివర ఉన్న నాలుగు వాక్యాలమాటు నేఉంది. రాజమ్మ గొప్పగా నటించింది ఆమె పెద్దకోడలుగా జానకికూడా చెప్పుకోతగసాలభ్యంలో పాత్ర నిర్వహించింది. బి. సరోజ, కొత్త తెలుగు నటుడు సూర్యకుమార్, చేసిన ముఖ్యమైన పని యుగళగీతాలకుతగ్గట్టుగా, మహాబలిపురం శిల్పాలముందర పరుగులెత్తడమే. ఉన్నంతలో సూర్యకుమార్ బాగా నటించాడు కాని, అతనికీ, పలువురు ఇతరనటులకూ ఛాయాగ్రహణం న్యాయం చెయ్యలేదు. దానికితగ్గట్టూ మేకప్ కొటాలుకూడా, బడిపిల్లలనాటకంలో వేషాలను హడావుడిగా వేసుకున్నట్టు ఎబ్బెట్టుగా కనిపిస్తాయి. కన్నడ హాస్యనటుడు నరసింహారాజుహాస్యం హుషారుగా ఉంది. విలన్ పాత్ర ధరించిన మాధవరావు చేసినపని, - కన్నడ సీమలో ఎలాఉన్నా, మనప్రాంతాలలో నటన అనిపించుకోదు. రావూరివారి డైలాగులు చక్కని హాస్యంతో హుషారుగా నేఉన్నా, వాటిని తొడుక్కున్నవారికి అవి అమోఘంగా సరిపోలేదు. పాటలుమటుకు చాలా బాగా కుదిరాయి శ్రీనివాస్, సుశీల, రాజా, లీల ఆయాపాటలు హాయిగా పాడారు. సంగీతనాటకంగా చూపించిన రామాయణ కథ చాలా బాగుంది. రచన చక్కని సంగీతం, ముద్దొచ్చేపిల్లలనటన, కలసి దాన్ని ముద్దుగా తీర్చి దిద్దాయి. ★

## రాబర్ట్ డొనాట్ మృతి

ఉత్తమనటుల శ్రేణిలో అగ్రగణ్యుడైన బ్రిటిష్‌నటుడు రాబర్ట్ డోనాట్ గతవారం మృతి చెందాడు. విన్స్లోబాయ్, కౌంట్ ఆఫ్ మాంటిక్రిస్టో, గుడ్‌బై మిస్టర్ చిప్స్ చిత్రాలలో నటన అతనికి ప్రపంచావధిని కీర్తి గడించిపెట్టింది. ముఖ్యంగా చివర పేర్కొన్న చిత్రంలో డోనాట్ ధరించిన బడిపంతులు పాత్రను, చూచిన వారు ఎన్నటికీ మరువలేరు. ★

---

# ★ లోకంతీరు ★

( 7 వ పేజీ తరువాయి)

అతిథులను ఇంట్లోనుంచి వెళ్లగొట్టటం న్యాయశాస్త్రరీత్యా నేరమవుతుంది! అందుచేత [illegible] నేను మీకు 'రికమెండ్' [illegible]

ఒక విషయంమాత్రం మీరు ముందుగా [illegible]లుసుకోవాలి! మీరు ఏ విధంగా మాట్లా[illegible]నా సరే ఆ మాటలు 'సుగర్ కోటెడ్ [illegible]ప్స్' లాగ వుండాలి! అంటే కులేరియా మాత్రలులాగ వుండాలి! ఈ సిద్ధాంతం బాగా జ్ఞాపకం వుంచుకొని మీరు సంచరించారంటే మీరు తలపెటిన కార్యంలో మీకు అఖండ విజయం గ్యారంటీ!

నిజానికి మీ యిళ్లకు బంధువులు, స్నేహితులు అనేవాళ్లే ఎక్కువగా వస్తారు. వాళ్లకీ మీకూ బాగా దగ్గిర బంధుత్వంకాని, ప్రాణస్నేహంకాని వుంటుందనుకోండి—వాళ్లను ఇంట్లోనుంచి వెళ్ళగొట్టటం అనేది అంత సులభంకాదు మరి! అందుకని ముందస్తుగా మీరు ఒక పని చెయ్యాలి! అయితే ఈ విషయంలో మీరు జాగ్రత్త పడవలసినది [illegible]టంటే, మీరు వాళ్లని ఇంట్లోనుంచి [illegible]ళ్ళగొట్టాలనుకొంటున్నట్టు వాళ్లకి ఎంత మాత్రమూ తెలియకూడదు! తెలిసిందంటే- వాళ్ళల్లో నాలాంటి మొండివాడు, పెంకివాడూ ఎవడేనా వున్నాడంటే—'ధాం' మ్మని పేలవలసిన టపాకాయ, 'తుస్సు' మని ఛీదేసిందన్నట్లు మీ శ్రమ అంతా వృధా అయిపోతుంది! తస్మాత్ జాగ్రత్తో జాగ్రత!

అందుచేత ఈ విషయంలో భార్యాభర్తలు ఏకాభిప్రాయంతో పని చెయ్యాలి. లేకపోతే లాభంలేదు. ఒకవేళ మీకూ మీ భార్యకూ ఏమైనా మనఃస్పర్థలు అంతకు ముందేవచ్చి వున్నాయనుకోండి. ఇంటికి వచ్చిన అతిథులు వెళ్లిపోయేవరకూ ఆ మనఃస్పర్థలు పూర్తిగా మర్చిపోవాలి! ముందుగానే భార్యాభర్తలు ఇద్దరూ కలసి ఆలోచించుకోవాలి. మూడుపంతుల ఇళ్ళల్లో భార్య తరఫు బంధువులని వెళ్ళగొట్టాలని భర్తకూ, భర్త తరఫు బంధువులని వెళ్ళగొట్టాలని భార్యకూ చాలా చాలా ఇష్టంగా వుంటూ వుంటుంది! స్నేహితుల విషయంలో కూడా వాళ్ల అభిప్రాయాలు అల్లాగే వుంటాయి! కాని మీరు ఇష్టపడి మీ భార్య గనక ఇష్టపడకపోతే మీ గతి త్రిశంకు స్వర్గమన్నమాటే! అందుచేత ఈ విషయంలో మీ భార్యతో రహస్యంగా ఆలోచించిన తర్వాత కార్యరంగంలోకి దిగండి.

"నేను నిజంగా గట్టిగా కొడుతున్నట్లు నిన్ను కొడతాను! అంటే మెలిగానే కొడుతూ ఏదైనా చప్పుడు చేస్తానులే! నువ్వు నిజంగా నే ఏడుస్తున్నట్లు, గట్టిగా అరుస్తూ ఏడు! బాగా ఏడు! కళ్ళమ్మట నీళ్లు రావేమో అని అనిపిస్తే, అమృతాంజనమేనా, జామాయిలేనా కళ్లకి కొంచెం రాసుకో! ఇదంతా ఉత్తుత్తి నాటకం సుమా! నిన్ను గట్టిగా కొట్టనులే! భయపడకు" అని రహస్యంగా మీ భార్యతో ముందే చెప్పండి. లేకపోతే ఇంటికొచ్చిన ఆ అతిథులముందు మీరే ఇంట్లోనుంచి బయటికి వెళ్లవలసినగతి మీకు పట్టినా పట్టవచ్చు! "రహస్యంగా" అని ఎందుకంటున్నానంటే కొంతమందున్నారు చండశాసనులు! వాళ్లు- "మీరు ఆవిడని కొట్టాలని కొట్టలేదు, ఆవిడ ఏడవాలని ఏడవలేదు, నేను వెళ్లాలని వెళ్ళలేదు!" అంటూ వెనక్కి తిరిగివచ్చే అతిథులున్నారు! తస్మాత్ జాగ్రతో జాగ్రత!

మీరు మీ భార్యను తిట్టినాసరే, కొట్టినా సరే ఆమె ఎగురుమాట మాట్లాడకుండా వుండేటట్లు ఆమెవద్దనుంచి మీరు గనక ఒక వాగ్దానాన్ని తీసుకోగలిగారంటే, ఇంటికి వచ్చిన అతిథులని వెళగొట్టటం విషయంలో మీరు సగంవరకూ జయం పొందారన్నమాటే! ఎందుచేతనంటే మీరు మీ భార్యతో ధూం, ధాం అంటూ చిరచిరలాడుతూ ఫట్ ఫట్‌మంటూ దెబ్బలాడటం చూసిన ఆ అతిథులు-"ఇదెక్కడ గొడవరా బాబూ! నిశ్చింతగా, సుఖంగా వీళ్ళింట్లో నెల్లాళ్ళు పాటేనా వుండిపోదామని ఇక్కడకు వస్తే, వీళేమో అస్తమానూ దెబ్బలాడుకొంటున్నారేమిటి ఖర్మ! ఇంతకన్నా మనింట్లోనే కాస్త మనః

# లోకంతీరు

శ్రాంతిగా వుంటుంది"—అనుకొని వాళ్ళు ఆ రోజే మూటకట్టేస్తారు!

మీరూ మీ భార్యా కలసి పోట్లాడటానికి సమయం, సందర్భాలు కూడా చూడాలి మరి! వస్తే అడిగితే, అతిథులతో పాటు భోజనానికి కూర్చున్న సమయం, సందర్భం ఈ విషయానికి చాలా మంచిది! భోజనం చేస్తూ కూరలో కారం ఎక్కువైందనీ, పులుసులో పులుపే లేదనీ అంటూ మీ భార్యను నోటికొచ్చినట్లల్లా తిట్టండి! మీరు 'ఎవర్ సిల్వర్' కంచాలలో గనక భోజనం చేస్తూన్నట్లయితే ఆ కంచాల్ని విసిరేయటంకూడా చాలా మంచి పని! మీరూ మీ భార్యా కలసి చేసుకొన్న ఒడంబడిక ప్రకారం—మీ భార్య మహా పతివ్రతకన్నా మహాపతివ్రత కదా! అందుచేత ఆవిడగారు పల్లెత్తు మాట కూడా ఎదురు సమాధానం చెప్పకుండా మొసలి కన్నీళ్ళు కారుస్తుంది! ఈ వ్యవహారం అంతా చూసిన ఆ అతిథులకి గుండె చేజారయిపోయి, కిక్కురుమనకుండా వెంటనే తమ ప్రయాణానికి మూటాముల్లె కట్టేస్తారు!.

అప్పటికీ కదలరనుకోండి కొంతమంది! ఆ అతిథులకి వడ్డించే చారులోనూ, పులుసులోనూ ఒక కుంచెడు ఉప్పుపొయ్యండి! (ఉప్పు ఎందుకు చెబుతున్నానంటే, మరి, యీ కాలంలో అన్నింటికన్నా చవగ్గా దొరికేది అదొక్కటే!) ఆ తర్వాత మళ్ళీ మామూలే!-మీరు భార్యను తిట్టటం ఆవిడ మొసలి కన్నీళ్ళు కార్చటం! ఆ ఉప్పు కషాయాలవంటని ఎన్నాళ్ళని తింటారు ఆ అతిథులు? చచ్చినట్టు కాళ్లకు బుద్ధి చెబుతారు!.

అతనికన్న ఘనుడు ఆచంటమల్లన్న అన్నట్లు మీరు ఉప్పు కషాయాల వంటలు తయారు చేయించినాకూడా కదలని అతిథులు కొందరు వున్నారు! మీరు ఒక ఎత్తు వేస్తే అందుకు పైఎత్తు వేస్తారు వాళ్లు!

ఇంటికి వచ్చిన అతిథులను పసుపసుకో పెట్టి బయటకు పంపించివేయటంకూడా యిందుకు ఒక దారి అనేది నేను కాదనను. కాని వాళ్లని నిజంగా పసుపసుకో పెట్టకూడదు. అతిథులు యింటికి వచ్చిన సమయంలో—పొద్దున్నే లేచి హడావుడిగా మీరు బయటకు వెళ్ళిపొండి. దారిలో ఏదైనా హోటలులో భోజనంచేసి అఫీసుకు కూడా వెళ్ళిపొండి. మీరు వసారుకదా, మీతో కలసి భోజనం చేద్దామనుకొంటూ, మీకోసం చూసి చూసి చివరకు ఏ ఒంటిగంటకో, రెండింటకో ఆ అతిథులు భోజనం చేస్తారు! కాని మీరు ఇంటికి ఎందుకు రాలేదో మీ భార్యకు తెలుసుకాబట్టి, ఆవిడ రహస్యంగా, గప్ చిప్ గా తన భోజనం పూర్తిచేసుకొంటుంది. మీరు ఆవిడ కోసం ఆదుర్దా పడనవసరం లేదు! రాత్రిళ్లు కూడా మీరు ఇంటికి ఆలస్యంగా వస్తూ వుండండి. అంటే ఈ సందర్భాన్ని ఆధారంగా తీసుకొని ఫస్టు షో సినిమా చూసి, ఇంకా ఓపికవుంటే సెకండ్ షో కూడా చూసి రాత్రి ఏ రెండింటికో ఇల్లు చేరుకోండి.!

ఆ అతిథులు మిమ్మల్ని ఏమైనా అడిగితే 'ఆఫీస్ ఇన్స్పెక్షన్ జరగబోతోందని, అందుకుగాను రికార్డులన్నీ సరిచూచుకోవటంలో చాలా పొద్దుపోతోందని," తెగించి, ధైర్యంగా ఓ అబద్ధాన్ని చెప్పేయండి! ఈ పరిసిలి అంతా రెండుమూడు రోజులు చూసేసరికి వాళ్లకి నిజంగా పిచ్చెక్కి మూటకట్టేస్తారు!

ఇటువంటి యుక్తులకుగూడా లొంగని అతిథులు కొందరున్నారు. వాళ్లని ఒక విధముగా వెళ్ళగొటవచ్చు అంటే—వాళ్ళ భార్యలకు ఇంటిపని అంతా అప్పగించివేయటమే! మీ ఇంట్లో సుఖపడటం కోసమే వాళ్ళు మీయింటికి వస్తారు కాని, వాళ్ళ భార్యలచేత మీ ఇంటి చాకిరి అంతా చేయించటానికి మాత్రం వాళ్ళు మీ ఇంటికి రారనే సంగతి మోస్ట్ ఇంపార్టెంటు. మీయింటికి ఏసమయంలో ఎవరు వస్తారో అనే ముందాలోచనతో, మీ భార్య ఒక సేరు సీసాడు తియ్యటి ఎర్రనీళ్ళ మందు తెప్పించుకొని రెడీగా వుంచుకోవాలి! ఆ అతిథులు మీ యింటికి వచ్చిన రోజే— "వారం రోజులనుంచీ ఒకటే తలపోటు! కడుపులో ఏమిటో తిప్పుతున్నట్టు అస్తమానూ వికారంగా వుంటోంది. కూర్చోటానికీ, నుంచోటానికీ కూడా బాధగానే వుంది! సరిగ్గా సమయానికి దేవుడు నిన్ను పంపినట్టుగా వుంది నువ్వు రావడం! ఈ పూటకి వంట కాస్త చేసి పెడుదూ!' అంటూ తియ్య తియ్యగా ప్రేమగా మాట్లాడుతూ ఆ అతిథి భార్యకు వంటపని ముందు అప్పగించివేయాలి ఆతర్వాత దాసీదానితో రహస్యంగా మాట్లాడి ఓ వారంరోజుల పాటు దానికి సెలవు ఇచ్చెయ్యాలి! ఆ తరువాత తలకు గట్టిగా ఒక గుడ్డ బిగించుకొని గట్టిగా మూల్గుతూ మూలగటం—గంట గంటకీ ఆ ఎర్రనీళ్ళ మందు తాగటం—సాయంత్రానికి తలనొప్పిని జ్వరంగా మార్చేసుకోవటం!

చాలు! చాలు! ఇంక వ్రాయనక్కర్లేదు. ఏన్నాళ్లుంటారు ఆ అతిథులు! ధనా ఫన్!

అమెరికా వెళ్లి తిరిగివచ్చిన పెద్దమనిషి తన అనుభవాలను గురించి స్నేహితులతో చెపుతూ ఇలా అన్నాడు "మేము నయాగరా జలపాతాన్ని చూశాం. ఆ జలపాతంలో ఎంతశక్తివుందంటే జలపాతాన్ని చూస్తూ మా ఆవిడ ఒక నిముషంసేపు మాట్లాడటమే మానివేసింది."

—బోసుబాబు.]

మర్నాడే మూట కట్టేస్తారు!

ఇన్నిరకాల అస్త్రాలు ప్రయోగించి లొంగని అతిథులు కొందరున్నారు! ఇంక వాళ్ళని వెళ్ళగొటటానికి ఒక్కటే ఉపాయం! సాధారణంగా ఈ సా... ఎవరూ తప్పించుకోలేరు! ఈ ఉపాయం రెండుభాగాలు. వాళ్ల పిల్లలకీ మీ పిల్లలకీ మస్యాకుమ్ములాటలూ, కీచులాటలూ వచ్చేటట్లు చెయ్యటం మొదటిభాగం! దాంతో వాళ్ళకి అక్కణ్ణుంచి వెళ్ళిపోవాలనే భావం కలుగుతుంది. ఇంక రెండవభాగం- మీ భార్యమీద కేకలు వేస్తూ వాళ్ల వైపు అనుమానంగా చూస్తూ—"నా కోటుజేబులో పది రూపాయల కాగితం ఉంచాను ఏమయింది? డ్రాయరులో నిన్న రూ... రూపాయల చిల్లర పెట్టాను ఏమయింది? అని గట్టిగా అరవండి!

ఇంక ఎక్కువగా వ్రాయనక్కరేదు! దెబ్బతో గాని దెయ్యం వదలదన్నట్టు, ఈసారి ఆ అతిథుల పని ఫినిష్! మీరు బతిమాలి పిల్చినాకూడా మళ్ళీ ఎప్పుడూకూడా వాళ్ళు మీయింటికి యింక రారు!

చాలా బాగుంది వ్యవహారం! నేనె ఎప్పుడైనా మీ ఇంటికి వచ్చాననుకోండి! నీవు చెప్పిన విద్యయే నీరజాక్షి అన్నట్లు ఈ అస్త్రాలన్నీ నామీద ప్రయోగించారంటే మాత్రం నేను ఊరుకోనుసుమా! మీరు అనుకొంటారు—పద్మవ్యూహంలా పన్నగడ పన్నేశామని! కాని ఆ పద్మవ్యూహాన్ని ఛేదించేందుకు నేను అర్జునుణ్ణే అయిపోతాను! తస్మాత్ జాగ్రతో జాగ్రత!

అన్నీ బాగానే వున్నాయికాని, శ్రీ చివరి అస్త్రప్రయోగానికూడా ఆ అతిథులు కదలకపోతే ఏంచెయ్యాలి? అని అడగాలనిపిస్తుంది కొంటెకోణంగికి! తూర్పు తిరిగి దణ్ణంపెటండి!

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



...వెనువెంటనె భామవెడలె"

ఫొటో : ఎస్. గిరిధర్.]